శ్రీ విచిత్ర నవలా గ్రంథమాల,

తృతీయ పుష్పము.




# మాయామయి.

(మూఁడవ భాగము)



కోసూరి రంగ...

నరా... 1929.

శ్రీవిచిత్రనవలాగ్రంథమాల,

తృతీయ పుష్పము.



# మాయామయి.

(మూఁడవ భాగము)

కోసూరి రంగయ్యచే

రచియింపఁబడినది.



(మొదటికూర్పు)

ప్రకాశకులు,

కోసూరి రంగయ్య అండ్ సన్సు

విచిత్రనవలా గ్రంథమండలి

నర్సాపురం.

1929.

శ్రీ విచిత్ర నవలా గ్రంథమాల:



# మాయామయి

శ్రీ

# మాయామయి

## మూఁడవ భాగము

### మొదటి ప్రకరణము.

---

పండిత జగన్నాథుఁ డటుల జాలిమఖానుని జూడనరయనేగెను. కాని, యతఁ డిపు డెచటికిఁ బోవును? ఏమి సేయును? వాని నెటుల బంధించి తెచ్చునను విషయము లెవరికిఁ దెలియవు. జాలిమఖానుఁడు తన కడపటి ప్రకటనమందు "మీ మహలునందుఁ బ్రవేశింతు" మని ప్రతాపభానుమహారాజునకు భీతిఁగొల్పి యుండెను. ఆప్రకటనము భూపాలునిపైఁ దన ప్రభావము కొంచెమునో గొప్పగనో చూపియుండుటచేఁ బహారాలయందుఁ గావలివాండ్రను బాగుగ వృద్ధిపఱచియుంచుట కాదేశమొసంగి తా ననవరతము రాత్రికాలమంతయు జాగరణమునందే కడపుచుండెను. వాని కరమెప్పుడు తలవారిపిడితో వియ్యమందు చుండెను. జగన్నాథుని యాగమనమువలన వానికి కొలఁదిగ ధైర్యము చేకూరియుండెను. జాలిమఖానుని కనుఁబ్రామి బంధించి తెచ్చుట కేనాఁడు జగన్నాథుఁడు వెడలియుండెనో దానికి మఱుసటి దినమున మరలఁ గొన్ని ప్రకటన పత్త్రములా వీథు నందెల్లెడల రాజబాటలయందును గుజలీలయందును నతికించఁబడియుంటఁ గని పురవాసులెల్లఱు సంక్షుభితమనస్కులయి యుండిరి. ఒక చారుఁడా ప్రకటన పత్త్రములలో నొకదానినిఁ గొని తెచ్చి పేరోలగమున భూపాలుని సమక్షమందిడెను. అరిమిత్త్రసింహుఁడా పత్త్రమును గైకొని చదివి భూ

పాలునకు వినిపించెను. దానియందీ దిగువను లిఖించిన విధంబున వ్రాయఁబడి యుండెను.

"ప్రతాపభానుమహారాజా! జాగరూకుఁడవై ప్రవర్తింప వలయును. జగన్నాథ వైయాహుని యందుగల విశ్వాసమున నేమఱి యుండ వలదు. వాఁడు మొన్నటి బాలుఁడు. మమ్మేమి సేయఁగ లఁడు! మీకు జాలిమఖానుఁ డొక్కఁడే శాత్రవుఁడని తలంచియుందు రు. కాదు కాదు. నేను నిచటికి వచ్చి చేరితిని. పదునైదు దినముల లో నీప్రోలు నిర్మానుష్యముగ నొనరించి వైచెదను. నేఁటి నుండి పదునాల్గవ దినమున జగన్నాథుని శిరమును ఖండించి తెచ్చి రాత్రి రెండు జాములవేళ మీనగరియందుఁ బ్రవేశించెదను. జాగ్రత్త! జాగ్రత్త!! మీకు సామర్థ్యము గలిగియుండిన నన్ను సమయము న బంధింపుఁడు. అట్టి విదగ్ధుఁడు మీలో నెవఁడు గలఁడో వీక్షింపవ లసి యున్నది. ఈభూపాలుని యెడల వైరభావము గలిగియున్న వారు నన్ను కలిసికొనుట కభిలషించు నెడల "ఛోటీచోటీ" నొద్ద యర్ధరాత్రమున గలిసికొనగలరు.

ఇట్లు,
అఫ్ఘాను ఖూనీ.

ఈ ప్రకటనము వలన భూపాలునియందు మిగిలియున్న ధీరత్వ మంతయుఁ బంచబంగాళమయ్యెను. గొరిగడము విడిచి యెచటికేని యు బలాయనము సముచితముగ వానికి దోఁచెను. కాని వాని యం దలి బాహువీర్యబలపరాక్రమములు వానినట్టి తలంపునుండి వెంటనే మ రలించి వైచెను.

పిదపఁ బ్రతాపభానుమహారాజు కొలువుఁ జాలించి యరిమిత్ర సింహుని వెంట నిడుకొని రహస్యాలోచన మందిరములోనికిఁ బోయి కూర్చుండెను. మఱియు వానితో, "నాఫత్ ఖానుఖూనీ" విషయము

నుగూర్చి ముచ్చటింపఁ దొడంగెను. "మంత్రివర్యా! జాలిమఖానుఁడ ను వాఁడొకఁ డరుదెంచి గురుతరోపద్రవములను గలిగించుచు నాదేహ మందలి ప్రాణములను శుష్కింపఁ జేసియుండెను. ఇపుడాఫత్ ఖానుఁ డేతెంచి నామేనున నిలిచియున్న ప్రాణములను నిశ్శేష మొనరించు చున్నాఁడు." అనెను.

"మహారాజా! జగన్నాథుని రాకవలన జాలిమఖానుఁడు పట్టు వడునను విశ్వాసము గలిగినది. కాని, యిపుడు వాని రక్షణమార్గము నాకుఁ బొడకట్టకున్నది."

"నేఁ డేవిధముననైన నీవృత్తాంతము దేవీగడమునకుఁ జేర్చుట శ్రేయోదాయకము. అచటనుండి జగన్నాథునకు బాసటగఁ గొంద ఱైయారులు రాగలరు!"

"మన మిపు డెవనిని దేవీగడమునకుఁ బుత్తెంచినను వాని ప్రాణ ములకు ముప్పు వాటిల్లక మానదు. రెండువందల భటుల కావలియుం దొక లేఖను బనిచిన నది యచటికిఁ జేరఁ గలదు."

"(క్రోధావేశముతో) మన కొలువునందుఁ బేరున కైదువంద లు గూఢచారులు కలరు. వారలనేక వత్సరములనుండి జడమతులు వలెఁ గూర్చుండి యుండియు నేఁడొక కార్యమయినను జేయజాలకున్నా రు. జాలిమఖానుని జాడ నొకరును కనుగొన జాలకుండిరి. పోనిమ్ము. తుదకొక జాబునైనను దేవీగడమునకుఁ జేర్పఁజాల కున్నారు."

"ఒక చారుఁడు నైదుగు రాశ్వికులు చంపఁ బడుటచే వారలు భీతావహ చిత్తులయి యున్నారు."

"మంచిది. రేపటి సాయంకాలమున మన చారులందఱ నీ యుద్యానవనము లోనికి వెంటఁ గొని తెమ్ము. వారి వలన నే కార్యమయినను నెఱవేరవలయును. కానిచో, వారి నందఱను ఫిరంగి మెదుట నిలిపి ద్రోరింపనగును. పిదప నేమి తొడరునో కాంచెదము

గదా? నేను స్వయముగ నాదుష్టులను బంధింప నేగెదను."

"చిత్రము."

"నీ విపుడు వెడలి నేను తెలిపిన విషయములను గూర్చి ప్రయత్నింపుము."

మంత్రి యరిమిత్రసింహుఁ డాభూపాలుని వలన ననుజ్ఞ బడసి తన గృహమును జేరుకొనెను. కాని, యతఁడు మిగులఁ గలఁతనొందుచు నిటులఁ దలపోయ దొడంగెను. "అకటా! నేనేమి సేయుదును? చారులవలన నెట్టి కార్యము గొనసాగకుంట నిక్కవము. పాపము! రేపటి దినమున వారలందఱు నొక్కమాఱుగ మృత్యువాతఁబడ నుండిరి కదా? భూపాలుఁడు స్వయముగ నాదుష్టులను బంధింపఁ గోట వెడలిన నా ప్రాణంబులును బోయినటులనే తలంపవలెను. ఇపుడు జీవించుట కుపాయాంతర మెద్దియుఁ బొడకట్టకున్నది." ఇట్టివిధంబులగు, పెక్కు సంగతులఁ దలపోయుచు నతఁడు చింతాక్రాంతచిత్తుఁడయి యుండెను.

---

## రెండవ ప్రకరణము.

కుమారవిజయేంద్రసింహుఁ డేమందిరమున కుమారికరుణాదేవి ప్రతిమ దర్బారును గాంచి యుండెనో, ఏతావునకు గొందఱు యువతీమణులు, వాని నొక యపరాధుని విధంబున వెంటఁగొని పోయియుండిరో యాతోఁట లోని కతఁడు తన మైయారుల వెంట నాద్వారము దాఁటి లోన బ్రవేశించెను.

తోడనే కొంతదూరమునుండి తమ దెస కరుదెంచుచుండిన యొక యువతీమణి వారి దృష్టిపథములఁ జిక్కెను. ఆమె మిగుల విలువ

గల దుస్తులను ధరించియుండెను. ఆవన్నెలాడి కుమారవిజయేంద్రసింహుని సమీపించి యొక జాబు వాని కొసంగెను. కుమారవిజయేంద్రసింహుఁ డాశ్చర్య నిమగ్నమానసుఁడయి యాలేఖను విప్పి చదువుకొనెను. దానియం దీదిగువ నుదహరించిన విధంబున వ్రాయఁబడి యుండెను.

"మీరు కొన్నిదినములనుండి మా యధికారసంబంధప్రాంతములయందు సంచరించుచున్నారు. మిమ్ములను సన్మానించుట మా విధికృతము. మిమ్ము గౌరవించుటకు నేఁడన్ని విధంబుల సంసిద్ధులమయి యుంటిమి. కావున మీరలీ పరిచారిక వెంట నరుదెంచి మాపూరింటిని శోభావంతముగ నొనరించెదరు గాక!"

ఇట్లు,

సిద్ధనాథయోగి.

కుమారవిజయేంద్రసింహుఁ డాలేఖ నభయసింహున కొసంగెను.

అతఁ డాలేఖను జదువుకొని, "యోగియా! సాధువా! అందువలననే యీకమ్మయందు కొంచె మాజ్ఞాప్రచారము వెల్లడియగుచున్నది." అనెను.

మోహనసింహ యోగీంద్రనాథులు నాకమ్మను జదువుకొనిరి.

సంధ్యా సమయం బాయెను. కుమారవిజయేంద్రసింహుఁ డింకను దానికిఁ బ్రత్యుత్తర మొసంగలేదు. అభయసింహుఁడా యువతి దెసఁ బరికించి, "మగువా! మాకా మహాభాగుని సన్మాన మంగీకారమే. ఇపుడు సంధ్యోపాసనా సమయము సమీపించి యుండుటవలన మేము నీవెంట రాఁజాలము. ఒకగడియకాలము తాళి పిదప వచ్చెదము" అనెను.

"నే నంతదనుక నిచట వేచియుండెదను. మీరు సంధ్యపూజల నొనరింపుఁడు. అనుమతింతురేని, యాసనములను జలములను వెం

టఁగొని తెచ్చెదను.

"వలదు. ఏమియు నగత్యములేదు."

"అగుచో, యిచట సంధ్యపూజల నెటుల నిర్వర్తించెదరు? ఈ తోఁటయందుఁ బ్రవాహముగాని తటాకముగాని బావిగాని లేవుకదా?"

"ఆ రెండవ తోఁటయందొక కమలాకరము గలదు."

"మీరలంతగ శ్రమనొందనేల? నే నిపుడే వాని నన్నింటిని సమకూర్చి తెచ్చెదను. లేదా! నావెంట విచ్చేయుఁడు. అచట నన్ని సౌకర్యములు గలిగియున్నవి. మీరచట సంధ్యావందనము లాచరింపనగు."

"కాదు. మేమిచటనే సంధ్యాకృత్యములను దీర్చుకొందుము. మంచిది. నీవు వెడలి తోయములను వెంటఁగొని తెమ్ము."

అంత నాయువతి వ్యావృత్తయై తననివాసము వైపునకుఁ బరుగిడెను. పిదపఁ గుమారవిజయేంద్రసింహుఁ డభయసింహుని దెసఁ బరికించి, "మిత్రమా! ఈలేఖను బుత్తెంచిన సిద్ధనాథయోగి, నాఁడు నేనా కొండగుహనుండి క్రిందికి దుముక నుంకించుచుండ నరుదెంచి నాకరమును బట్టుకొనిన వాఁడు కాఁడుగదా? అట్టులే యగునెడ, నియ్యది మిక్కిలి సంతోష విషయము. అచట మనకు వనకన్యక సందర్శన లాభమును గలుగగలదు. నీ వటులేల పల్కితివి? మనమా తావునకేగి సంధ్యాపూజలనేల నిర్వర్తించుకొనరాదు? నేనపుడే నిన్నీ విషయమును గూర్చి ప్రశ్నింపఁ దలంచితిని కాని, దానియం దెట్టిదియో ప్రయోజనముండక మానదని యూహించి మిన్నకుంటిని" అనెను.

"అందొక ప్రయోజనమును గలదు."

"అది యెట్టిది?"

"అయ్యదియుఁ దెలియఁగలదు."

"ఇపుడేల వచియింపరాదు?"

అంత నభయసింహుఁడు దరహాసవదనుఁడయి, మిత్రమా! నీ వాప్రయోజనమును గుర్తింపఁ జాలవైతివి. ఆయోగి మన భోజనప దార్థముల యందుగాని జలములందుగాని మచ్చుమందుఁ గలిపి మనల ను వంచించునేమో యని శంకించితిని. మఱియు మనల నిచటినుండి వెడలించి యిటకు మగిడి రాకుండ ద్వారములన్నియు బంధించివైచిన మన పరిశ్రమ యంతయు వ్యర్థంబగుననియుఁ దలంచితిని. మిత్రమా! మున్ను నీ విచ్చోటనే కదా మూర్ఛగలిగింపఁ బడితివి! నీవట్టుల యువ తీ సంఘమువలన బంధింపఁ బడినపుడు ప్రతిమ దర్బారునుండి మఱియొ క గదిలోనికిఁ గొనిపోబడిన పిదప నీరువట్టుచే గొంచెము జలమును గ్రో లి యాపమయంబుననే మూర్ఛాగతుఁడ వైతివి. కానిచో, నీవా స మయంబున నిచటి సకల వృత్తాంతములను గ్రహింపగలిగియుందువు. మన మిపుడు వాని యాతిథ్యమును నిరాకరించుటయు సముచితముగా దు. మనము వాని సన్మానము నంగీకరించిన పిదప వాని యాతిథ్యము నిరాకరించుట యధర్మము."

"ఇపుడే యుపాయాంతరమును దలపోసియుంటివి?"

"(నవ్వుచు) ఉపాయమేమి కలదు? మనకు తిలస్మమందు లభిం చియుండిన గులాబిపూవు నరగఁ దీసి మెల్లఱకు దాల్పించుటయే! ఏడు దినముల వఱకు మనల నెవరును మూర్ఛాగతులనుగ నొనరింపఁ జా లరు."

"ఆహా! ఓషధులవలన నిట్టి యపూర్వప్రభావసమన్వితంబులగు పూవులను నిర్మించిన యావైద్య రాజెంతటి చతురుఁడో కదా?"

"నిక్కువము."

ఇట్టివిధంబున బ్రసంగించుచుండ సిద్ధనాథయోగీంద్రునిచే బు త్తెంపఁ బడిన యువతి మగిడి వచ్చుచుంట వారికి జూపట్టెను. ఆమె వెనుక ముగ్వురు పరిచారికలు జలములు నింపిన కలశములను యాసన

ములను గొని తెచ్చుచుండిరి.

ఆతోఁట యందొక వృక్షతలంబున గూర్చుండుట కుపయుక్తంబులగు కొన్ని శిలాఫలకములు గలవు. క్రమముగా నాయువతులు వారిని సమీపించి తాము గొని తెచ్చిన పదార్థముల నా రాతిపలకపయి నునిచి నిలుచుండిరి. అంత నభయసింహుఁడా పడతులతో, "మీరు కొంతదూరము తొలఁగిపొండు. మేము స్త్రీలయెదుట సంధ్యాపూజల నొనరింపము." అనెను.

"మిమ్ములను సన్మానింప మా యాయువంతయు గడచి పోవుచున్నది. ఇట్టివిధంబున నేల పలికెదరు? మీరు దూరముగ వెడలి పొండని స్పష్టరూపంబున నేల వచియింపరాదు? ఇదిగో! చూఁడుఁడు. మేము వెడలుచున్నా" మని పలికి యా యువతి పరిచారికలను వెంటఁ గొని యచటనుండి తొలఁగిపోయెను. ఆమె పలుకుల కెల్లరు నగుచు, నీమె మైయారుల వెంట నుండదగిన దని" యనుకొన సాగిరి

కుమారవిజయేంద్రసింహుఁడు మున్నగు వారలందఱు సంధ్యోపాసనములను నిర్వర్తించుకొనిరి. పిదప నభయసింహుఁడు గులాబిపూవును నీటియం దఱఁగదీసి మెల్లనఱుఁ ద్రావించి తానును గ్రోలెను.

కొంతసేపయిన పిదప నాయువతి మరల వారిని సమీపించి తన వెంట విచ్చేయుఁడని వేఁడుకొనెను. వారలన్ని విధంబుల సంసిద్ధులయి యుండిరికదా? ఇఁకఁ దడవేమి కలదు? వారలా యువతి వెంట బయలుదేరి మూఁడవ తోఁటయందుఁ బ్రవేశించిరి. మున్నెన్నఁడు మన మైయారు లాతోఁటను గాంచియుండలేదు. కాని, కుమారవిజయేంద్రసింహుఁడు మాత్రము బాగుగ నెఱిఁగియుండెను. అతఁ డొక మాఱా తోఁటలోని కపరాధుని విధంబున స్త్రీ సంఘమువలన బట్టువడి కొని పోబడియుండెను. నేఁడా తోఁట తొంటివిధంబున లేదు. ఇపుడా విద్యుద్దీపములు లేవు. జనసంచారము లేదు. నలుగురైదుగురు

స్త్రీలు మాత్ర మిటునటు సంచరించుచుఁ జూపట్టుచుండిరి. వారి కగత్యమని తోఁచిన రెండుమూఁడు తావులయందు మాత్రము సామాన్యములగు దివ్వెలు వెలుతురు నిచ్చుచుండెను.

ఇపుడు నలుదెసలఁ జీఁకటి దట్టముగ గ్రమ్ముకొనెను. అటులా యువతులు వారలను వెంట నిడుకొని మున్ను కుమారవిజయేంద్రసింహుఁడు గాంచియుండిన మందిరము వైపున కేగిరి.

"పిదప నేమి జరిగినను, యావనకన్యక యెవ్వరో, తిలస్మపుస్తక మామె కెటుల లభించియుండెనో, యామె నాకట్టిమహోపకారము లొనరించుటకు హేతువెయ్యదియో యెఱుంగకయే నేఁడా యోగిపుంగవుని వెనువీడు వాఁడనుగాను" యివ్విధంబున దన యుల్లంబున దలపోయుచుఁ గుమారవిజయేంద్రసింహుఁడు నాయువతుల వెనువెంట నేగుచుండెను.

క్రమముగా నాయువతులు వారిని వెంట నిడికొని కొలువుకూటమందుఁ బ్రవేశించిరి. కాని, నేఁడచట ప్రతిమదర్బారు చూపట్టదయ్యెను. ఇపుడది యొక వృద్ధయోగీంద్రుని కొలువుకూటమై యుండెను. కుమారవిజయేంద్రసింహుఁడు తిలస్మమంతయు ఖండించి, కుమారి కరుణాదేవి నివసించుచున్న యాకొండగుహయందుఁ జొచ్చి, యచటఁ దన ప్రాణప్రదంబగు ప్రియురాలిని గాంచక వెతనొందుచు, నీప్రపంచమంతయు శూన్యముగ దలంచి, యాసమున్నత పర్వతోపరికుహారము నుండి క్రిందికి దుమికి తన ప్రాణములను బాయ నుంకించుచున్నతఱి, నకస్మాత్తుగా నచటి ప్రాకారమార్గమున బ్రత్యక్షమయి వాని ప్రాణములను సంరక్షించిన వృద్ధయోగి యీతఁడే! మిక్కిలి పొడవును వెడదయుగల నొక తివాసీపయి మృగచర్మమును బఱచుకొని యావృద్ధయోగి కూర్చుండియుండెను. వానికి నెడమతట్టున గొంతదూరమున వసకన్యక గూర్చుండియుండెను. వారి మ్రోల నలువురైదుగురు పరి

చారికలు బద్ధహస్తులయి నిలిచియుండిరి.

కుమారవిజయేంద్రసింహుని రాకనెఱింగి యావృద్ధయోగి ద్వారముకడ కెదురేగి వాని కరమును బట్టుకొని తన యాసనము సమీపమునకుఁ దీసికొని వెళ్లి తనకుఁ గుడివైపున మృగచర్మముపయిఁ గూర్చుండఁ బెట్టెను. ఐయారు లుచితస్థానంబులఁ గూర్చుండిరి. వనకన్యక కుమారవిజయేంద్రసింహుని గాంచినంతనే లేచి కొంతదూరము తొలఁగి నిలిచి వాని వైపునకుఁ బ్రేమపూరితేక్షణంబులఁ జూడఁ దొడంగెను.

కుమార విజయేంద్రసింహుని సమాదరకటాక్షము లన్ని దిశలనుండి తొలఁగుచు వనకన్యకను సమీపించి నిలిచెను. ఆసమయంబున వారిరువురి కటాక్షములనుండి లజ్జాప్రేమలు స్రవించుచుండెను. నేత్రచతుష్టయము పరస్పరము సమ్మిళితములయ్యెను. కాని, యావృద్ధయోగి యెడల దమకు గుదిరియుండిన భక్తివిశ్వాసములవలనను గౌరవాతిశయంబునను నాప్రేమీయుగ్మము యథేచ్ఛగఁ బ్రసంగింపఁ జాలకుండిరి. తమ ప్రేమేక్షణము లావృద్ధయోగి పరికింపఁ గూడదని వారి యభిప్రాయము. పిదప నావృద్ధయోగి కుమారవిజయేంద్రసింహునితో నిటుల సంభాషింపఁ దొడంగెను.

"రాకుమారా! నీకును నీపరివారమునకును గుశలమే కదా?

"మహాత్మా! తమ కరుణాతిరేకంబున మేమెల్లరము బ్రసన్నచిత్తులమై యుంటిమి. కాని, ... ... ..."

"సంశయమేల? వచియింపుము."

"కొన్ని విషయముల మర్మములు వీడకుండుటచే నాయంతరంగము మిక్కిలి తల్లడిల్లుచున్నది. తమ కరుణాతిశయంబున నేఁడా చింతయు దొలఁగి పోవునను యాశతోనుంటిని."

"పరమేశ్వరుని యనుగ్రహామువలన నన్ని వగపులు తొలఁగిపో

వును. నీ మానసమందలి సంశయములన్నియు దీరును. ఈసమ యంబున నాయాతిథ్యమును స్వీకరించి మా యాశ్రమమున కలియో గంజియో గ్రోలవలెను. అటుపిమ్మట రేయియంతయు మనము సం భాషణములయందుఁ గడపనగును. పరమేశ్వరుని కృపావిశేషంబున మీఁదట నెట్టి యంగదములను గుడువవలసి యుండదు.

సుధాపరిపూరితంబులగు నయ్యోగీంద్రుని వచనంబులు కుమా రవిజయేంద్రాభయసింహులు మున్నగువారి శుష్కించియుండిన నె మ్మనంబులకు వికాసమును గలిగించెను. సంతోషాతిశయంబుల వారి దేహదార్ఢ్యము లతిశయిల్లెను. తమ కార్యములన్నియు సిద్ధిలాభము నొందినటుల వారి కమితానంద ముదయించెను.

కొంతసేపయిన పిదప వార లాతిథ్యమునకుఁ బిలువఁ బడిరి. భో జనపదార్థములన్నియు రాజలోకమున కుపయుక్తమగునవి కాని, సా మాన్యులకు లభించునవికావు. భోజనాదికములనుండి నిశ్చింతితులయి న పిదప నాశృంగారవనము మధ్య నొప్పుచుండిన యొకచంద్రకాంతశి లావేదిక సమీపమున కేగి దానిపయిఁ గూర్చుండిరి. ఆతిన్నెపయి మిక్కిలి విలువగల రత్నకంబళ మొకటి పఱచఁబడియుండెను. దాని పయి నొక మృగచర్మమును బఱచుకొని వృద్ధయోగీంద్రుఁ డాసీనుఁడ య్యెను. అతఁడు తన ప్రక్కను గుమారవిజయేంద్రసింహుని గూర్చుం డఁ బెట్టుకొనెను. వారికి గొంతదూరమున దన యిరువురు చెలికత్తె లతో వనకన్యక గూర్చుండియుండెను. ఐయూరులును గొంతసమీప మున గూర్చుండియుండిరి. తక్కుంగల స్త్రీలందఱు దవ్వునకు వెడల గొట్టఁబడిరి.

ఒక జాము రేయి గడచి యుండెను. అమృతాంశుఁడు సంపూర్ణకళలతో నభోమండలమునఁ బ్రకాశించుచుండెను. మలయా నిలము సమస్త జీవరాసుల నాహ్లాదిత మొనరించుచు నల్లనల్లన వీచు

చుండెను. ఆయుపవనమందలి పుష్పజాతుల మధురసౌరభము నలుగడల వ్యాపించుచుండెను. ఆవృద్ధయోగి కుమారవిజయేంద్రసింహుని దెసఁ గాంచి మందస్మిత వదనుఁడై, "రాకుమారా! నీవే యేవిషయములను బ్రశ్నింపదలంచి యుంటివో యిపుడు పృచ్ఛించుము. నేను దానికి సదుత్తరంబుల నొసంగి నిన్ను సంతుష్టాంతరంగునిగ జేసెద" ననెను.

కుమారవిజయేంద్రసింహుని యంతరంగమున నాశ్చర్యభరితంబులగు పెక్కు సంగతులు నిండియుండెను. తొలుత నెచటినుండియారంభింప వలయునని యాతఁడు తొట్రుపడఁ దొడంగెను. తుద కాతఁడు కొంత సాహసమును బూని యాయోగిపుంగవునితో నిటుల సంభాషింపఁ దొడంగెను.

---

## మూఁడవ ప్రకరణము.

పగలంతయు నరిమిత్రసింహుఁడు చారులనందఱ నొక తావునకుఁ జేర్చుటయందును వారికిఁ దగురీతి బోధించుటయందును గడపెను. సాయంకాల సమయంబున భూపాలుని యాజ్ఞానుసారము వారి నందఱను వెంట నిడుకొని యుద్యానవనమందుఁ బ్రతాపభానుమహారాజును సందర్శింప నేగెను.

ప్రతాపభానుమహారాజు వారలఁగని, "చారులారా! మీరలు జాలిమఖానుని జాడనేల తెలిసికొన జాలకుంటి" రని ప్రశ్నించెను. దానికిఁ బ్రత్యుత్తరముగ నాచారులు, "మహారాజా! మాకు సాధ్యమగు నంత దనుక వారిజాడ నరయుచుంటిమి. మఱియు వారిజాడ తప్పకఁ దెలియ గలదను విశ్వాసముతో నుంటి" మని విన్నవించుకొనిరి. "ఆ

ఫత్ ఖానుఁడను మఱియొక ఘాతకుఁడు మనకు దాపరించి యుండెను. వాఁడు తన ప్రకటన పత్త్రిమున దన్ను కలిసికొను సంకేతస్థానమును వివరించి యుండెఁగదా? మీరలా తావునకుఁ జని వానిని బంధించియే లకొని రాఁజాలకుంటి" రని భూపాలుఁడు మరలఁ గోపావేశముతోఁ బ్రశ్నించెను. అంత నాచారులు, "రాజాధిరాజా! ఆఫత్ ఖానుఁడు తన్ను కలిసికొను స్థానము "ఛేటీ ఛోటీ" యని లిఖించియుండెను. ఆస్థాన మెచటఁ గలదో మేమెటు లెఱుంగజాలుదుము? ఆతఁ డేస్థానమున కాపేరు కల్పించియుండెనో దాని యర్థమెయ్యదియో ఎవ రెఱుంగుదురు? మేమెచటికిఁ బోవలయునో తెలియజాలకుంటి" మని విన్నవించుకొనిరి.

ఆచారుల పలుకుల నాలించి ప్రతాపభానుమహారాజు "ఛేటీ ఛోటీ" యన్న పదమందలి యర్థము దెలిసికొనుటకయి యాలోచింపసాగెను. అతఁ డెంత యాలోచించినను దాని యర్థము వానికి స్ఫురింపదయ్యెను. చారులు నిరపరాధులని తుదకా భూపాలుఁడు నిశ్చయించుకొని వారితో నేమియు బలుక జాలఁడయ్యెను. కాని, కొంచెము గద్దింపు పలుకులతో, నాచారులకు దమతమ కార్యములం దప్రమత్తులయి మెలంగుటకు శాసించి వారిని వీడ్కొల్పెను.

ఇపుడు ప్రతాపభానునకు తన జీవితముపయి శంకజనించెను. జాలిమాఫత్ ఖానుల భీతిచే రేయియంతయుఁ జేత గరవాలమును ధరించి మెలకువ గలిగియుండుచుండెను. ఆభూపాలునకు దన బాహువీర్యబల పరాక్రమముల పయిఁ బూర్ణవిశ్వాసముగలదు.

మఱునాఁడు మఱియొక ప్రకటన పత్త్రిమా పోలీసుదండెల్లెడల నతికించఁబడియుండుట దృష్టిపడెను. వానిలో నొక కాగితమును గస్తుతిరుగు వారిలో నొకఁడు గొనితెచ్చి తన ప్రభువు మోల నిడెను. అరిమిత్త్రసింహుఁడా ప్రకటనను జదివి భూపాలునకు వినిపించె

ను. దానియందు దిటుల వ్రాయఁబడి యుండెను.

"మిగుల జాగరూకతతో మెలంగుఁడు. చూడుఁడు. జగన్నాధుని ఖండించి వైచితిని. నేను మొదటి ప్రకటనమందు వివరించియున్న ప్రకారము రేపటి రాత్రి రెండు జాములవేళ జగన్నాధుని ఖండిత శిరము చేఁబూని మీనగరులోనికి వచ్చుచున్నాను. జాగ్రత్త! జాగ్రత్త!! జాగ్రత్త!!!

ఇట్లు,
అఫల్ ఖాన్ ఖూనీ.

---

నాల్గవ ప్రకరణము.

శౌరీగడ పరిసరప్రాంతమందలి ప్రవాహతీరమున నొక రాతిపలకపయి సిపాయి దుస్తులను ధరించిన నలువురు పురుషులు కూర్చుండియుండిరి. వారికి సమీపమున మఱియొక శిలాఫలకమున మఱి యిరువురు పురుషులు కూర్చుండియుండి మెల్లమెల్లగా సంభాషించుచుండిరి. శశాంకుని శీతల కిరణజాలంబుల వారి రూపములును దుస్తులును విస్పష్టముగ గనిపించుచుండెను. రెండవ రాతిపలకపయిఁ గూర్చుండియున్న యిరువురిలో నొకని వయస్సు దాదాపు నలుబది యేండ్లుండును. దేహచ్ఛాయ నలుపు. దీర్ఘకాయుఁడు. మోటువాఁడు. వాని గడ్డము నల్లగనుగులుచగ నుండెను. అతఁడు పాయజామయు, నంగరకాయయు దొడిగియుండెను. తన సమ్ముఖమున విల్లమ్ములును డాలు తలవారియు నునిచికొని యొక మడిమను భూమికి జేర్చి కూర్చుండియుండెను మిక్కిలి నల్లబాఱి బిరుసు గలిగియుండిన వాని కోఱమీసములు మీదికి దిరిగియుండెను. నేత్రము లెఱ్ఱబాఱి దృష్టి యతికౄరముగ నుం

డెను. వాని పేరు జాలిమఖానుఁడు.

వాని సమీపమున వీరాసనము వైచుకొని కూర్చుండియుండిన వాఁ డాఫత్ ఖానుఁడు. ఇతఁడు పాయజామయుఁదుర్కీయంగరకాయయు ధరించియుండెను. గడ్డము నలుపుగను బొట్టిగనుండెను. వీని వయస్సుదాదాపు యిరువదియైదేండ్లుండును. వాని యెదుట గండ్రగొడ్డలియుఁ బ్రక్కనొక చిన్నమూటయుఁ గలవు. అతఁడు జాలిమఖానుని పలుకులను కడుశ్రద్ధతో నాలించుచు సమయసమయంబులందుఁ బ్రత్యుత్తరముల నొసంగుచుండెను.

"ఆఫత్ ఖాన్ జీ! మిమ్ములను గలసికొనుటవలన మాకధికసహాయము చేకూరినది"

"అటులనే నాకును మీకూడికవలన పుష్కలలాభ మొదవినది. ఈగండ్రగొడ్డలిని గాంచుఁడు. దీనివలన వేలకొలఁది జనుల ప్రాణంబులు తుదముట్టగలవు. నేను దీనిని దక్క నితర శస్త్రములను వాడకుందును. ఎవనికేనియు దీనివలన గలిగిన గాయము స్వల్పమైనను నతఁడు మృత్యువాతనుండి తప్పిపోఁడు."

"మేమెంతయో శ్రమనొందిన మీఁదట మిమ్ములను గలిసికొన జాలితిమి.

"నేను మిమ్ములను ముఖ్యముగ గలిసికొనవలసియున్నది. నేనీప్రోలున కరుదెంచిన తోడనే మీవృత్తాంతముల నెఱింగితిని. కాని మీ యునికి దెలియదయ్యె. మిమ్మెట్టులఁ జేరగలుగుదును? మీర ఐయారితనమునందుఁ బ్రావీణ్యులయి యుందురని యూహించి యితరులకు మనసంకేతస్థానము తెలియకుండుటకయి "ఛోటీ-చోటీ" యని ఐయారిభాషయందు నాప్రకటన పత్త్రికమున వ్రాసియుంటిని.

"ఔను. మాకు కొంచెము గొప్పఐయారితనమునందుఁ బ్రవేశము గలదు. కాని, మీరా ప్రౌఢిమమున బూర్ణనిపుణులని తేటప

డు చున్నది. జగన్నాథు నప్పుడే ఖండించియుండిరి.

"నేనంతటి నిపుణుఁడను గాకుండినను జగన్నాథుని బోలు నొక బాలుని వంచించుట కర్హుఁడనే యగుదును."

"ఏది యెటులుండినను మీసందర్శన మాత్రముననే మాహృదయములందొక విధంబగు భక్తివిశ్వాసములు జనించినవి. నేఁటినుండి మేమందఱము మీకు శిష్యుల మైతిమి. సదా మీయాజ్ఞానువర్తులమయి మెలంగుచుందుము. గురుజీ! మాయందు దయాంతరంగుఁడవై జగన్నాథుని రూపమును గొంచెము మాకు జూపరా?"

"వాని రూపమెటులఁ జూపఁ జాలుదును? వానిని ఖండించి వాని కళేబరమును భూమియందుఁ బూడ్చివైచితిని. వాని శిరము మాత్రమీ మూటయందుఁ గట్టి యుంచితిని. రేపటివఱకు నదికుళ్ళి చెడకుండ నొకవిధమగు ద్రవమునందుఁ దడిపియుంచితిని. చేతితో మాత్రము తాఁకకుఁడనిపలికి ఆఫత్ ఖానుడు తన ప్రక్కనున్న మూటను విప్పి చూపించెను. దానియందుఁ బండితజగన్నాథుని శిరముగలదు ఆశిరమునకుఁ జుట్టియుంచిన వస్త్రమంతయు రక్తమున దోగియుండెను. జాలిమఖానుఁడును వాని యనుచరులును జగన్నాథుని శిరమును గాంచినంతనే యధికప్రమోద భరితులయిరి. పిదప జాలిమఖానుఁ డాఫత్ ఖానుని దెసఁ బరికించి, గురుజీ! ఈతఁడొక పెనుభూతమువంటి వాఁడు సుఁడీ" యనెను.

"ఔను. వీఁడు నన్ను దప్పించుకొని యెచటికేనియు నేగగలఁడా?"

"సరియే! కాని, రేపటి రాత్రి రెండు జాములవేళ కోటలోనికిఁ బోవు విషయము మాత్ర మసంగతముగ నున్నది."

"ఇందయుక్త మేమి కలదు? అచట నెట్టి విచిత్రఖేలనము జరుగునో కనుగొనియెదరు కదా?"

"గురుజీ! మీరు సమయనిర్ధారణ మొనరించి ప్రకటించియుండుటచే నాసమయంబున నచటఁ బెక్కుజనులు కూడియుందురుకదా! వారిచేఁ జిక్కక మనము దప్పించుకొనుట యసంభవము గాకుండునా?"

"మనలను బంధింపఁ జాలిన మేటి యెవఁడు గలఁడు?"

"ప్రాణాపాయకరంబగు కార్యము చేబూనుట యవివేకముగాదా? మనమా సమయమును దప్పించి ఏలపోకూడదు?"

"నీవు వట్టి యవివేకివి. నేనటుల సమయనిర్ధారణమును గావించుట యందలి మర్మమించుకేనియు నూహింపఁ జాలనైతివి."

"ఆరహస్యము మీకే తెలియవలయును. కాని, మేమెటు లెఱుంగఁ జాలుదుము?"

"ఆలింపుము. సాధ్యమగునంత శీఘ్రముగ మన పగతుఱనందఱి నొక్కమాఱుగ మడియించి యీకార్యమునుండి తెఱపి గనుటయే నాయభిప్రాయము. ఆసమయంబున నెందఱచట గూడియుందురో వారలందఱు మృత్యువాతఁ బడిరనియే తలంపుము. కరపాదములు చలింపకయే వారలందఱ నొక్కమాఱుగఁ దుదముట్టించెదను. చూచెదరుకదా? నాప్రజ్ఞావిశేషము?"

"గురుజీ! కోపింపకుఁడు. తెలియక నడుగుచుంటిని. అది యెవ్విధంబున సాధ్యపడును?"

అంత నాఫత్ ఖానుఁడు తన కక్షపాలనుండి గోళాకారముగల యొక పదార్థమును వెడలించి, "చూడుఁడు. ఇట్టివిధంబగు పెక్కుయుండలను సిద్ధపరచియుంచితిని. వానిని మీకందఱకు నొకటొకటిగ నొసంగుదును? చాలును! ఇఁక నేమికలదు? మన మచట ప్రవేశించినతోడనే మనలను బట్టవచ్చెడు జనసముదాయమం దీయుండలను విసరివేయవలెను. అవి భూమిపయిఁ బడిన మాత్రముననే యొకగొప్ప ధ్వనితో విచ్చిపోవును. మఱియు వానినుండి విస్తారముగ పొగ వెడలివచ్చు

ను. ఆధూమము విషసంబంధమైన దగుటచే నెవరి నేత్రములందా పొగ ప్రవేశించునో వారలందఱు తత్క్షణమే యంధులు కాఁగలరు. నాసికారంధ్రముల నాపొగ ప్రవేశించినతోడనే వారి ప్రాణము లెగసిపోవు" నని పలికెను.

ఆపలుకుల నాలించి జాలిమఖానుఁడును వాని యనుచరులు నధిక సంతసమున నుప్పొంగసాఁగిరి. పిదప జాలిమఖానుఁ డాఫత్ ఖానునితో, "గురుజీ! ఒక యుండ నిచటఁ గొట్టి చూపింపుఁడు! మేము దానిని గని సంతసించెదము. మఱియు మా మానసంబుల ధైర్యసాహసము లినుమడింపఁ గలవు" అనెను.

"మంచిది. చూడు"డని పలికి ఆఫత్ ఖానుఁడా యుండ నెత్తి భూమిపయి మోదెను. తోడనే యదియొక గొప్పధ్వనితో విచ్చిపోయెను. మఱియు దానినుండి యధికముగ విషవాయువు మెగసి నలుగడల వ్యాపించెను. ఆఫత్ జాలిమఖానులును వారి యనుచరులును దెప్పున నచటినుండిలేచి కొంతదూరమునకుఁ దొలఁగి నిలిచియుండినను వారి నేత్రము లధికముగమండ సాగెను. తలలు తిరుగ నారంభించెను. ఆఫత్ ఖానుఁడు తత్క్షణమే తన కక్షపాలనుండి యొక సంపుటమును వెడలించి దానియందలి మృదులపదార్థమును వారి నేత్రముల కంజనమిడెను. మఱియు దానిని తన చేతులయందలదుకొని వారికి వాసన జూపించెను. ఆ మందు ప్రభావము వలన వారి దేహములకుఁ గుదురు కలిగెను.

అంత జాలిమఖానుఁ డమితానందభరితుఁడై, గురుజీ! మీరత్యద్భుత ప్రభావముగల యొక పదార్థము నిర్మించితిరి. మీప్రజ్ఞావిశేష మెంతకొనియాడినను దీర" దనెను.

"ఏమి! మీకిపుడయినను రాజనగరిలోనికిఁ బోవు కోరిక గలిగెనా?

మీసందర్శనలాభము మాకు లభింపఁజేసిన యాఖుదాకు వేన

వేలు ధన్యవాదములు. మే మొక సంవత్సరము గడువులో నిర్వహింపఁ జాలని కార్యము మీ రొక దినముననే ముగింపఁ గలరు. వహ్వా! గురుజీ! మేమిపుడు నిశ్శంకభావముతో మీ వెంట రాజమహాలులోని కేగ సంసిద్ధులమై యుంటిమి. మఱియు మన పగతుఱనందఱ నొక్క నిమిషములో శమనపురికి బుత్తెంచెదము. మా కెల్లరకు నొకొక యుంశ నొసంగుఁడు!"

"ఇప్పు డెందులకు? మన మచ్చోటున కేగు సమయంబున నొసంగెదను లెమ్ము. రేపు పగలంతయుఁ గడువవలసి యున్నదికదా?"

"గురుజీ! మీ ప్రకటన పత్త్రము నందన్ని దినముల గడువేల వ్రాసియుంటిరి? నేటి దినమునే నిర్ధారణ జేసి యుండిన నేఁడే మనము సఫలీకృతమనోరథులము గాకుందుమా?"

"జగన్నాథుఁడు మిగులఁ జాకచక్యముగల వాఁడనియు నతఁడు మనచేఁ జిక్కుటకుఁ గొన్ని దినములు పట్టుననియుఁ దలంచి నేనటుల వ్రాసియుంటిని. తుదకతఁడు మందమతియే యయ్యెను."

"మన కిపుడు కర్తవ్యం బెయ్యది?"

"ఈసమయంబున మన మొనరింపఁదగు కార్యమెద్దియు లేదు. రేపటి యర్ధరాత్రిమున రాజనగరిలోని కేగ సంసిద్ధులమయి యుండవలెను,"

"మీరా విషయమును వేఱుగఁ జెప్పనగత్యము లేదు. మే మిప్పటినుండియు మిమ్మనుసరించి యుండెదము."

"మంచిది. అటులనే కానిండు. మన మిచటనుండి వెడలి మఱియొక తావున విశ్రమించుట యుచితము. ఆఖుదా రేపటి దినమున నేమి గావింపనుండెనో కాంచెదము గదా? మహాలులోని కేగు నాకార్యము బరిసమాప్తినొందనిదే నేనొక గింజయైనను పంటఁ గొఱకకుందునని ప్రతిన జేసికొని యుంటిని."

"ఏమియు భుజింపకుండిన బలహీనముగ నుండునుగదా?

"చాలును. ఊరకుండుము. భుజింపకుండినంత మాత్రమున నే దార్ఢ్యము డిందువడునా? నడువుఁ డని" పలికి అఫత్ ఖానుఁ డచటి నుండి బయలుదేరెను.

జాలిమఖానుఁడు మున్నగువారలును వాని ననుసరించి పోఁదొడంగిరి.

---

## ఐదవ ప్రకరణము.

రాత్రి సమయంబున రెండవ జాములవేళఁ బండితజగన్నాథుని శిరముఁ జేఁబూని ఆఫతుఖానుఁడు రాజనగరిలోని కేళుగడుపు దినము వచ్చెను. నేఁడా ప్రోలునందెల్లెడల మహాసంక్షోభము వ్యాపించియుండెను. సాయంకాలము నుండియే ప్రతాపఖానుమహారా జుచిత సన్నాహములందు నిమగ్నమానసుఁడయి యుండెను. గొప్పగొప్ప సర్దారులు శూరాగ్రేసరులు మల్లులు మున్నగువారలు రాజమహాలునందు గూడఁకొనుచుండిరి. ఎల్లరి మోములనుండి యొకవిధంబగు తేజము వెల్లివిరియుచుండెను. భూపాలుఁడు స్వయముగఁ జేతనొక తలవారిం గొని యిటునటు పచారము చేయుచు సర్దారులు శూరాగ్రేసరులు మున్నగు వారలఁ గలయంగని "యోధులారా! ప్రాణములందలి మోహపాశములను ద్రుంచి యాదుష్టులను బంధింపుము. యశము నార్జింపుఁ డని" హెచ్చరించుచుండెను. అచటఁ జేరియుండిన వారలు తమతమ ప్రజ్ఞావిశేషములను వెల్లడించుచు, దాము మున్నెన్నఁడో కావించియుండిన గథల నేకరుబెట్టుచు బరస్పరము సంభాషించుచుండిరి. మహాలు వెలుపల పహరా తగ్గించియుంచిరి. మహాలులోని కాదుష్టులు ప్రవేశించిన నేము

పాయమున నైన వారిని బంధింపనగుననియు, వెలుపలి పహరా తగ్గియుండుటచే వారలు నిర్భయముగ మహాలునందుఁ బ్రవేశింతురనియు, నటుగానిచో, మహాలులోనికి జొచ్చు సులువు లభింపమి యచటి కావలియందు నియుక్తులయియున్న వారిలో గొందఱను ఖండించి పారిపోవుదురనియు భూపాలుని యభిప్రాయము.

మహాలునందు నలుగడల విద్యుద్దీపముల కాంతి బాగుగ వ్యాపించియుండెను. నగరంతయుఁ బట్టపగలువలె బ్రకాశించుచుండెను. సరిగ నర్ధరాత్రమున తూర్పువైపు మిద్దెపయినుండి యొక్కరు మనుష్యులు ధం, ధమ్మని క్రిందికి దుమికి యచటఁ జేరియుండిన జనసమూహము వైపునకు వడివడిగా నడచిపోయిరి. వారి కందఱకు ముందుగ నాఫతుఖానుఖూనీ పండితజగన్నాథుని ఖండితశిరమును జేతియందు వ్రేలాడుచుండునట్టుల బట్టుకొనియుండెను.

---

## ఆఱవ ప్రకరణము.

తఖ్ఖానాయందలి తిలస్మద్యానమందుఁ గుమారవిజయేంద్రసింహుఁడు సిద్ధనాథయోగీంద్రునితో సంభాషించుచుండెను. వారి సంభాషణలను వనకన్యకయు నామె చెలికత్తెలును నభయసింహుఁడు మున్నగువారును నధికాసక్తి నాలించుచుండిరి.

"మహాత్మా! కుమారికరుణాదేవి జీవించియుండెనా? తొలుత దీని నెఱింగింపుఁడు"

"హరి! హరి!! పాప ముపశమించుగాక! కరుణాదేవి నెవ్వరేనియు మడియింపఁ జాలుదురా? ఆమె యీసంసార ప్రపంచమునందుఁగుశలపూర్వకముగనున్నది."

"యోగివర్యా! మరల మా యిరువురకు సంయోగము ఘటిల్లునా?"

"తప్పక గలుగును."

"ఎప్పుడు?"

"(వనకన్యక దెసకుఁ గని) ఈమె కోరినపుడు"

ఇటుల వినినంతనే కుమారవిజయేంద్రసింహుఁడు వనకన్యక దెసఁ గాంచ దొడంగెను. ఆమె కాసమయంబున నొకవింత స్థితి యొదవి యుండెను. ఆమె దేహవల్లి యుత్కంపించుచుండెను. ఆమె మిగుల దల్లడిల్లుచుండినటుల దోఁచుచుండెను. అట్టి యామె స్థితి నుపలక్షించి యావృద్ధయోగి కోపపూరితంబులగు గోఱచూపు లామెపయిఁ బఱచెను. తోడనే వనకన్యక యాయోగీంద్రుని మనోగతభావమును గుర్తించినదై తనను సంభాళించుకొని కూర్చుండెను. కుమారవిజయేంద్రసింహుఁడీపరిస్థితినంతయు నెఱింగి యాయోగీంద్రునితో నిటులఁ బలికెను.

"మహాత్మా! మీదగు కృపాదృష్టి నాపయిఁ బ్రసరింపఁజేసిన నేను దప్పక కుమారికరుణాదేవిని గలిసికొనఁ జాలుదును."

"కాదుకాదు. (వనకన్యక వైపునకుఁ జూపుచు) అదియంతయు నీమె హస్తగతమున గలదు. మఱియు నీమె నాయాజ్ఞాధీనమందు గలదు. నీవేల తత్తరపాటు నొందుచుంటివి. నీవు ప్రశ్నింపవలసిన విషయములను బ్రశ్నింపుము? పిదప గరుణాదేవి లభించు విధము దేటపఱతును."

"మంచిది! ఈవనకన్యక యెవరు?"

"ఈమె యొక భూపాలుని తనయ."

"ఈమె నాకట్టి మహోపకారములను గావించుటకుఁ గతంబేమి?"

"కుమారికరుణాదేవికిని నీమెకును గలిగియుండిన స్నేహానుబం

ధమే కారణము.”

“అటులయిన, యీమె నన్ను వివాహమాడుటకేల కోరుచుండెను?”

“నిన్ను వివాహమాడుటకీమె కెట్టి యావశ్యకమును లేదు. ఈమె నిన్ను కోరుటయు లేదు. కాని, కరుణాదేవి చలమూని యుండుటచే నీమె నిరుపాయమైయున్నది. కారణం బేమన, నీమె నిన్ను పరిణయంబాడుటయే కరుణాదేవి కభిలాషయయియున్నది.”

యోగీంద్రుని తుదిపలుకులు కుమారవిజయేంద్రసింహున కధిక సంతసమును గలిగించెను. మరల నతఁడా యోగీంద్రునితో:—

“మహాత్మా! కరుణాదేవికి నీమెకు నట్టి స్నేహబాంధవ్యము గలిగియుండిన నామెను నాయెదుటికేల గొనిరాకున్నది?”

“ఇపుడింకను సమయముకాదు.”

“ఎందువలన?”

“నీవెపుడు జగత్సింహప్రతాపభానుభూపాలురను వెంటఁగొని తెచ్చెదవో ఆనాఁడీమె కుమారికరుణాదేవిని స్వయముగ వారి కర్పించును.”

“అటులయిన నేనిపుడేగి సాధ్యమగునంత త్వరితముగ వారిరువురను వెంటఁగొని తెచ్చెదను.”

“సరియే. కాని, నేనొకటి ప్రశ్నించుచుంటిని. దానికి సముత్తరం బొసంగుము.”

“మంచిది. ప్రశ్నింపుఁడు.”

“(వనకన్యక వైపునకుఁ జూపించి) రాకుమారా! ఈమె నీకనేక యుపకృతుల నొనర్చియున్నది. నీవును నీమైయారులు నీమెను బెక్కుమాఱులు గాంచియుంటిరి. మీరుదక్క నితరులెవ్వరేనియు నీమెను గనుగొని యుండిరా?”

"నేను బ్రభాకరసింహుఁడు దక్క నీమె నొరులెవరు గాంచియెఱుంగరు. నేఁడిపుడు మాయైయారులును నీమెను గాంచుచుండిరి."

అంత వనకన్యక (అభయసింహుని వైపునకుఁ జూపి) ఈతఁడొకమాఱు నన్ను కలిసికొనెను. అతఁడా సమాచారము బహుశః మీకుఁ జెప్పియుండఁడు. కారణంబేమన, నేను వీని వలన బాస జేయించుకొంటిని" అనెను.

ఈపలుకుల నాలించినంతనే కుమారవిజయేంద్రసింహుఁడభయసింహుని దెసఁ గాంచెను. అంత నతఁడు, "మిత్రమా! ఔను. అది యానాఁటి విషయము. ఎపుడు నీవు మాయైయారితనమందు గళంక మొదవుచున్నదని మమ్ములను దూలనాడితివో, యపుడు నేను పెక్కు భంగుల బ్రయత్నించి యీమెను గలిసికొంటిని. మఱియు మీ వృత్తాంతము సమగ్రముగ నెఱుంగకయే మీ వెనువీడువాఁడను గానని యీమెతోఁ బలికితిని. అంత నీమె నాతో, "వేగిరపడనేల? ఒకనాఁడటులనే కాఁగలదు. నేనును కుమారికరుణాదేవియు గుమారవిజయేంద్రసింహుని చరణకమలముల నాశ్రయించువారముగాని వేఱుకాదు. శంకింప నవసరములేదు. ఈసమయమున నీవు మా వెంటాడవలదు. అటుకానిచో, మీకార్యములందు విఘ్నములు గలుగక మానవని" పలికెను. అంత నేనీమెతో, "కుమారవిజయేంద్రసింహునకు గుమారికరుణాదేవి లభింపఁగలదని బాసచేసినగాని మీ వెంట వీడనని పలుక, నీమెయు మాయంతట మేము మానిజవృత్తాంతములను వెల్లడిపఱచుదనుక నీవీ సమాచార మొరులకు దెలుపరాదని నావలన బాసచేయించుకొని తాననుఁ బ్రతిన జేసెను. ఇక్కారణంబుల నీకీవృత్తాంతముల నెఱింగింపక నింతవఱకు గోపనముగ నుంచితిని. నేఁడు మీరిరువురు సవక్షమున గూర్చుండి ప్రసంగించుచుండుట వలనఁ దెలిపితిని.

అంత నాయోగీంద్రుఁడు విజయేంద్రసింహునితో:—

"మంచిది. ఈమెను నీవు నీమైయారులుదక్క నితరులెవరును గాంచి యుండరనుట నిక్కవము. కాని, యీనమమ నొకయువతీ రత్నము మన కుమారవిజయేంద్రసింహునకు బాసటయగుచుండెనని మైనను మీసైనికులకు దెలియకుండెనా?"

"లేదు. ఈమె సమాచారము వారలెఱుంగరు. కారణంబేమన, మే మైయారులకుఁదక్క నితరుల కిట్టిసమాచారములెన్నటికిఁదెలుపకుందుము. ఇఁక మైయారు లితరుల కిట్టివృత్తాంతములను దెలుపనే తెలుపరు. కాని, నకాబుపోషుసవ్వారులను మాసైనికులు గాంచియుండుట వలన నీవిషయము వార లెఱింగియుందురేమో నే నుడువఁ జాలను."

"మంచిది. ఎట్టి చింతయుఁ గలుగదు. నీజనకుఁడు జగత్సింహభూపాలుఁ డీవృత్తాంతము నీవలన వినియుండెనా?"

"లేదు. అభయసింహుని జనకుఁ డర్జునసింహునితో మాత్రము సమస్త వృత్తాంతములను దెలిపియుంటిని. బహుశః యతఁడు నాజనకునితోఁ జెప్పియుండెనేమో నాకు తెలియదు."

"కాదు. అర్జునసింహుఁ డటులెన్నటికిఁ జెప్పియుండఁడు. వనకన్యక నీయెడల నెటుల ప్రవర్తించియుండెనో యావిషయ మితరులకు దెలియరాదు. నీవు దానిని బాగుగ జ్ఞప్తియందిడవలెను."

"నే నెన్నటికి దెలుపకుందును. నే నీసమాచారముల నెవరికేనియుఁ వెల్లడించినను, నీమెకు సత్కీర్తియే కలుగుగాని, చెఱుపేమికలుగ గలదు?"

"నిక్కవము. కాని, యీసమాచారము లీమెజననీ జనకులకు దెల్లమయ్యేనేని వారికి కడుచింత జనించును. కారణంబేమన, నొక గొప్పయింటిపడుచు పరపురుషునితో గలిసికొనుటయు, వానితో నుత్తర ప్రత్యుత్తరములను నడుపుటయు దూష్యముగాకుండునా?"

“వాస్తవము. ఈమె తలిదండ్రు లెవరు? వారెచట గలరు?”

“ఈవృత్తాంతములన్నియు జగత్సింహప్రతాపభానుభూపాలు రిచటికి విచ్చేసిన నాఁడు తెలియఁగలవు. మఱియు నపుడు కుమారికరుణాదేవి వారి కర్పింపఁ బడును.”

“నాకు సెలవొసంగుదు రేని నేనీసమయముననే యిచటనుండి వెడలి వారిరువురను వెంటగొని తెచ్చెదను.”

“ఇచటినుండి వెడలుట కిది యుపయుక్తసమయముగాదు. ఇయ్యది పట్టణమందు సంచరించుటయుగాదు. ఈరేయి యంతయు నిచట నిలిచిపోవుఁడు. తెల్లవాఱిన పిదప నేగనగును. ఇపుడిఁక రేయియు నధికముగ లేదు. కొంతసేపు విశ్రమింపుఁడు.”

“మంచిది.”

తాపముగ నుండెనను నెపమున గుమారవిజయేంద్రసింహుఁడు వెలుపలనే పరుండుట కిచ్ఛగించెను. వారలందఱు బరుండుటకు దగిన యేర్పాటు లాయోగీంద్రుని యాజ్ఞవలన తత్క్షణమే కావింపఁ బడెను. అటుపిమ్మట యోగీంద్రుఁడును వనకన్యకయు దమతమ స్థానములకు వెడలి పోయిరి.

కడమరేయి యంతయుఁ గుమారవిజయేంద్రసింహుఁడు దన మైయారులతోడ సంభాషించుటయందు గడిపెను. తెల్లవాఱి సూర్యోదయము గాకమున్నె యోగీంద్రుఁ డొంటరిగ నచటి కరుదెంచి కుమారవిజయేంద్రసింహునితోఁ, “రాకుమారా! నిన్నటి రేయి నీతో నొక విషయము జెప్ప మఱచితిని. అదియిపుడాలింపుము. నీవెపుడు జగత్సింహప్రతాపభానుమహారాజులను వెంటగొనివత్తువో యపుడు వారిని తఖఖానా వెలుపలనే విడిచి తొలుత నీవు మైయారుల వెంట నిచటికి రావలయును. పిదప వారి నిచటికి గొని రానగును. ఇపుడు స్నానసంధ్యాదికృత్యములను దీర్చుకొని యిచటినుండి తరలిపోవుఁ” డనెను.

విజయేంద్రసింహుఁడటులనేగావించెదననెను. కాని, యోగీంద్రుని తుదిపలుకుల నాలించి "యితఁడు నన్నేల మునుగ రమ్మనెనా" యని యుబ్బురపడ దొడఁగెను.

భోజనపదార్థములు సిద్ధపరుపఁబడెను. కుమారవిజయేంద్రసింహునకును వాని మైయాంరులకును భుజింపఁబెట్టి యోగీంద్రుఁడు వారిని వీడ్కొల్పెను.

పునరుక్తి గావించుట యనవసరము. ఆతఖఖానాయందుఁ దిరుగుచు సంచరించుచు, గుమారవిజయేంద్రసింహుఁ డైయూరుల సహితమే మార్గమున నచటికి జేరియుండెనో యాత్రోవనే యొకతోఁటనుండి రెండవతోఁటలోనికి రెండవ తోఁటనుండి మూఁడవ తోఁటలోనికిబోయి వారలా తఖఖానా వెలుపలకు వెడలిరి. పిదపఁ గుమారవిజయేంద్రాభయ యోగీంద్రనాథులొక వృక్షచ్ఛాయయందు గూర్చుండిరి. మోహనసింహుఁడు కుమారవిజయేంద్రసింహునికై వాహనమును గొని తెచ్చుటకు దేవీగడము వైపునకు వెడలెను.

మోహనసింహుఁడు తురంగమును గొని తెచ్చుసరికి కొంచెము పగలు మాత్రము గలదు. పిదపఁ గుమారవిజయేంద్రసింహుఁడా వారువము పయి నధిరోహించి మైయారులు వెంటరా దేవీగడమునకుఁ బయనం బయ్యెను.

దేవీగడమందుఁ బ్రవేశించి కుమారవిజయేంద్రసింహుఁడు తన జనకుని సందర్శించెను. అంతఃపురమందు దనతల్లితోడను గలిసికొనెను గాని, తనవృత్తాంత మిసుమంతయు నెవరితోడను వివరింపలేదు. ఇప్పుడొక నూతన శత్రువగు జాలిమఖానుఁడు గౌరీగడమున గొన్ని హత్యలను గావించియుండెననియు, వాని నామమును వినిన మాత్రమున పౌరులెల్లరుఁ దల్లడిల్లుచుండిరనియు, వానిని బంధింప బాడిశజగన్నాథుఁడు గౌరీగడమున కేగియుండెననియు నటుపిమ్మట నాఫత్ ఖానుఁడను మఱి

యొక శత్రువచటఁ జేరుకొనెననియు, నతఁడు సమయనిర్ధారణ మొనరించి యానాఁడు రెండు జాములవేళ పంశితజగన్నాథుని ఖండిత శిరమును జేతఁగొని నగరునందుఁ బ్రవేశించెదననియు, దనను బట్ట సమర్థులెవరు కలరో గాంచెదననియు మున్నగు సంగతులతో బ్రకటన పత్రములను గోడలయందును స్తంభములయందును నటించి యుండెననియు, విఠలుని వలన నెఱింగి కుమారవిజయేంద్రాభయమోహనయోగీంద్రులు మిక్కిలి తొట్రుపడుచు నెవ్విధంబున నాసమయమునకు గోరీగడము జేరగలుదుమా యని తలపోయసాగిరి. ఏలయన, నట్టి విపత్సమయమున నచటికిఁ జేరి ప్రతాపభానుమహారాజునకుఁ దోడ్పడకుండిన—యానిశాచరుని బారినుండి పురజనులను దప్పింపకుండిన—కుమారికరుణాదేవి మనల నెత్తిపొడుచుటకు సులువులభింపఁ గలదనియు, నామెకుఁ దమ ముఖములను జూపుటకు దగియుండమనియు వారి యభిప్రాయము.

అటుపిమ్మట నర్జునసింహుఁడు పదునైదు దినములు సెలవు గైకొని యెచటికో వెడలియుండెననియు వారికిఁ దెల్లమయ్యెను. ఈసమాచారముల నాలించి అభయసింహుఁడు తొట్రుపడుచు, మాబంధువుల యింట నెచట నేకార్యములును లేవుగదా? నాతండ్రి యిట్టి నెపమున నెచటి కేగియుండెనా యని తలపోయ దొడంగెను.

పిదప నభయసింహుఁడు తనమనస్సు బట్టనేరక గృహమున కేగి తండ్రి పోకనుగూర్చి తల్లిని ప్రశ్నించెను. అంత నామె వానితో, “కుమారా! తమ నాథుఁ డెపుఁ డెచటి కేగుచుండెనో తెలియఁజాలుట కైయూరుల భార్యలంతటి యోగ్యురాండ్రగుదురా?” యని యామె బదులు పలికెను.

ఇటుల విని అభయసింహుఁ డూరకుండెను. మఱుసటి దినమున జగత్సింహభూపాలుఁడు ప్రశ్నించిన మీఁదట నభయసింహుఁడు వానితో, “మహారాజా! మేము కుమారికరుణాదేవి జాడనరయ తఖ్ఖానా

లోనికేగి యుంటిమి. అచట నొక యోగీంద్రుని సందర్శనలాభము మాకు లభించినది. ఆమహాత్ముఁడు మిమ్ములను బ్రతాపభానుమహా రాజును నచటికిఁ గొనివచ్చిన దాను కుమారికరుణాదేవిని వారి కర్పిం తునని నుడువుటచే మిమ్ములను వెంటఁ గొనిపోవుటకు వెడలి వచ్చితి" మని మాత్రిమెఱింగించెను.

అంత జగత్సింహభూపాలుఁ డధికముగ సంతసించుచు, "నేను సంసిద్ధుఁడనై యుంటిని. కాని, ప్రతాపభానుమహారా జిపుడధికవిపత్తి యందుఁ జిక్కియున్నాఁడు. దానిని వర్ణింప నలవికాదు. పండిత జగ న్నాథుఁ డచటి కేగియుండెను. ఇపుడేమి కానున్నదో కాంచెదము గదా? నీవచటి వృత్తాంతములను వినియేయుందు" వనెను.

అభయ:—నేను సమస్తవృత్తాంతముల నాలించియుంటిని. మేమచటి కేగి వారికి తోడ్పడుట యుచితముగ దలంచుచుంటిమి."

జగత్సిం:--నే నయ్యదియే తెలుపనైయుంటిని.కుమారుని యభిప్రాయ మేమి? అతఁ డచటి కేగనుండెనా?

అభయ:—అతఁడు మృత్యుదేవతకైనను భీతిల్లువాఁడుకాఁడని మీరు బాగుగ నెఱింగియున్నారు. ఇఁక జాలిమఖానుఁ డన వా నికొక లెక్కయా!"

జగత్సిం:_- నిక్కమము. కాని, ఏవీరపురుషుని తోడనయినను దలపడి పోరుట మాధర్మము. ఆదుష్టుఁ డెచట నేనియు బొంచి యుండి కుమారునిపయి బ్రహరించు నేమో యెవరెఱుంగు దురు!

అభయ:—శూరశిఖామణులతో బోరుసల్పుట కుమారవిజయేంద్రసిం హుని కార్యమనుట నిజము. కాని మేము వెంటఁగొలిచి యుండ నేదుష్టుఁడుగాని, ఘాతకుఁడుగాని మఱియెవ్వడయి నను వాని సిగపూవైనను గదల్పఁ జాలునా!

జగత్సిం:——మేము మానసంరక్షణకయి ప్రాణములయినను దృణప్రాయములుగ దలంతుము. దుష్టులనుండియు ఘాతకములనుండియు దొలఁగియుండుటయు నొక ధర్మమయి యున్నది. కుమారుఁ డచటికిఁ బోకుండిన గార్యహాని యెద్దియు గలుగదు. మీరలచటి కేగి యాభూపాలునకుఁ దోడ్పడుఁడు. జాలిమఖానుఁడు పట్టువడిన వెనుక సమస్తవృత్తాంతము లాతేని కెఱింగించి యిచటికి దోడ్కొని రండు. మేమును వారి వెంట తఖఖానాలోనికిఁ బోయెదము."

కుమారవిజయేంద్రసింహు నీసమయంబున గారీగడమునకు బుత్తెంచుట జగత్సింహభూపాలునకు సమ్మతముగాకుంట నెఱింగి తానా విషయమున బట్టుపట్టుటయు నుచితముగాదని తలంచి అభయసింహుఁ డూరకుండెను. పిదప దానొంటరిగ గారీగడమున కేగుట కాభూపాలుని యానతి బడసి వాని లేఖను గైకొని గారీగడము వైపునకుఁ దరలిపోయెను.

అతఁ డటులఁ గొంతదవ్వరిగిన పిదప సహస్రకిరణుని ప్రఖరకిరణజాలంబులసంతప్తుఁడయి యొకదట్టమగు వృక్షచ్ఛాయఁ గొంతతడవు విశ్రమించి యలయిక దీర్చుకొని మరల బయనంబై రాత్రి రెండుజాములవేళకు గారీగడమున బ్రవేశించి రాజనగరులోనికిఁ జేరుకొనెను. అపుడచట బెక్కు సర్దారులు శూరాగ్రేసరులు గుమికూడియుండిరి. ప్రతివాఁడు నతిమెలకువ నలుగడలఁ దిలకించుచు జాగరూకులయి యుండిరి. అంత దటాలున తూర్పు మిద్దెపయినుండి యార్గురు మనుష్యులు "ధం. ధమ్మని" క్రిందికి దుమికి యచట గుమికూడియున్న జనసమూహము మధ్యకుఁ బోయి నిలిచిరి. వారిముం దాఫత్ ఖానుఁడు పండితజగన్నాథుని ఖండిత శిరమును జేత ధరించియుండెను.

అభయసింహు నింతదనుక నెవ్వరును గాంచియుండలేదు. అట్టి

సమయంబున నతఁ డదలింపు పలుకులతో, "నీ దుష్టులను బంధింపుఁడు. బంధింపుఁడు. మిన్నక నేమి చూచుచుంటి" రని పలికి తానును వితంసమును విప్పి వారిపయి విసరెను. తోడనే యచట నుండిన సర్దారులు మున్నుగు వారలా ఘాతుకులను ముట్టడించి నిలిచిరి. అంత నాదుష్టులు-నిశాచరులు తమ చేతియందలి యుండలను భూమిపయి దమ సత్తువకొలఁది మోదిరి. కాని, అందేమికలదు? అంతయు మాయయే, మోసమే. ఇఁక వారలేమి సేయఁజాలుదురు? కరపదచలన ముడిగి యాదుష్టులు-నరహంతకులు నిశ్చేష్టితులయి నిలిచియుండిరి. వారంద రొక్కమాఱుగ బట్టువడిరి.

అపుడచటి వారలంద ఱభయసింహుని గాంచినంతనే పట్టరాని సంతసమున నుప్పొంగ దొడంగిరి. పిదప నాఫత్ ఖానుఁ డభయసింహుని డెసఁగాంచి "మేమచేజగన్నాథ్" అని పలికెను. ఈమాట వినినతోడనే అభయసింహుఁడాఫత్ ఖానుని చేయిపట్టుకొని యాదుష్టుల నుండి వేఱుపరచెను. వాని కరపాదములకు బంధించియుండిన కట్లను సడలించి వానిని కౌఁగలించుకొనెను. "అయ్యో! అయ్యో!! మీరేమి సేయుచుంటిరి? ఇతఁడు మిగుల దుష్టుఁడు. ఈతఁడే జగన్నాథుని ఖండించి వాని శిరమును జేత ధరించియున్నాఁడు. మీమతి భ్రమసియుండదుకదా? వాని నేల గారవించుచుంటిరని" యచటి వారలందఱు కేకలిడ దొడంగిరి.

అంత నభయసింహుఁ డుత్తేజిత స్వరంబుతో మిన్నకుండుఁడు." ఈతఁ డెవరో మీర లెఱింగియుండినకదా? ఏమి! జగన్నాథుని జంపుటొక యాట యనుకొంటిరా?" అనెను.

అభయసింహుని యోగ్యత నెఱుంగని వారచట నెవరును లేరు. వాని పలుకులకు మాఱాడ నెవరికి సాహసము గలదు? ఆఫత్ ఖానునచట విడిచి మిగత మైయారులను బాగుగ బంధించి భటులు కావలి

యుందుంచిరి.

అఫల్‌ఖానుని చేయియు నభయసింహుఁడు వదలివైచెను. మఱియు వానిని దన వెంట నిడుకొని ప్రతాపభానుమహారాజు కూర్చుండి యున్న తావునకుఁ బోఁ దొడంగెను. నలుదెసల కలకలము మిన్ను ముట్టుచుండెను. జాలిమఖానుఁడు తనయనుచరుల సైతము బంధింపఁబడి యున్నను ప్రజలెల్లరుగంపించుచునేయుండిరి. భూపాలుఁడు దవ్వుననుండి యీవింతనంతయుఁ బరికించుచుండెను. అభయసింహుఁ డాఫల్‌ఖానుని వెంటనిడుకొని తన వైపున కరుదెంచుచుంటను గాంచి భూపాలుఁడు తబ్బిబ్బుపడుచు తన యొరనుండి ఖడ్గమును దూసినిలిచెను. అంత నభయసింహుఁడు కేకలిడుచు, "మహారాజా! మీరు కలఁతనొందవలదు. మేమిరువురము మీహితులముగాని శత్రువులముగాము. నావెంటనుండిన వానిని మీరు మఱియొక విధంబుగ దలంచియుందురు. వాస్తవ మం దితడు జగన్నాథుఁ డనిగాని యన్యుఁడుగాడని పలికి యాఫతుఖానుని గడ్డమును దన చేతితోఁబట్టి నూడఁ బెఱికెను. అందువలన జగన్నాథుఁ డొక విధముగ గుర్తింపఁ బడెను.

ఇపుడు ప్రతాపభానుమహారాజు ప్రాణములు కుదుటఁ బడెను. ఆతఁ డభయసింహుని దెసఁగాంచి, "జగన్నాథుఁ డాదుష్టులతో నేల కూడియుండె" నని ప్రశ్నించెను.

జగన్నా:--ప్రభూ! నేను వారి యనుచరుఁడను గాకుండిన వారి నందఱి నిచ్చోటునకుఁ గొనితెచ్చి వంచించువారెవరు?

ప్రతాప:--మీ కరమునందు వ్రేలాడుచుండిన యాఖండిత శిర మెవ రిది?

జగన్నా:--ఇయ్యది మైనమువలన నిర్మింపఁ బడినది.

ఇపుడు జగన్నాథుఁడు జాలిమఖానుని వంచించెనను వార్త నలుగడల వ్యాపించెను. వానికి నలువైపుల జనులు గుంపులుకూడి యొకరి

నొకరు నెట్టుకొనుచు నొకరిపయి మఱియొకరు పడుచుండిరి. అధిక కష్టమువిూద నాసమూహమునుండి జగన్నాధుఁడు దొలఁగింపఁ బడెను. జాలిమఖానుఁడును వాని యనుచరులును నాదయామయుఁడు పండిత జగన్నాధుఁడని యెఱింగిరి. కాని, యాసమయంబున వారలేమి సేయఁ జాలుదురు? నిరుపాయులయి జగన్నాధుని దెగఁదిట్టసాగిరి. నిక్కువము—ఎపుడెవనికి ప్రాణసంకటము సంభవించునో యపుడతఁడు తన నోటికి వచ్చినటుల వదురుట సహజము.

జగన్నాధుఁడు వారి దూషణములపయి దృష్టినిడక వారివైపునకుఁ గాంచి నవ్వదొడంగెను. వాని తోపాటచట నిలిచియుండిన జనులెల్లరు కడుపులుబ్బ హసింపసాగిరి.

భూపాలుని యాజ్ఞానుసార మచటనుండిన ప్రజలెల్లరు వెలుపలకు వెడలఁ గొట్టబడిరి. కొందఱు సర్దారులు మున్నగు నుద్యోగీయులు మాత్రమచటఁ గలరు. పిదప నాదుష్టులను మహలులోపల నొక గదియందు బంధించియుంచిరి. తదుపరి జగన్నాధుఁడు కొంతజలమును దెప్పించుకొని తన ముఖమును జేతులను బాగుగఁదోమి కడుగుకొనెను. ప్రతాపభానుమహారాజు కొలువుదీర్చి కూర్చుండి జగన్నాధునితో "జాలిమఖానుఁడు మున్నగు వారిని వంచించిన విధమునుదెలియఁ గోరుచుంటి"ననెను. దానిని వినుట కభయసింహుఁడును మిక్కిలి వేడుక పడుచుండెను.

జగన్నా:—మొదట నే నాదుష్టుఁడగు జాలిమఖానుని గలిసికొనుటకు నీ యుక్తి బన్నితిని.—నానామ మాఫత్ ఖాన్ ఖూనీ యని పెట్టుకొని విజ్ఞాపన పత్రములను బ్రచురించితిని. నేను వ్రాసిన దానిని దెలిసికొనుట కిచట నైయారు లెవరును లేకుంట నెఱింగి నన్ను కలిసికొను సంకేతస్థాన మొరులకు దెలియకుండ నైయారిభాషయందు వ్రాసితిని.

ప్రతాప:—ఔను. "ఛేటీచోటీ" యని వ్రాసియుంటిరి. దాని యర్థ మేమి?

జగన్నా:—"ఛేటీచోటీ" యనఁగ నొక భయంకర ప్రవాహము.

అటుపిమ్మట జగన్నాథుఁడు జాలిమఖానుని వాని యనుచరుల సహితముగ గలిసికొనుటయు నుండయొక్క యద్భుతప్రభావమును జూపించి వారిని సంతుష్టచిత్తులనుగ నొనరించి తనకు బాసటగ గోటలోని కరుదేర వారిని సమ్మతిపఱచుటయు, దుర్గములోని కరుదెంచు సమయమున కృత్రిమములగు నుండలను వారి కొసంగి వంచించుటయు మున్నగు సమస్తవృత్తాంతముల నాద్యోపాంతముగ వారి కెఱింగించెను. ఆసమాచారము నాలించి భూపాలుఁడు వాని నేర్పునకు మది మెచ్చుచు బారితోషికముగ గొన్ని జాగీరులను వాని కొసంగెను గాని, యతఁడు వానిని స్వీకరింపనొల్లక యిటులఁ బలికెను. "మహారాజా! మాభూపాలుని యనుజ్ఞ బడయకయే మీయొద్దనుండి నే నేమియుఁ బరిగ్రహింపఁ జాలను. వారివలన నే నేకార్యసాధనమునకయి నియోగింపఁ బడితినో దానిని సాధ్యమగు విధంబున నెఱవేర్చుట నావిధికృతమయి యున్న" దనెను.

ప్రతాపభానుమహారాజు వాని వచనంబుల నాలించి సంతుష్టాంతరంగుఁడయి మఱియే సందర్భముననైన వీనికి బహూకరింపనగుఁగదా యని తన యుల్లంబున నిశ్చయించుకొనెను.

ఇట్టివిధంబులగు బ్రసంగంబుల నారేయి యంతయు గడిచి తెల్లవాఱెను. అభయసింహజగన్నాథులు భూపాలునివలన ననుజ్ఞ బడసి యరిమిత్రసింహుని వెంట వాని గృహమున కేగిరి.

---

# ఏడవ ప్రకరణము.



తెల్లవారి కొంత ప్రొద్దెక్కిన పిదపఁ బ్రతాపభానుమహారాజతి కౌతుకంబునఁ గొలువు దీర్చి కూర్చుండియుండెను. అభయసింహ జగన్నాథులును మిగుల సన్మానముతోఁ గూర్చుండఁ బెట్టబడిరి. భూపాలునియాదేశానుసారము శృంఖలాబద్ధులగు జాలిముఖానుఁడు మున్నగు వారలచటికిఁ గొనితేబడిరి.

అంత నభయసింహుఁడు జాలిముఖానుని దెసఁబరికించి:—

“ఖానువర్యా! నీనామము నిక్కువముగ జాలిముఖానుఁడేమగునా?

“ఇచట నైయారులను ఖండించు నియమము గలదా? తొలుత దాని నెఱింగింపుము. పిదప నీప్రశ్నలకు జవాబొసంగెదను”

“ఇచటనే యననేల? హిందూదేశమం దెచట నేనరిష్ట భూపాలుఁడు నైయారులను జంపింపఁడు. కాని, వారు తమ నియమముల నుల్లంఘించు నెడలఁ దప్పక దోరింపఁ బడుదురు.

“అటులయిన మేము వధింపఁ బడుదుమా?”

“అది భూపాలుని యిష్టము. కాని మీరైయారులయియుండియు నిట్టి ప్రశ్నలేల వేయుచుంటిరి?”

“ఔను. మే మైయారులము”

“హరి! హరి!! ఐయారినామమున కళంకమేల నాపాదించుచుంటిరి? మిమ్ములను బందిపోటు దొంగలన జెల్లునుగాని మైయారులన రాదు.

“మే మెన్నితరములనుండియో మైయారులమగుచు వచ్చితిమి. నేఁడు కొత్తవారలము గాము.

“మీతాతదండ్రులైయారులయి యుండవచ్చుగాని, మిమ్ములను మాత్రము బందిపోటుదొంగలనియే పలుకవలయును.”

“మీరటులనిశ్చయించినపిదప మేమీవిపత్తునుండి తప్పిపోవుదుమ

ను నమ్మక మేమి కలదు?"

"మీ రెవరయినదియు దొలుత నెఱింగింపుఁడు."

"మేమిపుడు వధింపఁ బడుచుండియు మాపరిచయము మీకొసంగి యాయపఖ్యాతి మాతలలపయి నేల రుద్దుకొనవలయును? మాకు బ్రాణప్రదాన మొసంగ వచన మిచ్చెదరేని మానిజవృత్తాంతముల నెఱింగించెదము."

"మేమావిషయమున బ్రతిన జేయఁజాలము. మఱియు మిమ్మెలను దగురీతి బాధించి మీనిజవృత్తాంతముల నెఱుంగక మానము."

"మే మెన్నటికిని దెలుపము."

"అటులయిన, మచ్చెలత్తో మీశిరముల సమాచారములు బాగుగ నరయనగును."

"మీ యిష్టము చొప్పున గవింపుఁడు."

అంత జగన్నాథుఁ డాజాలిమఖానుని దెసఁగాంచి:—

"వహ్వా! అప్రతిష్ఠుఁడా? ఏమి! యీదర్పము! అనెను.

జాలిమఖానుఁడు వానితో, "అయ్యా! గురువుగారు! మమ్మెలను బాగుగ వంచించియుంటిరి. మిమ్మెమెచ్చుకొన వలసినదే" అనెను.

"మీ మెప్పులకేమి వచ్చెఁగాని నేఁడో రేపో మీశిరములు దేహములనుండి వేఱుగఁజూపట్టగలవు."

"ఆశ్చర్యము! మే మేమియుఁ జేయఁజాలమయితిమి?"

ఈవాద ప్రతివాదముల వలన నించుకేనియుఁబ్రయోజనము లేదనియు వేయితలలు వ్రక్కలయినను జాలిమఖానుఁడు తన నిజవృత్తాంత మెన్నటికి నెఱింగింపఁడనియు మఱియే యితరోపాయములనైనను గావించుట శ్రేయమనియు నభయసింహుఁడు దలంచి భూపా

లునితో, "మహారాజా! ప్రకృత మీదుష్టులను బందిగమున కంపుట యుచితము. పిదపఁ దగురీతి నొనరింపఁ దగునని" విన్నవించెను. మఱియు నాఘాతకులలో నొకని వైపునకు దన వ్రేలితోఁ జూపుచు, వానిని మాత్ర మిచట నిలిపి యుంచుఁ డనెను.

అభయసింహుని కథనానుసారము భటులా దుష్టులలో నొకని నచట విడిచి తక్కినవారినిఁ జెఱసాలకుఁ గొనిపోయిరి. అచటినుండి వెడలుచు జాలిమఖానుఁ డభయసింహుని దెసఁ బరికించి, "నీవు మిగుల నేర్పరివి. అందు సందేహమేమియు గలుగదు. ముఖలక్షణములనుబట్టి హృదయభావములను బాగుగ జాడకట్ట సమర్థుఁడవు. మంచి పిటికిబోతును వెదకి నిలుపుకొంటివి. నీవు పేరు ప్రఖ్యాతులను గాంచగలవని" పలికెను.

అభయసింహుఁడు వాని పలుకుల నాలించి మందహాసముతో "దౌలుత వీనికి దుర్దశ గలిగింపఁ బడును. పిదప మీర లొకరొకరుగ నిచటికి గొనితేబడి విచారింపఁ బడుదు" రనెను.

జాలిమఖానుఁడును వాని యనుచరులు ముగ్వురును గారాగృహమునకుఁ గొనిపోఁబడిరి. మఱియు నాల్గవవాని నాసభాస్థలి నిలిపి యుంచిరి. అతఁడు మిక్కిలి భీరుస్వభావుఁడు. తన్నొంటరిగ నచట నిలిపి యుంచుటయుఁ దోడివారిని మఱియొక తావునకుఁ బుత్తెంచుటయుఁ గాంచి యతఁడు తల్లడిల్లఁ దొడంగెను. వాని ప్రాణములు మింటికెగసి పోయినట్లయ్యెను. అంత నభయసింహుఁ డొక భటుని గాంచి, "నీవు వేగమే వెడలి యొక కొలిమి కొలిమితిత్తులు బొగ్గులు యినుపకడ్డీలను గొనితెమ్మని" యాజ్ఞాపించెను.

అభయసింహుఁడు వాని నన్నింటి నెందులకు గొనితెమ్మనెనా యని యచటి వారందఱు నివ్వెఱపడ దొడంగిరి. వెంటనే యాభటుఁడు వాని నన్నింటిని గొనితెచ్చి యచట నునిచెను. పిదప నభయసిం

హుఁ డాభటునితో, "నిప్పురగులఁజేసి యాకదుళ్లను నెరగ్రా కాల్చు మని" పలికెను. ఇఁక నాదుష్టుఁడు నిలువలేకపోయెను. అతఁడు భీతిల్లుచు, "అభయసింహా! ఈకదుళ్లను గాల్పించి నీవేమి సేయుదువని" ప్రశ్నించెను.

అభయ:—అవి మెరగ్రా గాల్చి రెండు కదుళ్లు నీ నేత్రములందును మఱిరెండు నీచెవులయందును గుచ్చఁబడును.

దుష్టుఁడు:—మీరు కరుణార్ద్రహృదయులని పిలువఁబడుదురు. ఇట్టివిధంబున హింసించి యొకనిని జంపుట మిమ్ముఁబోలు వారి కార్యము గాఁజాలదు. మీసత్కీర్తియందుఁ గళంక మొదవక మానదు."

అభయ:—(నవ్వుచు) మిమ్ముఁబోలు దుష్టులను విడిపుచ్చుట సంకీర్ణహృదయులకార్యము. మీరు సజీవులయియుండునంతకాలము వేలకొలఁది ప్రాణులను హింసించెదరు. మీకిపుడు సెలవొసంగి యమపురికిఁ బుత్తెంచుటయే శ్రేయోదాయకము. ఇపుడు మిమ్ముల నెట్టివిధంబున బాధించి దోరించెదమో యావార్త నెఱింగి మీపిశాచసోదరులకుఁ గొంత బుద్ధి గలుగవచ్చును. మఱియు వారలితరులను బాధింపకుందురు.

దుష్టుఁడు:—ఇపుడెట్లైనంగునన్నైన నాప్రాణములు దక్కు మార్గముగలు గదా?

అభయ:—కలదు.

దుష్టుఁడు:—ఎటుల?

అభయ:—నిజముగ నీయనుచరుల పూర్వవృత్తాంత మెఱింగింతువేని యిపుడే విడువబడుదువు.

దుష్టుడు:—నే నబద్ధమాడను.

అభయ:—నీపలుకులు వాస్తవములని మేమెటుల విశ్వసింపఁగలము?
దుష్టుడు:—నేనా విషయములను దృష్టాంతపూర్వకముగ వివరింపగలను
అభయ:—మంచిది. వచియింపుము.
దుష్టుఁడు:—ఆలింపుఁడు.

ఆసమయమందా దర్బారంతయు జనులచేఁ గ్రిక్కిఱిసి యుండెను. అభయసింహుఁడు కొలిమియున్నగు వానినేల తెప్పించెను? ఆయినుప కడ్డీలెందు కుపయోగపడును? ఈదుష్టుఁడు నిక్కువమును వక్కాణించునా? యను విషయముల నెఱుంగుటకయి యందఱును నాతురతతో నుండిరి. ఎల్లరి చూడ్కులా దుష్టుని వైపునకు బ్రసరించియుండెను. మఱియుఁ బెక్కు జనులొకరి నొకరు నెట్టుకొనుచు వానివైపున కొఱగి యుండిరి. అంత నొక యువకుఁడు తన యొరనుండి కత్తిఁదూసి యాజనసమూహమునుండి యాదుష్టుని వైపునకు గెంతి దానితో వాని శిరమొక వ్రేటునఁ దెగనఱికెను. ఆదుష్టుని శిరము మొండెమునుండి వేఱుపడి దూరమునకుఁ బోయి పడెను. మఱియు నాఘాతకుఁడు తలవారిం ద్రిప్పుచుఁ గొందఱను గాయపరచి యచటినుండి పారిపోయెను.

ఆతడఁబాటు నందెవ్వరును వానిని బట్ట సాహసింపరైరి. కాని జగన్నాథుఁడేల విడచును? వెంటనే యతఁడు వానిని వెంటాడించి పరుగెత్తెను.

జగన్నాథుఁ డటులఁ బరుగిడుటఁ గాంచి వందలకొలఁది జనులా వైపునకుఁ బరుగిడుచు పోయిరి. కాని, అభయసింహుఁడు వారి ననుకరించక తన స్థానముననుండి సత్వరముగ లేచి తిన్నగా నాదుష్టులను బంధించియుంచిన కారాగృహము వైపునకుఁ బరుగిడెను. ఎవ్వరేనియు నైయారితనమును గావించి జాలిమఖానుఁడు మున్నగు వారిని విడిపించికొనిపోయి యుండరుకదా యని, వాని సంశయము. కాని యటుల జరిగి యుండలేదు. అభయసింహుఁ డచటి కావలివాండ్రకు బాగుగ

బోధించి, దిట్టపఱచి వెంటనే యచటనుండి క్రిమ్మఱికొలువుకూటమునకు వచ్చి చేరెను.

తొలుత నాఁడవాణమునం దెందరుకలరో వారిలో నాల్గవవంతు జనులుమాత్రి మిపుడా దర్బారునందుఁ గలరు. కొందఱు తమ యిచ్ఛానుసారముగను, గొందఱుభూపాలుని కనుసన్న నెఱింగియు జగన్నాథుని వెంటఁ బరుగిడిరి.

అభయసింహుఁడు మగిడివచ్చిన పిదప భూపాలుఁడు వానితో, "నీవెచటి కేగితి" వని ప్రశ్నించెను.

అభయ:—జాలిమఖానుఁడు మున్నగు వారల నెవ్వరేనియు నైయూరి తనమును గావించి విడిపించుకొనిపోయి యుండరుకదా యని శంకించుచు నేనా కారాగృహము వైపునకుఁ బరుగిడితిని. కాని, యటుల జరిగియుండలేదు. నేనచట కావలివాండ్రను జాగరూకులయి యుండుటకు దిట్టపరచి మగిడివచ్చితిని.

ప్రతాప:—జగన్నాథుఁ డెపుడు మరలివచ్చునో, యేమి కావించుకొని యరుదెంచునో కాంచెదముగదా?

అభయ:—శీఘ్రముగనే మగిడిరాఁగలఁడు. అతఁడు పరుకెత్తుటయందతి నిపుణుఁడు.

నేఁడు ప్రతాపభానుమహారాజు నియమిత సమయముకంటె నధికకాలము కొలువుకూటమునఁ గూర్చుండియుండెను. అభయసింహుఁడాభూపాలునితో, "నేఁటి దర్బారునందు ప్రభువుల కధికవ్యవధియయ్యె" ననెను. దానికి జవాబుగనాభూపాలుఁడు వానితో, "జగన్నాథుని రాకకయి వేచియుంటిని. అతఁ డరుదెంచిన పిదప లేక వానివృత్తాంతము దెలిసిన పిదప గొలువు చాలించెద" ననెను.

## ఎనిమిదవ ప్రకరణము.



ఒకజామునుకాలము గతించిన పిదప దర్బారు వెలుపల జనుల కలకలము వినవచ్చెను. ఎల్లరి దృక్కులా వైపునకుఁ బరుగిడెను. అంత నొక చోబుదారుఁ డరుదెంచి, "ప్రభూ! జగన్నాథుఁడా ఘాతకుని బట్టి కొనివచ్చుచున్నాఁ డని" విన్నవించెను.

జగన్నాథుఁ డాఘాతకుని వితంసముతో బాగుగ బంధించి వానిని వెంటఁగొని యచటికి వచ్చి చేరెను. అంత నాభూపాలుఁడు జగన్నాథునితో:—

"ఈతఁ డెవఁడో మీకు దెల్లమయ్యెనా?"

"లేదు. ఇతఁడేమియు వివరించుటలేదు. మఱియు వివరించునను నమ్మకయు గలుగదు.

"అగుచో, ... ... "

"ఇతఁడు తన రూపమును మార్చుకొని యున్నాఁడు.

అటుపిమ్మట జలమును దెప్పించి బలత్కారపూర్వకముగ వాని ముఖమును బాగుగ దోమించి చూచిరి. అపుడు వాని యప్పటిరూపము మాఱి నిజరూపము బయల్పడెను.

జనులు బాగుగ గుమికూడియుండిరి. ఆజనసమూహమందుఁ గలకలము మెండయ్యెను. ఆఘాతకుని నిజరూపము బయల్పడిన తోడనే యాజనసమూహములోని కొందఱు వానిని గుర్తింపగలిగిరి. భూపాలుఁడును వానిని గాంచి తుల్లిపడెను. మఱియు నభయసింహుని దెసఁగని "యీతఁడు దావూత్ ఖానుని బావమఱఁది. చెఱసాలయందుండిన జాలిమఖానుఁడు మున్నగు వారలును దావూత్ ఖానిబ్రహీముల కు బందుగులయి యుండవచ్చును. వారలను మరల నిచటికి రావింపు" డనెను.

భూపాలుని యాజ్ఞానుసారము జాలిమఖానుఁడును వాని యను చరులును గొలువుకూటమునకుఁ గొని తేబడిరి.

జగన్నా:—(జాలిమఖానునివంకఁ జూచి) మీరు దావూత్ ఖానిబ్రిహి ములకు బంధువులని గుర్తింపఁబడితిరి. ఆసమాచారము మీ యనుచరుఁడే వివరించియుండె"ననెను.

జాలిమఖానుఁడు వాని పలుకులకు మాఱెద్దియో పలుకుటకుఁ గోరుచుండెను. అంత నాఘాతకుఁడు (జగన్నాథు డీపుడు పట్టి తెచ్చినవాఁడు) "జాలిమఖాన్! జగన్నాథుని వంచన పలుకులఁ జిక్కి మోసపోకుము. ఇతఁడు వట్టికల్లరి. మన యనుచరుఁడు వివరించుట కవకాశ మొసంగకయే నేను వానిని శమనపురికిఁ బుత్తెంచితిని. మన ప్రాణములెట్టి దుర్దశయందు వెడలినను మన వృత్తాంత మించుకేనియు వీరికిఁ దెలుపరా" దనెను.

ఆపలుకుల నాలించినంతనే భూపాలుని కధికరోషము జనించెను కన్నులెఱ్ఱబాఱెను. దేహము కంపింపఁ దొడంగెను. మఱియు నభయసింహజగన్నాథుల వైపునకుఁ బరికించి, "చాలును. ఇపుడు వీరి వృత్తాంతముల నెఱుంగుట కెట్టియావశ్యకమును లే"దని పలికి మరల తన భటుల వైపునకుఁగాంచి, "ఇపుడు నాసమ్ముఖమున నీదురితాత్ముల శిరములను ఖండింపుఁ డని" శాసించెను.

ఆప్రోలునందలి ప్రజలెల్లరు వారి ప్రాణములను గొనుటకు దప్పికఁగొనియే యుండిరికదా? ఆజ్ఞయగుటయే తడవయ్యెను. ఇఁక నాలస్య మేమికలదు? తోడనే యాభటులు తమహస్త ప్రావీణ్యమును జూపించిరి. ప్రేతములను వెలుపలకుఁ గొనిపోవుట కాజ్ఞాపించి యానరపాలుఁడు తన గద్దియనుండి లేచి నిలిచెను. అంత నభయసింహుఁడు లేచినిలిచి కరములను జోడించి, "మహారాజా! నేనిటకే కార్యవశమున నరుదెంచియుంటినో దానిని విన్నవించుట కవకాశము జిక్కద

వ్యే” యనెను.

ప్రతాప:—ఆవశ్యకమగు విషయ మెద్దియేనియుఁ గలిగియుండిన నావెం
టఁ మహాలులోనికి రమ్ము.”

అభయ:—మిక్కిలియావశ్యకమగు విషయ మొకటి తెలుపవలసియు
న్నది. కాని, దాని నీసమయంబున వివరించుటకు నా మనస్సొప్పకున్నది.
కారణంబేమన, ప్రభువులకింత దనుకఁ గ్రోధము హెచ్చియున్నది.
నాదేహమందును నారోగ్యము లేదు. కాని, ఏసమాచారము నాలిం
చుటవలన మితిలేనియానంద మలవడఁగలదో యట్టి శుభవార్త నిపుడె
తెలియించుటయు నావశ్యకమని తలంచుచుంటిని.

అభయసింహుని తుదిపలుకులు భూపాలుని క్రోధవహ్ని నొ
క్కమాఱుగఁ జల్లార్చివైచెను. ముఖమండలియందుఁ బ్రసన్నత పొ
డసూపెను. ఆభూపాలుఁడు వెంటనే యభయసింహుని కరమును
బట్టుకొని మహాలులోనికి వెంటఁగొనిపోయెను. జగన్నాథుఁడును నభ
యసింహుని సంజ్ఞచే వారిని వెంబడించెను,

అభయసింహజగన్నాథులను వెంటఁగొని ప్రతాపభానుమహా
రాజు తన స్వీయమందిరమునఁ బ్రవేశించి, యందు విశ్రమించిన పిదప
నభయసింహుఁడా భూపాలునితో, “మహారాజా! తమరును జగత్సిం
హభూపాలురును తఖ్ఖానాలోని కొకమాఱేగవలసియున్నది. అచట
సిద్ధనాథయోగీంద్రుని కరుణాతిశయంబున గుమారిని వెంటఁగొని య
తిముదంబున మగిడి రాగల” రనెను.

అభయసింహుని పలుకుల వలన నాభూపాలున కెంతటి సంత
సమలవడియుండెనో దానిని వర్ణింప నలవికాదు. తెప్పున దన స్థానము
నుండి లేచి యభయసింహుని కంఠాలింగనముఁ జేసికొనెను. మఱియు
వానితో, “నీవు వేగమే చని ప్రయాణసన్నాహములను గావింప నరి
మిత్రసింహున కెఱింగింపుము. మీరిరువురును స్నానసంధ్యాదికృత్య

ములను దీర్చుకొని యారగింపుఁడు. నేనేగి కుమారిజనని కీశుభవార్త నెఱింగించెద" ననెను.

నేఁటి దినమంతయు శంకాశ్చర్యవిచారక్రోధ సంతోషాతిశయంబులఁ గడచిపోయెను. భూపాలుఁడు శుద్ధాంత మందిరమున కేగి తన రాణి కాయుదంతమంతయు నెఱింగించి కుమారికరుణాదేవి లభించునని విశ్వాసమామెకు గలిగించెను.

ఒక ముహూర్తకాలమునకుఁ బూర్వ మానగరియందొక విధంబగు బీభత్సము వ్యాపించియుండెను. ఇపుడెల్లరి మోములందును సంతోష చిహ్నములు గోచరించుచుండెను. కుమారికరుణాదేవిని గొని తెచ్చుటకయి భూపాలుఁ డేగుచుండెనను వార్త యాప్రోలునం దెల్లెడల వ్యాపించెను.

మఱునాఁ డరుణోదయముననే ప్రతాపభానుమహారాజు దేవీగడము వైపునకుఁ దరలి పోవుటకు నిశ్చయింపఁ బడెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.

---

పాఠకమహాశయులారా! కుమారికరుణాదేవి విజయేంద్రసింహులు పరితోషించుటనుగాంచి మనమును ముదమందు సమయము సమీపించినది. ప్రతాపభానుమహారాజు గౌరీగడమునుండి తరలి దేవీగడమున కేగుననియు, నచటినుండి జగత్సింహవిజయేంద్రుల వెంట తిలస్మ తఖ్ఖానాలోనికిఁబోవ నుండెననియు మీర లెఱింగియే యుంటిరి. ఆ నాఁడు కుమారవిజయేంద్రసింహుఁ డాతిలస్మ తఖ్ఖానానుండి వెడలు సమయంబున సిద్ధనాథయోగీంద్రుఁడు వానితో, జగత్సింహప్రతాపభానుమహారాజులను వెంటఁ గొని తెచ్చి వారల నాతఖ్ఖానా వెలుపల

ను విడిచి ముందుగ నీవు మైసూరుల వెంట నిచటి కరుదెంచి నన్నొ
కమాఱు కలిసికొనవలయునని తెలిపియుండిన విషయమును మీరలె
ఱుంగనిదికాదు. అద్వైతేంద్రుని కథనానుసారముగ నతఁడు తప్పక
నొనరించును. మంచిది! వారలను వారివారి కార్యసాధనంబుల విడిచి
వేయుఁడు. ముహూర్తకాలము కనులు మూసికొని మీరు మావెం
ట నాతఖఖానాలోనికి విచ్చేయుఁడు. మఱియు నేమూలనో పొంచి
యుండి యచట విహరించుచుండిన యాసుందరీమణుల వార్తాలాపము
లను సావధానచిత్తులరయి యాలింపుఁడు. బహుశః మీహృదయముల
యందు నెలకొని యుండిన సందేహములు వీడిపోగలవు. మొదటి, రెం
డవ భాగముల యందలి సమస్త మర్మములు వారి సంభాషణములను
నాలించుటవలన వెల్లడియయి మీకుఁ గొంత యానందము చేకూరఁగ
లదు. కుమారవిజయేంద్రజగత్సింహప్రతాపభానులు నేఁడచటికిఁ జేరు
కొనరు. దేనియందుఁ గుమారవిజయేంద్రసింహుఁడు ప్రతిమ దర్బారు
ను గాంచియుండెనో, మఱియు దేనియందు సిద్ధనాథయోగీంద్రవనక
న్యకలతో నతఁడు గలిసికొని యుండెనో, యాతఖఖానాయందలి శృం
గారవనములోనికి మీర లీ సమయంబుననే మావెంట విచ్చేయుఁడు.

చాలును! మనమిపుడా యుద్యానవనమందుఁ బ్రవేశించితిమి.
అస్తోన్ముఖుండగు భాస్కరభగవానుఁడు తన సుందరారుణకిరణజాలం
బులచే నీమనోహర శృంగారవనమందలి సమున్నతపాదపాగ్రంబుల
నెటులఁ బ్రకాశింపఁ జేయుచుండెనో చూడుఁడు. శీతల సమీరమీ
యుపవనమందలి సుగంధపుష్పరాజివయినుండి పరుగిడుచు వాని సౌరభ
మును నలుగడల వెదజల్లుచుండెంగదా? అల్లదే! అటు పరికింపుఁడు;
ఈశృంగారవనమునకు మధ్య నొప్పుచుండిన చంద్రకాంత శిలావినిర్మిత
వేదికపయి మూఁడు పర్యంకములు వరుసగఁ బఱచబడి యున్నవికదా?
వానిలోమధ్య నొప్పుచుండిన నవరత్నఖచితహంసతూలికాతల్పమందలి

యలంకారములను ముఖ్యముగ మనముగమనింపవలసియున్నవి. అయ్యారే! ఆచిన్ని పచ్చికబయలెట్టి సొంపుగ పెరిగియున్నవి! దానియందలి పచ్చని దుబ్బులెంత విచిత్రవైఖరి గత్తిరింపఁబడి యుండలేదు! పచ్చమఖమలు తివాసీకిని దీనికిని భేదమించుకేనియుఁ దోచుచున్నదా? లేదు. ఆదుబ్బులకు నలువైపులఁగల పూలమొక్కలందలి పలురంగుల పూలగుత్తులెంత మనోజ్ఞములయి తనరారుచున్నవి? వహ్వా! ఈగులాబిమొక్కలోక పటాలము పంక్తివలె నెంతయందముగఁ దోచుచున్నవో పరికింపుఁడు.

వాని ప్రక్కకు మీచూపులను బోనీయుఁడు. అచటి సంపెఁగ పొద లోన జారుట కలవికాని యటుల నెంత గుబురుగఁ బెఱిగియుండెనో చూచితిరా? దానియందలి మొగ్గలు కొంచెముకొంచెముగ వికసించుచు నెంత సొగసు లీనుచున్నవి? ఆకుమళ్లు రెండింటికి మధ్య మిక్కిలి సుందరముగ నొప్పుచున్నయా పొదరింటిని తిలకించితిరా? నలుదెసల గ్రిందినుండి మీదికి నల్లిబిల్లిగ నల్లుకొనిన మాలతీలత యెంతవిస్తారముగఁ బూవులు పూచియుండెనో పరికింపుఁడు. మీ మానసంబులిచ్చగించునెడల నేదియో యొకప్రక్కను నిలుచుండి మొదలకుండగ మీచేతులునిండ నాపూవులను గోసికొనుఁడు. ఇఁక పడమటి దిశకు మీచూపులఁ బ్రవర్తింపుఁడు. ఆపూలమొక్కలకు సమీపమున నిలిచి ముఫ్వురు సుందరీమణులు పుష్పపత్రింబులనుగోసి తమతమ యొడియందు నింపుకొనుచుండిరి. ఆపూఁబోండ్లలో నొకతె మన నవలకలంగారభూతయగు వనకన్యక. తక్కిన యిరువురామె చెలికత్తెలు.

వనకన్యక శుభ్రవస్త్రధారిణి. ఆమె చెలికత్తెలలో నొకతె శుక్లవసనమును రెండవది పీతవసనమును ధరించియుండిరి. గుర్తించితిరా?

ఆయువతీమణులు పుష్పపత్రంబులను గోయుటమాని యిపుడా చంద్రకాంత శిలోవేదిక వైపున కరుదెంచుచుండిరి. బహుశః వారలా

పాన్పులపయిఁ గూర్చుండుటకో లేక పరుండుటకో కోరుచుందురు.

ఔను! మన తలంపే నిక్కమయ్యెను. వనకన్యక తన యొడియందలి పుష్పపత్రంబుల నావేదికపైఁ బడవైచి పరిశ్రాంతిఁ గొనిన ముఖముద్రతో మధ్యనొప్పుచుండిన నవరత్నఖచిత పర్యంకముపయి మేను వాల్చినది. ఆమె సఖులిరువురు నారెండు పర్యంకములపయిఁ గూర్చుండిరి. పాఠకులారా! మనమిపుడు మౌనముబూని యొకవైపున నిలిచి వారి సంభాషణములను గొంత యాలింతము.

వనకన్య:—అబ్బా! నేఁ డధికముగ వేసారితిని!

పీతవసన:—నేఁడు మనము స్వల్పముగ సంచరించితిమా?

శుక్లవసన:—(పీతవసన సుందరితో) సఖీ! నీవును బడలితివా?

పీతవసన:—నేనేల శ్రమనొందెదను? అనుదినము క్రోశులకొలఁది దూరము గ్రుమ్మరివచ్చినప్పుడే యలయిక నొందనైతిని.

శుక్లవసన:—అహహా! ఆదినములలో మనమెటుల పరుగులిడ వలసి వచ్చెను? ఒకప్పుడిటు-ఒకప్పుడటు-ఒకప్పుడురా! మఱియొకప్పుడు పో! ఇట్టివిధమున నేకదా, మనము విసుకు విరామము లేకయే సంచరించియుంటిమి.

పీతవసన:—తుదకుఁ గుమారవిజయేంద్రసింహుని సవారులు మన జాడ తెలిసికొన జాలరైతిరికదా?

శుక్లవపస:—జ్యోతిష్కుని బుద్ధియే పెడతల బట్టెను. అతఁడు జ్యోతిషశాస్త్రమం దతినిపుణుడని కదా ప్రఖ్యాతి. ఇఁక నితరుల విషయము వేఱుగ జెప్పవలయునా?

వనకన్యక:—సిద్ధనాథయోగీంద్రుఁడు మనకంఠములయందు బంధించి యుంచినయంత్రములే వాని శాస్త్రపరిజ్ఞానమును నిరర్థకముగ జేసివైచెను. వానిని మనకంఠమునుండి తీయుటకింకను మన బావాజీ సమ్మతించుట లేదుకదా?

పీతవసన:— ఈయంత్రములందెట్టి ప్రభావముగలదో కాని, వీని మూలముననేకదా వాని జ్యోతిష్యము వమ్మగుచువచ్చెను.

వనకన్యక:— నే నొకనాఁడీ విషయమును సిద్ధనాథ బావాజీని ప్రశ్నించియుంటిని. అతఁడా వివరమంతయు జెప్పియుండెనుగని, నాకిపుడది బాగుగ జ్ఞప్తియందులేదు. బీజాక్షరయోగమువలన గ్రహరాశినక్షత్ర తారల ప్రభావమేయే ధాతువులయందు సమ్మిళితములగునో ఆయాధాతువుల నొక్కటిగ కరఁగి నిర్మించిన తావీజు (రక్షరేకు) లెవరి కంఠములం దలంకరింపఁ బడియుండునో వారి విషయమున నెంతటి నిపుణుఁడగు జ్యోతిష్కుఁడైనను నేమియు నెఱుంగఁ జాలఁడు.

శుక్లవసన— తప్పక వీనియందుఁ గొంతప్రభాము గలిగియుండెను. చూడుఁడు. నేను చంద్రవదననై కుమారవిజయేంద్రసింహుని సమీపమున కేగినతఱి యోగీంద్రనాథజ్యోతిష్కుఁడు నేనొక మైయారినని తెలిసికొనలేక పోయెఁగదా?

వనకన్యక— (నవ్వుచు) అపుడు నామనోనాథుఁడు బాగుగ జకితుఁడయియుండును.

శుక్లవసన:— ఏమని తెలుపుదును? ఈపిశాచ మెచటనుండి దాపరించెననియు నాచే బాసచేయించుకొని యిట్టి వచనంబులు పలుకుచుండెఁగదాయనియు నతఁడు మిగులఁ దొట్రుపడెను.

పీతవసస:— అవియన్నియు నటుండనిండు. అదృష్టమనునదియు నొకగొప్పవిషయమే! చూడుఁడు. విక్రమసింహుని మైయారులు తిలస్మపుస్తకమును ముచ్చిలించి దాని నొకతావున బాతిపెట్టుచుండమన మాకస్మికముగా నచటికిఁజేరి దానినిగాంచితిమి. అటుకానిచో నాపుస్తకమును బడయుటకయి యెంతశ్రమ నొందవలసియుండునో యెవరెఱుంగుదురు?

వనకన్యక:—అధికకష్టమున సిద్ధనాథబావాజీ మనము సంచరించుట
కనుమతి యొసంగియుండెను. మఱియు నాప్రియుని దౌదవ్వు
ల నుండియే వీక్షింపవలయుననియు, సామీప్యమునకు బో
రాదనియు మనచే బాస సేయించుకొనియుండెను గదా!

శుక్లవసన:—అందువలన నీకే ప్రయోజనముగలదు కాని, బావాజీగారి
కేమిఫలితము గలదు?

వనకన్యక:—నిక్కువము. కాని, నేనేమిసేయుదును. నాప్రాణవల్లభు
ని గాంచకుండిన నామనస్సెటుల నూరటఁజెందును?

పీతవసన:—మే మిరువురము నిరంతరము సంచరించుచుఁ గుమారునకు
తోడ్పడుచుండవలయుననికదా బావాజీగారి యాజ్ఞ. మా
లకారిరూపమును ధరించి కుమారుని వంచింపఁ దలంచుచుం
డిన జగన్నాథుని గుట్టు బయటబెట్టి వానినెటుల నా ముప్పు
నుండి దప్పించియుంటినో చూచితిరికదా?

శుక్లవసన:—ఐయారులు మనజాడ నెఱుంగుటకయి భగీరథ ప్రయత్న
ములను గావించియుండిరి. కాని దైత్యమారగురుకులభూ
షణుండగు బావాజీ నిరంతరము మనకుఁ దోడ్పడుచుండుట
వలన వారలేమియుఁ జేయఁజాలరైరి. మన మానాఁడు
గంగానదియందొక నావపయిఁగూర్చుండి విహరించుచు
న్నతఱి నభయమోహనయోగీంద్రులాప్రవాహమునబ
డి యీదులాడుచు మనలను సమీపింపఁ గోరుచుండ మ
నబావాజీ వారి నెటులఁ జకితులనుగ నొనరించియుండెనో
చూడుఁడు. మనవారలు వారి కట్టుపుట్టములను సహితము
మాయము జేసి యుండిరికదా?

పీతవసప:—మనవాఁడు తెలిసియో తెలియకయో వారిని తనవెంటగొ
నివచ్చెను.

వనకన్యక:—ఆమైయారులెంత నిపుణులైన నేమి? మన బావాజీకి మాత్రము పాటికారు. వారిలో నభయసింహుఁడుమాత్రము కొంతచురుకరియనందగును.

శుక్లవనస:—అతఁడెంత చురుకరియైన నేమి? మన సిద్ధనాథబావాజీ యానేర్పునందు వాని పితరుఁడనందగు.

వనకన్యక:—(నవ్వుచు) వాని స్థితి నీవే యెఱుంగవలయు గాని, మే మేమెఱుంగుదుము?

శుక్లవనస:—సఖీ! నాతో మేలమాడుచుంటివా?

పీతవనస:—ఆకాలంబున సిద్ధనాథబావాజీ కుమారుని వాని మైయారులను నెటులఁ గనుఁబ్రామియుండెనో చూడుఁడు. మనమీ తఖఖానా తిలస్మమును ఖండించుచుంటిమనియైనను వారికి దోఁచదయ్యెను.

శుక్లవనస:—మనము లోపలినుండి తఖఖానాద్వారమును బంధించి తిలస్మమును ఖండించుచున్న సమయమున నభయసింహుఁడు జగన్నాథుని బంధించియుంచిన మూటనుగొనివచ్చి తఖఖానాలో వానిని విడిచి పోవుటకుఁ గోరెను గాని, ద్వారమేవిధమునను దెఱవకుండుటచే నిరుపాయుఁడై మగిడిపోవలసినవాఁడయ్యెను.

వనకన్యక:—లోపలివైపుననుండి యీద్వారమును నెవరు బంధించియుందురాయని యతఁడు మిగుల దొట్రుపడియుండును.

శుక్లవనస:—ఔను. మఱియు మనము కొన్ని విషయములయందుఁ గుమారుని వాని మైయారులను డాఁగురించియుంటిమి. అటనేను చంద్రవదననై విక్రమసింహుని విడిచిపుచ్చెదనని బెదరించి వచ్చితిని. ఇట విక్రమసింహునివలన గుమారునితో సఖ్యత నొడగూర్చుకొనుటకు బాసచేయించుకొ

ని వానిని విడిచిపుచ్చితిమి. అందువలన వారు చంద్రవదన యొక్క పెనుభూతమని తలంచియుందురు.

వనకన్యక:—విశ్వాసఘాతకుఁడగు విక్రమసింహుఁడు తన ప్రతిజ్ఞను భంగపఱచి నాప్రియునిపయి వానికిగల పగను సాధించుకొనుటకుఁగటిబద్ధుఁడయ్యెను. అట్టివారి పలుకులయందే మి విశ్వాసము గలుగగలదు?

శుక్లవసన:—అందువలననేకదా, మనము వానిని మరల బంధించితిమి. తిలస్మపుస్తకమును మరల సంపాదించి కుమారుని కొసంగితిమి. శ్వేతసింహుఁడొకనాఁడు మమ్ములను గుర్తించి వెంటాడించెను. ఆదురాత్ముని ప్రాణములతో విడిచిన మన గుట్టంతయు బట్టబయలగునని తలంచి నేను వానితోఁబోరుసల్పి వానిని మడియించితిని. తుదకు వాని మరణము నాచేతియందు నిర్ణయింపఁబడియుండెఁగాఁబోలు.

పీతవసన:—తాను స్వయముగ నాతిలస్మమును ఖండించి దానియందలి ధనమంతయు గొనిపోవలెనని యానీచుఁడు తలంచియుండును.

వనకన్యక:—ఈతఖఖానాతిలస్మము నావలన ఖండింపఁబడుటచే నేనధికప్రమోదభరితనైతిని.

శుక్లవసన:—ఇదియంతయు సిద్ధనాథబావాజీ కృపావిశేషము.

వనకన్యక:—నిక్కమము.

---

## పదియవ ప్రకరణము.

తన స్థానంబున సరిమిత్రసింహుని నియోగించి, యుభయసింహ జగన్నాథులను వెంటఁగొని ప్రతాపభానుమహారాజు దేవగడము

వైపునకు బయలుదేరెను. వారి వెంట నైదువందల పదాతులును గలరు. వారికి మార్గమందొక దినము గతించెను. మఱునటి దినమున దాదాపుగ దేవీగడమును సమీపించి యచట దమ పటకుటీరములను నాటించిరి.

జగత్సింహభూపాలుఁడు ప్రతాపభానుమహారాజు యాగమన సమాచారము నాలించి, వెంటనే రాజకీయ కర్మచారులను, సర్దారులను వెంటగొనిపోయి, వానికి స్వాగతంబొసంగి తన వెంటఁ గోటలోనికిఁ దీసికొని వెళ్లెను.

ప్రతాపభానుమహారాజు నివసించుటకయి యొక మందిరమును బాగుగ నలంకరించియుంచిరి. దానియందా భూపాలుని విడియించి విందు-వినోదములఁ గావింపవలంచిరి. కాని, ప్రతాపభానుమహారాజం దులకియ్యకొనక మీయాతిథ్యమును గొండొక కారణంబున స్వీకరింపఁజాలను. మీరావిషయమున పట్టుపట్టకుండుటయేగాక దానికారణమునుగూడ బ్రశ్నింపఁగోరకు" డనెను.

జగత్సింహభూపాలుఁ డాహేతువును గ్రహించినవాఁడై తన యంతరంగమున మిగుల సంతసింపఁ దొడంగెను.

రాత్రికాలంబున కుమారవిజయేంద్రసింహుఁడు తనమైయారుల వెంట నదటికేఁగి ప్రతాపభానుమహారాజును సందర్శించెను. ఆతఁడధికసంతసమున వానిని కౌఁగలించుకొని తన సమీపమున నుపవిష్టుని గావించి తిలస్మసమాచారములను బ్రశ్నించెను. కుమారవిజయేంద్రసింహుఁడా యుదంతమంతయుఁ దేటపడ నెఱిఁగించి వానిని సంతోషచిత్తునిగ నొనరించెను.

సూర్యోదయము గాకమున్నె తిలస్మశఖఖానాయందలి సిద్ధనాథయోగీంద్రుని సందర్శింపనేగుట కా రాత్రియే నిశ్చయించుకొనిరి.

మఱునటిదిన మరుణోదయంబున దారకముల ప్రకాశమందు

ప్రతాపభానుజగత్సింహ విజయేంద్రాభయమోహన జాలిమసింహజగన్నాథవిఠలరమేశచంద్రులు, దాదాపొక వేయిజనముతో నాతిలస్మతఖఖానా వైపునకుఁ దరలిపోయిరి. అచటికి తఖఖానా యధికదూరము లేదుకదా? సూర్యోదయమగుసరికి వారలాతఖఖానా నొద్దకుఁబోయిచేరిరి.

కుమారవిజయేంద్రసింహుఁడు ప్రతాపభానుజగత్సింహ భూపాలురకు నమస్కరించి సిద్ధనాథయోగీంద్రుని వచనంబులను వివరించి వారి యనుజ్ఞను వేఁడెను.

“యోగివరుని పలుకులు కడుంగడు యాదరనీయములు. నీవేగి వారిని సందర్శించి రమ్ము. మేమంతదనుక నిచట గుడారములను నాటించి నీరాకకయి వేచియుందు”మని యాభూపాలురు బదులుపలికిరి.

కుమార విజయేంద్రసింహుఁ డభయసింహుని మాత్రము వెంట నిడుకొని యాతఖఖానాలోనికిఁబోయెను. పూర్వోక్తవిధంబున వారా తఖఖానా ద్వారఃమును దెఱచి కొన్నిగదులు కట్టడములు యుపవనములు గ్రుమ్మరుచు సిద్ధనాథ యోగీంద్రుఁడు నివసించు తోఁటలోనికిఁబోయి చేరిరి.

ఆయుపవనమందు పాదమిడినతోడనే సిద్ధనాథయోగీంద్రుని సందర్శన లాభము వారికబ్బెను. ఆయోగీంద్రుఁ డొకద్వారమునొద్ద దీర్ఘాలోచనాతత్పరమానసుఁడయి నిలిచియుండెను. అతఁడు కుమార విజయేంద్రాభయసింహుల రాకనుగాంచి వారికెదురేగుచు, “వచ్చితిరా” యని కేకవైచి వారిని బలుకరించెను.

వారిరువురు దవ్వుననుండియే యోగీంద్రునకు నమస్కరించి వానిని సమీపించిన పిదప వాని ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగ విజయేంద్రసింహుఁ డాయోగిపుంగవునితో, “మహాత్మా! తమకథనానుసారము భూపాలు రిరువురను తఖఖానా వెలుపల విడిచి మిమ్ములను సందర్శిం

ప నేతెంచితి” ననెను.

సిద్ధ— “మంచిది! నేడు నీవు కుమారికరుణాదేవిని దప్పక గలిసి కొనఁజాలుదువు”

అభయ:—తమ దయాకారణము న.

సిద్ధ:— మంచిది! ఎల్లరకు గుశలమేకదా? గౌరీగడ దేవీగడములం దెట్టి యుత్పాతములును బుట్టియుండ లేదుకదా?

అభయ:— (ఆశ్చర్యభావముతో వానివైపునకుఁ జూచుచు) మహాత్మా! ఉత్పాతమొకటి సంభవించినది. జాలిమఖానుఁడను వాఁడీ రెండు రాజ్యములకు శత్రువయ్యెను.

సిద్ధ:— ఔను. అదినేనెఱుంగుదును. పండితజగన్నాథుఁడు తన నేర్పునం దారితేజినవాఁడు. ఆతఁడతి నిపుణతతో వారలను వంచించియుండెను. మఱియు నాదుష్టులను వధించుటయే మేలయ్యెను. ఇఁక వానితోడివారలకీరాజ్యములపై శత్రుత్వ ముబూనుటకు ధైర్యముగలిగియుండదు, రండు. మనము సంచరించుచు వార్తాలాపములను గావింపనగును.

విజయే:—చిత్తము.

అభయ:— ఆయుదంతమంతయు మీకు దెల్లమయియుండిన జాలిమఖానుఁడెవఁడో మీరెఱింగియుందురు.

సిద్ధనాథ:--లేదు. నేనావిషయమెఱుంగను. కాని, యతఁడు దావూత్ ఖా నిబ్రహీముల బంధువులలో నొకఁడయి యుండవలెను.

విజయే:—మీతలంపు మిగుల సరియైనది.

సిద్ధనాథ:— విక్రమసింహ నరపాలుఁడరణ్యమున కేగియుండెనా?

విజయే:— చిత్తము. తపమాచరింప నరణ్యమున కేగెదనని నాజనకునితోఁ జెప్పి పోయెనఁట.

సిద్ధనాథ:— శత్రువుల యెడల విశ్వాసముగలిగియుంట సర్వదాహానికర

రము.

విజయే:— ఏమి! ఆతఁడు మాపయి పగబూనుటకు మరల సాహసించు నా?

సిద్ధనా:— ఎవరెఱుంగుదురు?

విజయే:—తమ రానతి యొసఁగుదురేని భూపాలురను వెంటఁగొనివ చ్చెదను.

సిద్ధనా:— మంచిది. నేనే కారణంబున వారిని వెలుపల విడిచిరమ్మంటినో దాని నెఱుంగ గోరవా?

విజయే:—చిత్తము. వచియింపుఁడు.

సిద్ధనా:— రాకుమారా! కరుణాదేవికిని నీకును గలిగియుండిన ప్రేమా నుబంధము నేనెఱుంగని విషయముకాదు. ఆపృథ్వీశులిరు వురి సమక్షమున నీవు కరుణాదేవినిఁగాంచి కాని కరుణాదేవి నిన్ను జూచికాని మీకు గలిగియుండిన ప్రేమోద్రేకముల వలన మైమఱచి యొకరునొకరు గాఢాలింగనము జేసుకొ నుట, లేక మఱియేయనుచిత కార్యమేనియు గావించుట యొకవింత విషయముకాదు. అందువలన వారికంటె ముందుగ నీవొకమాఱు కుమారి కరుణాదేవిని గలిసికొను ట యుచితముగఁ దలంచియుంటిని. రమ్మ. నావెంటర మ్మని" పలుకుచు నాయోగిపుంగవుఁ డచటినుండి బయలు దేరెను.

ఆహా! ఇపుడు కుమారవిజయేంద్రసింహుని హృదయభావముల ను వర్ణింప నెవరితరము! నేడు-కొన్ని నిమేషములలో-సిద్ధనాథయో గీంద్రుని కరుణాతిశయంబున గరుణాదేవి సందర్శనలాభము వానికి గ లుగఁగలదు. ఏయన్నుల మిన్ననుబడయుటకయి యతఁడు రేయింబవ ళ్లు పరితపించుచుండెనో-రాజ్యధామంబులను సుఖారామంబులను బరి

త్యజించియుండెనో యట్టి కుమారి కరుణాదేవితో వానికి సంయోగము గలుగనై యున్నది. మఱియు వానికిపుడే విధంబులగు చింతలును లేవు. విచారములు లేవు. శత్రువులు లేరు. అట్టి తరుణంబున వాని సంతోషమునకు పరిమితి గలిగియుండునా? అతఁడధిక ప్రమోదభరితుఁడయి యోగీంద్రుని పలుకులకుఁ బ్రతివచనములను బలుకఁజాలక వాని వెనువెంటనే పోఁదొడంగెను.

వారలు దివానుఖానా వైపునకుఁ గొంతదూర మేగియుందురు. అంతె నచట నొక పరిచారిక పుష్పములను గోయుచు వారికి జూపట్టెను. సిద్ధనాథయోగీంద్రుఁడా పరిచారికను జేరఁబిలిచి, "నీవు వేగమే వెడలి కుమారవిజయేంద్రసింహుఁడు నిన్ను గలసికొనుటకు వచ్చుచుండెననియు, నీ చెలికత్తెలవెంట దివానుఖానా లోనికేగి కూర్చుండుమనియు గుమారి కరుణాదేవి కెఱింగింపు" మనెను. తోడనే యాపరిచారిక పరుగులిడుచు నొకవైపునకు వెడలిపోయెను. సిద్ధనాథయోగీంద్రుఁడు కుమారవిజయేంద్రాభయసింహులను వెంటనిడుకొని యాతోఁటయందు సంచరించుచుండెను.

కుమారవిజయేంద్రాభయసింహులు తమతమ యోచనలయందు నిమగ్నచిత్తులయి యుండిరి. అభయసింహునకును సౌదామినితో గలిసికొను నభిలాష మెండుగ గలిగియుండెను. వారితో నేమని ప్రసంగింపవలయును? ఏమి ప్రశ్నింపవలయును. వారి పరుషవచనంబులకే మని ప్రత్యుత్తరం బొసంగవలయును? ఇట్టి విధంబులగు పెక్కువిషయముల నాలోచించుచు వారలిరువురు సిద్ధనాథయోగీంద్రుతో సంభాషింపకయే మౌనమును వహించి యాశృంగారవనంబున దిరుగాడుచుండిరి.

వారిరువుర నందుదిప్పుచు సిద్ధనాథయోగీంద్రుఁడు మున్ను కుమారవిజయేంద్రసింహుఁడు కరుణాదేవి ప్రతిమ దర్బారును గాంచి

యుండిన మందిరమునొద్దకువచ్చి నిలిచి కుమార విజయేంద్రసింహునితో “రాకుమారా! మీరీమందిరములోని కేగి కుమారి కరుణాదేవి సౌదామిని సరోజినులను గలిసికొనుఁడు. అంత దనుక నేను మఱియొక కార్యమును జూచుకొనియెద” ననెను.

---

## పదునొకండవ ప్రకరణము.

కుమార విజయేంద్రసింహుఁ డాదినానుఖానాయందుఁ బ్రవేశించి సౌదామిని సరోజినులతోఁ గొంతదూరమున నిలిచి ద్వారము వైపునకుఁ దేకదృష్టిఁ గాంచుచుండిన కుమారి కరుణాదేవిని బరికించెను.

తాను వెదకుచుండిన మృగము దృష్టిగతంబగునంతనే మృగయుఁ డెవ్విధంబున దానిపయి గదియునో యటులనే కుమార విజయేంద్రసింహుఁడు కరుణాదేవి వైపునకును గుమారి కరుణాదేవి కుమార విజయేంద్రసింహుని దెసకును బరుగులిడిరి. కాని, వారొకరితో నొకరు కలిసికొనుటకు పూర్వమే మూర్ఛాగతులయి భూమిపయి నొరిగిరి.

అభయసింహ సౌదామినులకుఁ బరస్పరమున జూపు లనిమీలనములయ్యెను. కుమారి కరుణాదేవి విజయేంద్రసింహుల యట్టి పరిస్థితిఁ గాంచి పాపమా సరోజిని పరుగులిడుచుఁ బోయి పన్నీరుబుడ్డియు వీవనయుఁ గొని తత్క్షణము మగిడివచ్చెను.

పిదప సరోజిని వారిరువురిపయి హిమాంబువులను జిలుకరించి వీవనతో విసరఁ దొడంగెను.

కొంతసేపటి కభయసింహ సౌదామినుల దృష్టి చెదరెను. కుమారి కరుణాదేవి విజయేంద్రులు మూర్ఛాగతులయి పడియుంటఁ గాంచి తొట్రుపడుచు వారికిఁ దెలివి గలిగింపఁ బ్రయత్నింపసాగిరి.

ఎట్టకేలకు గుమారి కరుణాదేవి విజయేంద్రసింహులిరువురకు చైతన్యము గలిగెను. వారిరువురు బరస్పరముఖావలోకనమున మ్రానువడి యుండిరి. ఎవరినోట నేపలుకును వెడలుటలేదు. "ఏమి ప్రశ్నింపవలయును? ఏమని మొఱలిడవలయును? ఎచటనుండి మొదలుకొనవలయు" నని వారిరువురి మానసంబుల నియ్యదియే చింతయై యుండెను. కుక్షులలోనుండి మాటలు వెడలివచ్చుచుండెను గాని, యవి కంఠములవఱకువచ్చి నిలిచిపోవుచుండెను. వాని భారముచే కంఠములు డగ్గుత్తికపడినవయ్యెను. ఇరువురి నేత్రంబు లశ్రుపూరితములయ్యెను. కన్నీరు జొటజొట రాలదొడంగెను.

గడియల కొలఁది కాలము వారికట్టి స్థితియే యొదవియుండెను. తామెచట నుండినదియు, తామేమి సేయుచుండినదియు, తమ సమీపమున నెవరుండినదియు, నించుకేనియు వారిలో నొకరికిని దెలియదు.

కుమారి కరుణాదేవి విజయేంద్రసింహుల మనోగతభావములను నభయసింహ సౌదామినులు కొంత నెఱింగియుండవచ్చును గాని, యితరులేమెఱుంగుదురు? వారి ప్రణయమెంత ప్రగాఢమైనదో దాని యంచన నెవరు నిర్ణయించగలరు? వారి ప్రేమ హద్దుమీఱియుంట పాపమా సరోజిని యెఱింగి మిక్కిలి తత్తరపాటు నొందసాగెను. ఇట్టి పరస్పరవిలోకనము వారి మానసంబుల నెట్టి వికారమేనియుఁ జనింపఁజేయదుకదా యని యామె భీతిల్లెను. మఱియు వారికపుడు గలిగియుండిన స్థితి మాఱి మంచివిధంబున నొండొరులు సంభాషించుకొనునటుల నొనరింపవలయునని తలంచి, కుమారి కరుణాదేవి కరము దాబట్టుకొని ఆమెతోనిటులఁ బలికెను.

నెచ్చెలీ! నేఁడిదియేమి? ఏదినమున గుమారవిజయేంద్రసింహుఁడు నన్ను గలిసికొనునో యానాఁడు వానితో, "వనకన్యక యెవరు? ఆమెతో నీవేమి ప్రతిన జేసియుంటివి? ఇపుడామెను వివాహమాడుదు

వా?" యని ప్రశ్నింతునని పలుమరు బలుకుచుండెడిదానవు గదా? ఇపుడా విషయము లన్నింటిని మఱచియుంటివా?" యనెను.

ఎపుడే ప్రేమీయుగళమున కట్టి పరిస్థితి గలిగియుండెనో యపుడితరు లెవ్వరేనియు నితర విషయములను వారి మానసంబులకుఁ దోపంజేసి వారి ధ్యానములకు భంగపఱుచుదనుక హృదయసంతాపములటులనే స్థిరపడియుండును. ఇక్కారణంబుననేకదా, యోగనిష్ఠాపరులకేకాంతస్థానమును నియమించియుండిరి. కరుణాదేవి విజయేంద్రసింహుల ప్రణయము సామాన్యమయినది కాదు. వారిరువురు నొక్కరూపంబున నుండిరి. మనస్సులలోపలనే తమ వియోగజనితపరితాపముల నొండొరులు తెలుపుకొనుచు గ్రహించుకొనుచుండిరి. కాని వారి సమీపమున నిలిచియున్న వారికేమియుఁ దెలియుటలేదు. వారిరువురి ముఖద్వారములు బంధింపఁబడి యున్నవి. సరోజిని పలుకులు వారిరువురను జలింపఁజేసెను. పరస్పరమున గూడియుండిన వారి చూపులు చెదరి క్రిందివైపునకుఁ బోయెను. మఱియు శిరములను వంచి వారిరువురు నెద్దియో కొంచెము కొంచెముగ సంభాషించుకొనఁ దొడంగిరి. వారలేమి సంభాషించుచుండిరో యేమి యోచించుచుండిరో వారలే యెఱుంగవలయు గాని యితరులెఱుంగుటశక్యము. ఉన్మత్తులభంగి తుది మొదలులేని వారి యవ్యక్తంబులగు పలుకుల నెవరు తెలిసికొనఁజాలుదురు? గ్రహింపఁగలరు? కుమారి కరుణాదేవితో విజయేంద్రసింహుడు తన మొర విన్నవించుకొనలేకుండెను. ఆమె పొందియుండిన కష్టపరంపరలను బ్రశ్నింపఁ జాలకుండెను. వారిరువురటుల గడియలకొలఁది కాలమొకతావున గూర్చుండి యుండినను నోఱుతెఱచి పలుక నొకరును సాహసింపకుండిరి. అప్పటికి దాదాపు రెండు గంటల కాలము గడచియుండుటచే సిద్ధనాథయోగీంద్రుఁడు మరల వారిని వేఁటుపఱచెను.

ఒక పరిచారిక యచటికరుదెంచి, "రాకుమారా! మిమ్ములను

శీఘ్రముగ వెంటఁగొనిరావలయునని సిద్ధనాథయోగీంద్రులు తెలుపుచున్నారు. దయసేయుఁడు. ఆలసింపకుఁడు” అని విన్నవించెను.

సిద్ధనాథయోగీంద్రుని పలుకులను ద్రోసిపుచ్చుట కెవరికి సామర్థ్యము గలదు! ఆప్రేమీజను లిరువురి హృద్గత వచనంబులు వారివారి మానసములయందే నిలిచిపోయెను.

కుమారి కరుణాదేవి నట్టిస్థితియందే విడిచి కుమారవిజయేంద్రసింహుఁడు లేచినిలిచెను. మఱియు నతఁడు కరుణాదేవితో నెద్దియో పలుకఁగోరుచుండెను. అంతమఱియొక పరిచారిక యుచటికరుదెంచి వారిని తొందరచేయసాగెను. తుదకు గుమారవిజయేంద్రాభయసింహులాదివానుఖానానుదాటి వెలుపలికివచ్చి కాంచునంత సిద్ధనాథయోగీంద్రుఁడు కొంతదూరమున నిలిచియుంట వారికిఁ జూపట్టెను. అంతనా యోగీంద్రుఁడు వారిని తన సమీపమునకుఁబిలిచి, కుమారవిజయేంద్రసింహునితో:—

సిద్ధనాథ:—“దినమంతయు గుమారికరుణాదేవి చెంతగూర్చుండుటకునే తెలుపలేదు. ఇపుడు రెండుజాములు కావచ్చినది. తఖఖానా వెలుపల పృథ్వీశులు మీరాకకయి నిరీక్షించుచుందురు”

విజయే:—(సూర్యుని వైపునకుఁగాంచి) చిత్రము. ఇపుడుప్రొద్దు...”

సిద్ధనాథ:—“ప్రొద్దు యేమిటి?”

విజయే:— ఆలశ్యమే యయ్యెను. ఇపు డానతి యొసంగుదురేని మేము వెడలి నాజనకుని, ప్రతాపభానుమహారాజును, శీఘ్రముగ దీసికొని వచ్చెదము”

సిద్ధనాథ:— మంచిది. పోయిరండు. వారి నిచటికి గొనితెండు. కాని, కుమారిని గాంచదగినవారినే వెంటఁ గొనితెచ్చుట కానరపాలుర కెఱింగింపుఁడు”

విజయే:— "చిత్తము"

సిద్ధనాథ:—"పోయిరండు. ఆలసింపకుఁడు"

విజయే:— "అభివందన మొసరించుచుంటిని"

సిద్ధనాథ:—అదియేమియు నగత్వములేదు. ఎందుచేతనన, నేఁడే నీవు మగిడి రాగలవు.

అభయ:—"నమస్కరించుచుంటిని"

సిద్ధనాథ:—నీకాజన్మము నమస్కరించుట కవకాశము లభింపఁగలదు కాని, యీసమయమునఁ నీవొక విషయమున దృష్టినిడవలసియున్నది. అదేమన, నిచట కుమారి కరుణాదేవిని గలిసికొనిన విషయము మీయిరువురిలో నొకరును వెలుపలివారితోఁ జెప్పరాదు. మఱియు మీరు క్రిమ్మఱి వచ్చుటకు బ్రొద్దు చాలకుండిన నేఁటికి రావలదు.

అభయ:—చిత్తము. అటులనే యొనరింతుము.

సిద్ధనాథ:— మంచిది. పోయిరండు.

కుమారవిజయేంద్రాభయసింహులు సిద్ధనాథ యోగీంద్రునివలన వీడుకోలుఁబడసి మామూలుమార్గములగుండా తిరుగుచు గ్రిమ్మరుచు తఖఖానా వెలుపలకు వెడలిరి.

పగలు రెండు జాములకుఁ బైపడి యుండును. అప్పటివఱకు కుమారవిజయేంద్రాభయసింహులు స్నానసంధ్యాది కృత్యములను దీర్చుకొని యుండలేదు.

వారిరువురు శిబిరములను జేరి జగత్సింహ ప్రతాపభాను మహారాజులకు సిద్ధనాథ యోగీంద్రుని సందేశము నెఱిఁగించిరి. అంత నా భూపాలురు వారితో, "మిమ్ములను ముందుగ నాయోగీంద్రుఁడేల రమ్మనెనని" ప్రశ్నించిరి. దానికి బ్రత్యుత్తరముగ దమకు యోగ్యునితో చిన విషయములను దెలిపి కుమారవిజయేంద్రాభయసింహులు తమ

గుడారములలోని కేగిరి. పిదప స్నానపూజాది నిత్యకృత్యములను దీ ర్చుకొని భుజించిరి.

జగత్సింహ ప్రతాపభాను లేకాంతమున నధివసించి తమ వెంట తఖఖానాలోని కెవరెవరిని వెంటఁగొనిపోవచ్చునని యోచింపసాగిరి.

జగత్సిం:—కుమారికరుణాదేవి యెదుటికి రాదగినవారినే వెంటఁగొని రమ్మనికదా, సిద్ధనాథయోగీంద్రుని యాదేశము.

ప్రతా:—మనమిరువురము, కుమారవిజయేంద్రాభయసింహులు ముఖ్యముగ బోదగినవారమే కదా? ఇఁక మీరెవరిని వెంట గొనఁ బోదలంతురో వారిని దీసికొని నడువుఁడు.

జగత్సిం:— అధిక జనులను వెంటఁగొనిపోవుట కావశ్యకతేమియు గలుగదు. కాని మైమారులను మాత్రము తప్పక గొనిపోవలసియుండును. ఏమన, వారిచుండెట్టి మఱుఁగును పనికిరాదుకదా?

ప్రతాప:—మీ పలుకులు మిగుల సమంజసములు. ఐయారులు దక్క నితరులెవరును మన వెంటఁగొనిపోవుటకుఁ దగియుండరు.

వారికిట్టి సంభాషణములయందును విషయనిర్ధారణమందును దాదాపు పగలంతయుఁ గడిచెను. పిదప జగత్సింహభూపాలుఁడభయసింహుని తన సమీపమునకుఁ బిలువనంపి, "మనమిచటినుండి యాయోగీంద్రుని జేరుటకు మార్గమందెంత వ్యవధి పట్టు"నని ప్రశ్నించెను.

"ఇటునటు దృష్టి బోనీయక సరాసరిగ బోయిన నైదాఱు గడియలలో నచటికి జేరగలము. ఇపుడచటి కేగుటకు నాకు సమ్మతముగాదు. ఇపుడిక ప్రొద్దుచాలదు. మన మా తఖఖానాయందలి చిక్కుదారులఁబడి పోవుట మిగుల కష్టతరమగు"నని యభయసింహుఁడనెను.

కుమారి కరుణాదేవి నెపుడు కాంతునాయని, ప్రతాపభానుమ

హారాజు తహతహపడుచుండెను గాని, యతఁడీసమయమున నభయసింహుని పలుకుల నంగీకరించక తప్పినది కాదు. పిదప వారు మఱుసటి దిన ముదయముననే తఖఖానాలోని కేగుటకు నిశ్చయించుకొనిరి.

---

## పండ్రెండవ ప్రకరణము.

మఱుసటి దిన ముదయముననే పెందలకడ కుమార విజయేంద్రాభయ సింహులు జగత్సింహ ప్రతాపభానుమహారాజులను నైయారులను వెంటఁగొని తఖఖానా ద్వారము చెంతకుఁబోయి చేరిరి. అభయసింహుఁడు రెండువిధంబులగు బీగములను దెఱచెను. ఆబీగములను విప్పు మర్మములనుగాంచి పృథ్వీశు లిరువురు నాశ్చర్యచకితులయిరి. తఖఖానాలోనికిఁ బ్రవేశించిన పిదప వారలకు మిక్కిలి యాశ్చర్యకరంబగు స్థితి యొదవెను. అబ్బురముగూడిన చూపులతో నలువైపుల బరికించుచుఁ బ్రసంగింపఁ దొడంగిరి.

వారలను వెంట నిడుకొని ఆయా స్థానములయందలి వింతలను జూపించుచు, వాని మర్మములను వివరించి తెలుపుచు, కుమారవిజయేంద్రాభయసింహులు సిద్ధనాథయోగీంద్రుఁడు నివసించు యుద్యానవనములోనికిఁ బోయి చేరిరి. వారలచటికిఁ జేరుటకుమున్నే సిద్ధనాథయోగీంద్రుఁడు యాగంతులకు స్వాగతంబొసంగి వెంటఁగొనిపోవుటకు ద్వారము నొద్దకువచ్చి వేచియుండెను.

అభయసింహుఁడు తన వ్రేలితో వానివైపునకుఁ జూపుచు, "అటుచూడుఁడు. సిద్ధనాథయోగీంద్రుఁడు ద్వారముకడ నిలిచియున్నా"ఁడని ప్రతాపభాను జగత్సింహభూపాలురతో ననెను.

పృథ్వీశు లిరువురు త్వరితముగ నాయోగీంద్రుని దగ్గరించి వా

నికి ప్రణామిల్లుటకు దలంచుచుండిరి. కాని, యతఁడు వారలఁ గలయఁగని, "జాగ్రత్త! నాకెవరును నమస్కరింపరాదు. అటు కానిచో, మీకు నాతో సంఘటనము గలుగఁజాలదు. పిదపఁ బశ్చాత్తాపము నొందగల"రని పెద్ద యెలుంగుతోఁ గేకలిడెను.

అభివందన మాచరింపఁదలంచుచునే వారలు నిలిచిపోయిరి. కాని, యెవరును సాహసింపఁజాలరైరి. నరనాథు లిరువురా యోగీంద్రుని పలుకుల కచ్చెరువందుచు నతఁడటులేల పలికెనని తత్తరపాటు నొందసాగిరి. ఆయోగీంద్రుని సమీపమునకుఁ జేరినపిదపఁ జేతఁ జేయి కలుపుటకుఁ గోరిరి. కాని యతఁడందుల కియ్యకొనక, "పృథ్వీశులారా! మీతో జేతఁజేయిఁగలుపుట కంతటియోగ్యుఁడనుగాను. మీయోగ్యత నాకంటె నెన్నిమడుంగులో యధిక"మనెను.

జగత్సిం:— యోగిపుంగవులకంటె నెవరియోగ్యతయు మిన్నగాఁజాలదు.

సిద్ధనా:— అది నిక్కవము. కాని నేనట్టియోగినైనదియు మీరెఱుంగరు.

జగత్సిం:— యోగీంద్రు లెట్టివారయినను వందనీయులేకదా!

సిద్ధనా:— నేనొక యోగినయి యుండినగదా!

జగత్సిం:— అగుచో మీరెవరు?

సిద్ధనా:— నే నెవరినికాను.

ప్రతాప:— మీపలుకులు మా కేమియు బోధపడుటలేదు. ప్రతివచనమందును సంభ్రమాశ్చర్యాశంకలు పెంపొందుచునే యున్నవి.

సిద్ధనా:— (నవ్వుచు) "పృథ్వీశులారా! దయసేయుఁడు. మనమీతోఁటలోనికి బోవుద"మని పలికి వారినందఱను వెంటఁగొని ముందునకు సాగిపోయెను.

పాఠకమహాశయులారా! మాటిమాటికి నీయుద్యానవనమును వర్ణించుట గాని ప్రతిపుష్పగుల్మపత్రంబుల స్థితిని వ్రాయుటగాని

మాకు సమ్మతముగాదు. కారణంబేమన, నీనవలను ప్రారంభము నుండియు సంక్షేపముగ వ్రాయుచు వచ్చితిమి. ఇంతియగాక, యీతఖఖానాయందలి శృంగారవనముయొక్క విస్తీర్ణము మున్నగువానిని దెలుపుటకయి కొన్ని పుటలను వ్యర్థపఱచుటయు మాకంగీకారముగాదు. తఖఖానాయందలి యీయుపవనము చిన్నదైయుండినను, యలంకారము కడురమణీయమనియు, ఫలపుష్పజాతులును గుల్మలతాదులునుగాక, పర్వతవృక్షంబులును సొగసులీను పత్రంబులఁ జెన్నొందుచుండిన మొక్కజాతుల శోభయు గొంచెము గొప్పయాధిక్యతను జెందియుండెనని మాత్రము తెలుపుటకు సాహసించుచున్నాము.

యోగీంద్రుఁడు వారలందఱ నాయుపవనమున ద్రిప్పిత్రిప్పి కుమారవిజయేంద్రసింహుఁడు ప్రతిమదర్బారును గాంచియుండిన దివానుఖానాలోనికిఁ గొనిపోయెను. ఇటులననేల? ఏదివానుఖానాయందు విజయేంద్రసింహుఁడు కుమారికరుణాదేవితోఁ గలిసికొనెనో యామందిరము లోనికిఁగొని పోయెనని యేల వచియింపరాదు?

నేఁడా మందిర మనేక విధంబులగు వింత సామగ్రిలతో నలంకరింపఁ బడియుండెను. ఇట్టి శృంగారవైభవములను మున్నెన్నఁడును గుమారవిజయేంద్రసింహుఁడు గాంచి యెఱుంగఁడు. ఆమందిరమునకు మధ్య దమ దేదీప్యమానంబులచేఁ బ్రకాశించుచున్న యమూల్యరత్నసింహాసనములపయి నయ్యోగీంద్రుఁడు, జగత్సింహప్రతాపభానుమహారాజులను గూర్చుండఁ జేసెను. వారి కిరుపార్శ్వంబుల విజయేంద్రాభయసింహులొక తట్టునను నైయారులందఱు నొకవైపునను గూర్చుండిరి. వారికి యెట్టయెదుట బఱచియుండిన మృగచర్మముపయి సిద్ధనాథయోగీంద్రుఁడు కూర్చుండి వారితో నిటుల సంభాషింపఁ దొడంగెను.

**సిద్ధనా:**—(జగత్సింహప్రతాపభానుల వంకఁజూచి) నరపతులారా! మీకు గుశలమేకదా?

జత్ర: — మహాత్మా! తమ కృపావిశేషంబున మేమెల్లరము మిక్కిలి యానందముతో నుంటిమి. నేఁడు మిమ్ములను దర్శించి కడంగడు ధన్యులమైతిమి.

సిద్ధనాథ:—పృథ్వీశులారా! మిమ్మిచటికి రావించి మీకు శ్రమఁగూర్చినందులకు నన్ను మన్నింప వేఁడుచుంటిని.

ప్రతాప:—మేమిచటి కరుదేరుట వలననే మాకష్టములన్నియుఁ దొలఁగి పోవుచున్నవి. తమ కృపాకలితేక్షణంబులు మాపయిఁ బ్రసరింపకుండిన గుమారి యెడయికచే మేమెంతకాలమిట్టి దుఃఖపరంపరల గుందవలసియుండునో మేము నిశ్చయింపఁ జాలము.

సిద్ధనా:—(నవ్వుచు) మీరలిఁక గుమారికరుణాదేవికయి పరితపింపఁబనిలేదు.

ప్రతాప:—తమ కృపాతిశయంబున నేఁడు కుమారిని గాంచగలమనుపూర్ణవిశ్వాసము గలిగియుంటిమి.

సిద్ధనా:—నేఁడే కారణము చేతనైన గుమారిని గాంచజాలకుండినను రేపటి దిన మామెను దప్పక గాంచఁగలరు. మీర లీసమయంబున స్నానపూజాదికృత్యంబుల నిర్వర్తించుకొని కొంత యారగింపుఁడు. పిదపఁ బ్రసంగింపనగు.

ఇటులఁ బలికి యోగీంద్రుఁడొక పరిచారికఁ జీరి, "ఓసీ! మన యతిథులు స్నానమాచరించుట కగత్యంబగు సామానులన్నింటిని పుష్కరిణిగల తోఁటయందా యుత్తపఱచియుంచు". మని యాజ్ఞాపించెను

పిదప యోగీంద్రుఁ డెల్లరను వెంటఁగొని కొలనుండిన తోఁటలోనికేగెను. వార లామడుగున జలకంబులాడి విందులారగించిన పిదప గుమారవిర యేంద్రసింహుఁడు స్కంధావారమునుండి యదృశ్యుఁడయి తొలుతనే మందిరమున దనకన్నులను విచ్చెనో యాగదిలోనికిఁ బోయి

యందఱును గూర్చుండిరి. మున్నా గదియందుఁ గుమారవిజయేంద్రసింహుఁ డెట్టి యలంకారములను దిలకించియుండెనో నేఁడు నటులనే య లంకరింపఁ బడియుండెనుగాని, కుమారికరుణాదేవిప్రతిమ మాత్రమిపుడ చట లేదు.

జగత్సిం:—(యోగీంద్రునితో) మహాత్మా! చిన్నచిన్న యుపవనంబుల తోడను నిట్టి యపూర్వాలంకార సమన్వితంబులగు మందిరములతోడను శోభిల్లుచుండిన యీసుందరపర్వతములు నారాజ్యసీమ యందుండినను నేఁటిదనుక వీనిని నయనోత్సవముగఁ గాంచు భాగ్యము మాకు లభింపదయ్యెను. దీనినుండి వెలుపలి కేగుటకు మఱియొండు మార్గమిందుగలదా?

సిద్ధనా:— పృథ్వీశా! దీని మార్గము లతి గూఢతమములగుటవలన నిచటి కెవరును రాఁజాలరు. కాని యీశైలస్మ రహస్యముల నెఱింగినవారు మాత్రమిందు విచ్చలవిడి సంచరింపఁ జాలుదురు. దీని లోనికిఁబోవు మార్గమొకటి మీరిపు డరుదెంచి యుండిన మార్గమే మఱియొక మార్గ మీతోఁటయందే కలదు. కాని, యామార్గము మీ రిపు డరుదెంచి యుండిన మార్గముకంటె నతి గూఢమయినది.

ప్రతాప:—తమ రెంతకాలమునుండి యీపర్వతముల నివసించుచుండిరి?

సిద్ధనా:— కొలఁది దినములకుఁ బూర్వమే నేనీ తఖ్ఖానాను జేరఁగలిగితిని. అదియయినను నాయిచ్ఛచొప్పునగాదు! నాప్రభుని గార్యవశమున నిచటికి వచ్చియుంటిని.

జగత్సిం:—(ఆశ్చర్యముతో) అదియేమి? మీ ప్రభు వెవరు?

సిద్ధనా:— అదియును దెలియఁ గలదు.

ప్రతాప:—(జగత్సింహభూపాలుని వైపునకు సన్నజేసి) ఈభూపాలుని సంభాషణము వలన, నీమనాశ్రిత పర్వతములు తమ రా

జ్యమందుండిన సమాచారమే యెఱుంగరనియు, నీస్థానము ను గాంచుటవలన దీనికెవ్వరో యొకయధికారి తప్పకనుండి యుండుననియుఁ దోఁచుచున్నది. మీరిచటి నివాసులుగా నుండిన నీపర్వతములకును నీసుందరోద్యానవనములకును యీమందిరరాజములకును నధికారులెవరు?

ప్రతాపభానుమహారాజు ప్రశ్నకింకను యోగీంద్రుఁ డేమియు బ్రత్యుత్తరం బొసంగియుండలేదు. అంతఁ గొంతదూరమునుండి తమ వైపున కేతెంచుచుండిన వనకన్యకపయి వారి చూడ్కులు దవిలికొనెను. ఆమె కిరుపార్శ్వంబుల నిరువురుసఖులును నామె వెనుక గొందఱు పరిచారికలును గలరు. సిద్ధనాథయోగీంద్రుఁడా వనకన్యక వైపునకుఁ దన వ్రేలితోఁ జూపుచు, "ఆమెయే యీస్థానమునకు యజమానురాలు" అనెను.

సిద్ధనాథయోగీంద్రుని పలుకుల నాలించి పృథ్వీశు లిరువురును నై యాహులును నాశ్చర్యచకితులయి యామె వైపునకుఁ జూడఁదొడంగిరి. కుమారవిజయేంద్రాభయసింహులును గలవరపడుచు వనకన్యక దెసఁ బరికింపసాగిరి. సిద్ధనాథయోగీంద్రుని పలుకుల వలన నీస్థానమున కధిపతి యామె యేయని వినిన మాత్రముననే కుమారవిజయేంద్రాభయసింహులకు వెనుకటి సమాచారములన్నియు జ్ఞప్తికివచ్చెను. కుమారవిజయేంద్రసింహుఁడు శిరమునువంచి, కుమారికరుణాదేవి తప్పక నీమె చెఱయందుండును. పాపమామె తిలస్మమార్గమున నిచటి కరుదెంచి యీగివలన బంధింపఁబడి యుండవలెను. అందువలననే యీమె నా సాహాయ్యములేనిదే కుమారికరుణాదేవిని బడయఁజాలరని నొక్కి వ్రాసియున్నది. ఆనాఁడు సిద్ధనాథయోగీంద్రుఁడును నీమె కోఁనపుడు కరుణాదేవితో నీకు సంఘటనము గలుగగలదనియు వచియించియుండెను. తప్పక నీమెయే కరుణాదేవిని జెఱఁబెట్టియుండును. నేనీమెను నాహితు

రాలుగాఁ దలంచియుంట మిక్కిలి ప్రమాదము. ఈమె నిష్కారణముగ గరుణాదేవిని బంధించి యాపదలఁ జిక్కఁజేసెను. మమ్మధిక శ్రమల పాలుగావించెను. కావున, నీమె నాకు విరోధియే యగును.

ఇవ్విధంబునఁ దలంచుచుఁ గుమారవిజయేంద్రసింహుఁ డధిక క్రోధావేశుఁడయి శిరము పయికెత్తి వనకన్యక వైపునకుఁ గాంచెను.

కుమారవిజయేంద్రసింహుని హృదయమందిరమున గుమారికరుణాదేవియందలి ప్రేమ యెంతగాఢముగ నెలకొనియున్నను వనకన్యకయందలి మక్కువయుఁ దక్కువ యైనదికాదు. కాని, యింతమాత్రపు వ్యత్యాసము గలదు. ఏసమయంబున నతఁడు కరుణాదేవి యందలి ధ్యానమున నిమగ్నమానసుఁడయి యుండునో యపుడు వానికి వనకన్యక జ్ఞప్తికిరాకుండును. కాని, యామె స్వరూపమును గాంచినంతనే ప్రేమయను రజ్జువు వాని మెడయందు తగుల్కొనుచుండును. కుమారి కరుణాదేవిని నీమెయే బంధించియుండెనను తలంపు మనస్సునకుఁ దట్టినతోడనే వాని కనివార్యంబగు క్రోధముప్పతిల్లుచుండెను. ఎపుడు? అతఁ డెపుడు భూమినయిపునకు మెడను వాల్చి యోజనాపరంపరల నిమగ్నచిత్తుఁడగునో యపుడు. ఎపుడు శిరమును బైకెత్తి వనకన్యక దెసఁ బరికించునో యపుడు వాని క్రోధము పశమించుచుండెను. వాని తలంపే వేఱగుచుండెను. తొలుత నొకవిధంబున యోజించును. మరల నపుడే మఱియొక త్రోవఁ ద్రొక్కును.

ఓహో! ఈమె నాకు శత్రు వెటులయ్యెను? అకటా! యిట్టి తలంపు నాహృదయాంతరాళమున నేల జనించుచున్నది? ఈమెకు మించి నాహితమునుగోరు వారెవరు కలరు? ఈమెయే నాకు సాయపడకుండిన నాకా తిలస్మఖండనము గష్టతరము గాకుండునా? కుమారి కరుణాదేవిని గలిసికొను నాశ పూర్ణముగ నడుగంటకుండునా? నే శత్రువులచే జిక్కకుండునా? యని తలంచును.

కుమారికరుణాదేవి నీవనకన్యకయే చెఱపెట్టెనను తలంపు వానికొక్కని కేకలిగెనా ? కాదు కాదు. ఆయుద్యానవనములకును మందిరములకును పర్వతములకును వనకన్యకయే యధికారిణియని యెపుడు వారు వినిరో యపుడీమెయే కరుణాదేవిని జెఱఁబెట్టి యుండెనను తలంపు యెల్లరి మానసంబుల నొక్కమాఱుగ నుదయించెను. తుదకుఁ బ్రతాపభానుమహారాజు నిలువనోపక సిద్ధనాథయోగీంద్రుని దెసఁగాంచి:—

"నిస్సహాయయగు కరుణాదేవి యీతఖఖానాయందుఁ జిక్కుకొని తుద కీమెచే బంధింపఁ బడియుండును."

"కాదు కాదు. ఏసమయంబున గుమారికరుణాదేవి యీతఖఖానాయందుఁ జిక్కుకొనెనో యపుడీ స్థానమున కధికారు లెవరును లేరు. అటుపిమ్మటనే యీపర్వతమందిరోద్యానము లీమె యధికారములోనికి వచ్చినవి.

సిద్ధనాథయోగీంద్రుని యీవచనద్వయము వారిని మఱియు భ్రమయందుఁ జిక్కఁజేసెను. ఆతరుణంబున జగత్సింహప్రతాపభానులచట లేకుండిన గుమారవిజయేంద్రసింహుఁడు మొరలిడుచు నాగూఢతత్త్వ మెఱుంగుటకయ్యోగీంద్రుని పెక్కుభంగుల బతిమాలియుండును. ప్రార్థించియుండును. కాని, లజ్జ వాని ముఖద్వారమును బాధించివైచెను. గంభీరత వాని రెండు భుజములపయిఁ జేయియునిచి క్రిందికి యడచిపట్టెను.

జగత్సింహప్రతాపభానుమహారాజు లిఁక నిలువలేక పోయిరి. వారిరువురు సిద్ధనాథయోగీంద్రుని దెసఁగాంచి గద్గదస్వరంబులతో, నొక్కమాఱుగ "మహాత్మా! మీరు కరుణాంతరంగులరయి గూఢమయి నట్టియుఁ బెక్కుయర్థములు వెడలునట్టియు సంభాషణములను గట్టిపెట్టి మీసమీపమున నిలిచియున్న యీకాంతారత్న మెవ్వరైనదియు, నీపర్వతము లీమె కెవరొసంగియుండినదియు, గుమారికరుణాదేవి యెచ

టనుండినదియు సత్వరముగ వచియింపుఁడు" అనిరి.

అంత సిద్ధనాథయోగీంద్రుఁడు చిరునగవుతో, "వనకన్యక వైపున కుగాంచి సంజ్ఞాపూర్వకముగ నామెను తన సమీపమునకుఁ బిలిచెను. వనకన్యకయు శుక్లపీతవసనధారిణులగు సఖు లిరువురను దన యిరుప్రక్కల నిడుకొని యయ్యోగీంద్రుని సమీపించెను. సిద్ధనాథయోగీంద్రుఁ డామె ముఖమందంతటను నంటించియుంచిన ఝిల్లీ (ఒకవిధమగు పలుచని చర్మము) ని వెడలించి యామె చేయిఁ బట్టుకొని ప్రతాపభానుమహారాజు పాదములపయిఁ బడవైచెను. కైకొనుఁడు. ఈమెయే మీయనుఁగు కూతురు సద్గుణఖని కరుణాదేవి యని" పలికెను.

ముఖము పయినుండి ఝిల్లీని వెడలించినతోడనే కుమారికరుణాదేవి నందఱు గుర్తింపఁ గలిగిరి. ప్రతాపభానుమహారాజామెను దన పాదముల పయినుండి లేవనెత్తి యామె శిరమును జాలసేపటివఱకు దన హృదయముతోఁ జేర్చిపట్టెను. అపుడు వానికి గలిగియుండిన సంతసమునకు మేర లేకుండెను.

సిద్ధనాథయోగీంద్రుఁ డామె సఖు లిరువురి మొగములనుండియు ఝిల్లీని వెడలించెను. శుక్లవసనధారిణి సౌదామినియనియు పీతవసనధారిణి సరోజినియనియు నెల్లరకుఁ దెల్లమయ్యెను.

సంతోషాతిశయంబున నెల్లరి మోములు ప్రకాశించుచుండెను. నేఁడు గలిగిన యానంద మెవ్వ డెవరికిఁ గలిగియుండలేదు. ప్రతాపభానుమహారాజు సన్నచేఁ గుమారికరుణాదేవి జగత్సింహభూపాలుని పాదములపయి శిరమునిడెను. అతఁడును నామె నతిముదంబున లేవనెత్తి శిరము నాఘ్రాణించెను.

గంటల కొలఁది కాల మామోదప్రమోదంబుల నెల్లరకు విచిత్రగతి యొదవియుండెను. కుమారవిజయేంద్రసింహుని స్థితిని వర్ణించుటకు నాలేఖనియందు శక్తిచాలదు. సిద్ధనాథయోగీంద్రుఁడు తొలుత వానిని

కరుణాదేవితో గలియఁ జేయకుండిన, నీసమయమున లజ్జగాని పెద్దల యందలి యాదరభావముగాని, వానిని వంచించి యుండవు. తప్పక నతఁ డేదియో యొక యనుచితకార్యమును గావించియే యుండును.

సిద్ధనాథయోగీంద్రుఁడు ప్రతాపభాను మహారాజు దెసఁగాంచి, "భూపాలాగ్రణీ! కుమారి తన సఖులతో వనవిహారము సల్పుటకుగాని మఱియొక మందిరములోని కేగుటకు గాని తెలుపుఁడు. మఱియు మీర లీస్థానము యొక్కయుఁ గుమారి కరుణాదేవియొక్కయు విచిత్రవృత్తాంతములను నావలన నాలింపుఁడు" అనెను.

ప్రతాప:— చిరకాలమునకుఁ బిదప నేఁడు నాముద్దుకొమరిత స్వరూపమును గాంచ గల్గితిని. మరల నీమె యెట్టి యంగదములందైన జిక్కదుకదా? నేనిపుడీమె నెటుల నెడఁబాయగలను?

సిద్ధనా:— (నవ్వుచు) కాదుకాదు. ఇపుడామె కెట్టి యిక్కట్టులుం గలుగఁ జాలవు. ఆమె వియోగమును సంభవింపదు.

ప్రతాప:—ఏది యెటులుండినను నీమెను నాకన్నుల యెదుటినుండి తొలఁగింపకుఁడు. మఱియు దయాన్వితహృదయులరై యీామె వృత్తాంత మాద్యోపాంతముగ వివరించి తెల్పుఁడు.

సిద్ధనా:—మంచిది. మీాయిష్టము.

---

ప ద మూఁ డ వ ప్ర క ర ణ ము.

—♦—

జగత్సింహప్రతాపభాను మహారాజుల కోరికపయి సిద్ధనాథయోగీంద్రుఁడామనోహరస్థానముయొక్కయుఁ గుమారికరుణాదేవి యొక్కయు యద్భుతచారిత్ర మివ్విధంబున జెప్పఁ దొడంగెను.

సిద్ధనా:—పృథ్వీశులారా! ఈపర్వతమొక చిన్న తిలసన్నమునకు సం

బంధించినది. కుమారిగడ పరిసరారణ్యంబున నొక తిలస్మముగలదనియు నేనెఱుంగుదును. ఆ తిలస్మమెవ్వాని వలన ఖండింపఁ బడునో మఱియు నాతఁడే బాలామణిని వివాహమాడగలఁడో యామె కరణముగ నీతిలస్మము బంధింపఁబడి యుండెననియు, వివాహమహోత్సవము జరుగుటకు మున్నె యీసంపత్తికంతయు నామెయే యధికారిణి కాగలదనియు నేనెఱింగియుంటిని.

జగత్సిం:—తిలస్మమన నెయ్యది? దాని నెటుల నిర్మింతురు?

సిద్ధనా:—ఏభూపాలున కపారసంపత్తి గలిగియుండియు దాయాదు లెవరును గలిగియుండరో, యాతఁడతి ప్రావీణ్యులగు జ్యోతిషవిద్వాంసులను మంత్రతంత్రవేత్తలను రావించి, తన కుటుంబమందుగాని తన సోదరుల కుటుంబమందుగాని ప్రతాపశాలియగు పుత్రుఁడు జన్మించునా యని విచారించును. అపుడు వార లిన్నితరములకుఁ బిదప నిన్ని వత్సరములకు నొక ప్రతాపవంతుఁడగు పుత్రుఁడు జన్మించునని తెలిపి వాని జన్మపత్రికను వ్రాసి సిద్ధపఱుతురు. పిదప వాని నామమున నసంఖ్యాకమగు ధనమును ననర్ఘ్యవస్తుసముదాయమును నొక బొక్కసమునఁ జేర్చి దానిపయినిఁ దిలస్మమును బంధింతురు.

తిలస్మమును బంధించు యిప్పటి నియమమెట్టిదన, గొంచెము గొప్పధనమును బాతిపెట్టి దాని జాగ్రత్తకయి యొక మనుష్యుని బలి దాన మొసంగుదురు. వాఁడొక ప్రేతరూపమునగాని సర్పాకృతినిగాని యాధనమును సంరక్షించుచుండును. మఱియుఁ జెప్పఁబడిన వ్యక్తినిగాక తదితరుల నొక రువ్వయైనను గొనిపోనీయఁడు. కాని, పూర్వమిట్టి నియమము లేదు. ప్రాచీనకాలమందలి భూపాలురు తిలస్మమును బం

ధించు యగత్యముసంభవించిన బూర్వోక్తవిధంబున జ్యోతిషమంత్రతంత్రవేత్తలను, వైద్యరాజులను బిలువనంపి వారికథనానుసారముగ దిలస్మమును బంధించుటకయి భూమిని దవ్వింతురు. దాని యడుగు భాగమున ధనరాశుల నునిచి దానిపయి దిలస్మ సంబంధమగు కట్టడములను నిర్మింతురు. ఆతిలస్మ మెవని నామమున బంధింపఁబడు చున్నదో, వాని నక్షత్రగ్రహకూటములను విచారించి వారు తమతమ శాస్త్రసామర్థ్యంబులను బట్టి దానిని మఱుఁగుపఱ్చుటకుఁ దగు నేర్పాటులను గావింతురు. కుమారవిజయేంద్రసింహుఁ డొక తిలస్మమును ఖండించి యుండెనుగదా? వానివలన నచటి వృత్తాంతము లన్నింటిని యాలింపుఁడు. మఱియు నితఁడు వచియించు ప్రతి విషయము సూక్ష్మదృష్టి బాగుగఁ బరిశీలించి చూడుఁడు. మాంత్రికశిల్పవైద్యజ్యోతిషదర్శనశాస్త్రజ్ఞులెట్టి విచిత్రకార్యములను గావింప గలుగుదురో యవి మీకుఁ దెలియ గలవు.

ప్రతాప:— మంచిది. మాకిపుడా విషయమున గొంచెమో గొప్పయో బోధ గలిగినది. కొదువ తిలస్మసమాచారములు కుమారవిజయేంద్రసింహుని వలన వినుటవలనను, వానిని బరామర్శించుటవలనను దెలియగలవు. ఇపుడీ పర్వత వృత్తాంతములను నాపుత్రిక సమాచారములను విశదీకరింపుఁడు. మఱియు విక్రమసింహుఁ డీతఖఖానానుండి యెటుల బంధవిముక్తుఁడయ్యెనో మరల నెటుల బంధింపఁబడెనో దానినిగూడ సవిస్తరముగ నెఱింగింపుఁడు.

సిద్ధనా:—వినుఁడు. నే నంతయుఁ దేటపడ నెఱింగించెదను. ఎపుడు కుమారికరుణాదేవి, కుమారిగడ రాజ్యమందలి తిలస్మము నందుఁ జిక్కుకొని యీతఖఖానాలోనికి వచ్చిచేరెనో యపుడీ నిస్సహాయ రెండుదినముల దనుక నధిక గష్టముల జి

క్కియుండెను. మూఁడవనాఁడా సమాచారము నెఱింగి నే
నిచటికి వచ్చి చేరితిని. మఱియుఁ గుమారి నాసంకటముల
నుండి తప్పించితిని. నేనిపుడు మీకా స్థానమును గనుపఱ
చెదను.

జగత్సిం:—తిలసమ్మఖండనమున కధిక బలపరాక్రమములు వాంఛనీయ
ములనికదా ప్రతీతి.

సిద్ధనా:— నిక్కవము. కాని, యీ తిలసమ్మమును ఖండించుటయందు
రాకుమారి కెట్టిపరిశ్రమయుఁ గలుగలేదు. కారణంబేమన,
కుమారవిజయేంద్రసింహుఁడే తిలసమ్మమును ఖండించియుం
డెనో దానితో నీతిలసమ్మమున కధికసంబంధము గలదు.
కుమారిగడమందలి తిలసమ్మమంత గాని కొంత భాగము గాని
ఖండింపఁబడక యుండిన నీతిలసమ్మ మెప్పటికిని వీడిపోదు.

విజయేం:—(సిద్ధనాథయోగీంద్రునితో) మీరు రాకుమారి నెటులఁ జే
రఁగలిగితిరో దానిని వివరించితిరికాదు. మేమీ తఖ్ఖానా
లోని కరుదెంచి రాకుమారి యీకొండగుహాయందు వివశ
యయి చిక్కియుంటఁ గాంచి యామె నాయాపదనుండి
తొలగించుటకుఁ బెక్కువిధంబులఁ బ్రయత్నించి చూచితి
మి. కాని యవి యన్నియు వ్యర్థంబులయ్యెను. మా కే
యుపాయమును దోచదయ్యెను.

సిద్ధనా:— కేవలము విమర్శప్రకర్షము వలననే తిలసమ్మ సంబంధంబగు
విషయములు కరతలామలకములు గాఁజాలవు. ఆగుహా
యందు రాకుమారి చిక్కియుండెననియు, మీర లామెను
దానినుండి వెడలించి తెచ్చుటకు పెక్కుభంగుల యత్నిం
చియు, విఫలమనోరథులయిరనియు వింటిని. నేనపుడే యీ
స్థానమునుండి యామెను వెడలించి కొని తేజాలియున్నను

నిచటి ధనరాశులు నమూల్యవస్తుసమితియు రాకుమారిచే జిక్కవలయునని కోరియుండిన వాఁడనగుట నాకయ్యది స మ్మతము గాదయ్యెను.

విజయే:—మీరు యోగీంద్రులరు. అత్యద్భుత మహిమోపేతులు. యోగబలపటిమ మీరచటి కవలీల జేరఁగలరు. మేమేమి సేయఁ జాలుదుము?

సిద్ధనా:—నేనొక యోగినని తలంచుట కేవలము భ్రమాస్పదము. ఏ కార్యము మానవమాత్రు నివలనగాని మైయూరుని వలన గాని కాఁజాలదో దానిని నేనుకూడ జేయఁజాలను. నేనే మార్గమున గుమారిచెంతకుఁ జేరగలిగితినో నే నేయేక్రియ ల నాశ్రయించితినో వాని నాలింపుఁడు.

---

## పదునాల్గవ ప్రకరణము.

సిద్ధనాథయోగీంద్రుఁడు జగత్సింహప్రతాపభాను మహారాజుల తో నివ్విధంబున జెప్పఁ దొడంగెను. తక్కినవారందఱు నాలించుచుం డిరి. మొదట నేనీ తఖఖానా తలుపులను దెఱచి లోన బ్రవేశించితిని. మఱియుఁ బర్వతోపరిభాగ గృహయందు నిస్సహాయయగు కుమారికరు ణాదేవి వివశయయి పడియుంటఁ గాంచితిని. ఈతఖఖానాయందుఁ గొ న్ని యుపవనములును మందిరములును గలవనియు వాని లోనికిఁ బోవు మార్గ మీతఖఖానాయందుఁ బ్రవహించుచుండిన ప్రవాహమందు గల దనియు మా గురువుగారి వలన వినియుంటిని. మీర లీతఖఖానాలోని కరుదేరుసమయంబున నాప్రవాహమును దప్పకఁ జూచియుందురు. ఎం దుచేతనన, నీతఖఖానాయందలి ప్రకృతిశోభలన్నింటిలో నయ్యది ప్రమ

ధిక దర్శనీయము.

సిద్ధనాథయోగీంద్రుని యీపలుకుల నాలించి మెల్లరు "ఔనౌనని" తమతమ శిరముల నాడించిరి. అటుపిమ్మట సిద్ధనాథయోగీంద్రుఁడు మరల నిటులఁ జెప్పఁ దొడంగెను.

నేను కౌపీనమును బాగుగ బిగించి యాప్రవాహము లోనికిఁ దిగి దానియందిటునటు సంచరింపఁ దొడంగితిని. అంత నాకస్మికముగాఁ దూర్పువైపు జలమందొక ద్వారముండినటుల నాకుఁ బొడకట్టెను. నేనొక బుడుకవేసి దానిలోనికిఁ బోయితిని. దాదాపు పదిమూరల దూరమువఱకు జలము సమమట్టముగ నుండెను. అటుపిమ్మట గ్రమక్రమముగ జలము తగ్గుచు వచ్చెను. తుదకది మొలబంటి లోఁతుగలిగినదయ్యెను. అపుడది యొక సురంగముగ నాకుఁదోచెను. నేనందు దేలియాడుచు ముందునకు వెడలిపోయితిని.

ఒక యరగంటకాలమటు లేగినపిదపనే నీత్రోఁటయందలి పుష్కరిణి యందువచ్చి చేరితిని. మఱియు నేనీయుద్యానవనమందు సంచరించుచు నీ దివాణఖానానొద్దకు వచ్చి చేరితిని. (చేతితోఁ జూపుచు) ఇటు చూడుఁడు. మన కీకుడ్యమందుఁ జూపట్టుచున్న యలమారొక ద్వారముగాని మనము దలంచుచుండినటుల యలమారుగాదు. దానిపయి బలపూర్వకముగ నొక దెబ్బకొట్టుటవలన నది తెఱవఁబడెను. నే నాద్వారముగుండా లోన బ్రవేశించితిని. దానియందు గాఢాంధకారము వ్యాపించియుండెను. దాదాపు మూఁడువందల యడుగులు ముందున కేగిన పిదప నామార్గమున కడ్డుగ మఱియొక గోడకలదు. దానియందును నొక ద్వారము గలదు. దానిఁ గూడ నట్టి విధముననే తెఱచి కుమారికరుణాదేవి సౌదామినులుండిన తావునకుఁ బోయి చేరితిని. ఆచ్చోటనుండియే మఱియొక మార్గము కుమారిగడతిలసద్మము లోనికి బోయియుండెను. దానియందలి యధిక భాగము కుమారవిజయేంద్ర

సింహుఁడు ఖండించియుండెను.

కుమారికరుణాదేవి సౌదామినులు నన్ను గాంచి మిగుల తత్తరపాటు నొందసాగిరి. నేను దాని నెఱింగి వారితో, "బిడ్డలారా! మీరు భీతిల్లఁ బనిలేదు. మిమ్ములను వెడలించికొనిపోవుటకే నేనిటు వచ్చితి" నని పెక్కు ధైర్యవచనంబులను బలికి వారి భీతిని బారద్రోలితిని. నేను బోయియుండిన మార్గముననే కుమారికరుణాదేవి సౌదామినులను వెంటఁగొని మగుడివచ్చితిని.—ఈపాటి సమాచారము—యింతటిస్థితి—యీమార్గమును మాత్రమే నేనెఱింగియుంటిని. వీనికంటె నధికముగ నీతఖఖానాస్థితి నాకుఁ దెలియను.

కుమారికరుణాదేవి సౌదామినుల నాకొండగుహనుండి వెడలించుటగాని వారిని గృహమునకుఁ జేర్చుటకాని నాకొక గొప్పకార్యము గాదు. కాని, యీతిలస్మము కుమారివలన ఖండింపఁబడుననియు దీనియందలి యసంఖ్యాకమగు ధనమును నమూల్యాలంకారములును కుమారిచేఁ జిక్కుననియుఁ దలంచియుండినవాఁడనగుట నేనటులొనరింపఁ జాలనైతిని.

కుమారికరుణాదేవి నీబంధనావస్థనుండి విముక్తిపఱుచు నభిప్రాయము తోడనే కుమారవిజయేంద్రసింహుఁడు కుమారిగడ రాజ్యమందలి తిలస్మమును ఖండించుచుండెననియు, దానియందలి యసంఖ్యాకమగు ధనము నాశించి కాదనియు నాకే కాక యెల్లరకుఁ దెలిసియున్న విషయమే. నేను కుమారికరుణాదేవి నిచటనుండి వెడలించి మీసముఖమునకు జేర్చినచో, యీతిలస్మఖండనము నిలిచిపోవుననియు దానియందలి ధనమంతయు నచట వ్యర్థముగ బడియుండుననియుఁ దలంచితిని.

నేను మీశుభచింతకుఁడ నగుటఁ బట్టి యసంఖ్యాకమగు ధనమును నితర వస్తుసముదాయమును నచట నిరర్థకముగ బడియుండుట కె

టులిచ్చగింతును? మఱియు నాధనరాశులు కుమారవిజయేంద్రసింహున కుగాని కుమారికరుణాదేవికిగాని యలభ్యము లగును.

నామనోగతాభిప్రాయములను కుమారికరుణాదేవి సౌదామినులకు విశదీకరించి, మీరు నాపలుకులను మన్నింపనిచో మిమ్మిచటనే విడిచి మగిడి పోవుదుననియుఁ దెలిపితిని....ఎట్టకేలకు కుమారికరుణాదేవి నిరుపాయమై నామాటల కియ్యకొనెను. పిదప నాపలుకులను జవదాటకుండుట కామె వలన శపథమును జేయించుకొంటిని.

ఇందపరిమేయంబగు ధనరాసు లెచట గలవో యాబొక్కసముయొక్క తాళముచేతు లెచటగలవో నేనొకింతయు నెఱుంగను. కాని కుమారికరుణాదేవియే యీతిలిస్మమున కధికారిణియని నా సంపూర్ణ విశ్వాసము. ఇట్టి యోజనయందే నేను రెండుదినములువఱకు గలంత నొందుచుంటిని. ఈయుపవనమంతయుఁ జెడియుండెనుగాని, నాలుగైదు ఫలవృక్షములు మాత్రము మంచిస్థితియందు గలవు. మేము ఫలాహారము వలనమాక్షుద్బాధల నడంచుకొనుచుంటిమి.

మూఁడవనాఁడు పూర్ణిమ. నేనాకొలను తీరమున గూర్చుండి యేదియో యోజించుచుంటిని. కుమారికరుణానేవి సౌదామినులు శృంగారవనమున విహరించుచుండిరి. అంతనాకస్మికముగ సౌదామిని పరుగులిడుచు నాచెంత కేతెంచి, "మహాభాగా! త్వరితముగ విచ్చేయుఁడు. ఈ శృంగారవనమున నందొక యాశ్చర్యకరంబగు విషయము చూపట్టుచున్న" దనెను.

నేను వెంటనే లేచి నిలిచితిని. మఱియు సౌదామిని వెంట నేగితిని. ఆయుపవనమునకు దూర్పుదిశనున్న కుడ్యముసమీపమున గుమారికరుణాదేవి నిలిచి గాఢదృష్టి నెద్దానినో పరికించుచుంటనే కాంచితి. కుమారి నన్ను గాంచినంతనే, బావాజీ! ఇటు కాంచుఁడు ఈగోడ పునాదు నందొక రంధ్రమున్నది. దానినుండి వందలకొలఁది తెల్లని బొజ్జింక

పురుగులు వెడలుచున్నవి. ఇది యెట్టిసంగతి?" యనెను.

ఎచ్చోట తెల్లని బొజ్జింకలు, దృష్టిపడునో యచ్చోట ధననిక్షేపముగాని బొక్కసపు తాళపుచేతులుగాని తప్పక నుండునని మాగురువుగారివలన వినియుంటిని. అది జ్ఞప్తికివచ్చినంతనే నాకధిక సంతసము జనించినది. వెంటనే నామొలకట్టునుండి కైజారు వెడలించి దానిని గుమారి కొసంగి, "నీవీ స్థలమును ద్రవ్వుము" బోధించితిని. నాకథ నానుసారముగ గుమారి యచటి భూమిని త్రవ్వనారంభించెను. అటుల నొక మూర లోఁతు ద్రవ్విన వెనుక నొక కాచపాత్ర యందు జూపట్టెను. దాని ముఖము బాగుగ బంధింపఁబడి యుండెను. కుమారి చేతనే యాపాత్రి బ్రద్దలగునట్టులఁ గొట్టించితిని. దానియందొక విధంబగు ద్రవపదార్థము గలదు. అయ్యది వ్రక్కలుకాగానే దానియందలి ద్రవపదార్థమంతయు గాఱిపోయెను. దానియందు తాళపుచేగుత్తి యొకటి గలదు. వానిని గాంచి నేనధిక ప్రమోదభరితుఁడనైతిని.

మఱుసటి దినమున నాచేగుత్తి కుమారి కొసంగి "మీరీ మందిరము నందును నుపవనములందును సంచరించుచు నెచట తాళపురంధ్రములు చూపట్టునో దానిని యీతాళముచేతులతో దెఱచుటకు బ్రయత్నింపుఁడు. నేనును మీవెంట నుండుచుందునంటిని. ఇఁక నీవృత్తాంతమును సంక్షేపముగఁ జెప్పి పరిసమాప్తి పఱచెదను. ఆగుత్తియందు ముప్పది తాళముచేతులు కలవు. కొన్నిదినములు వెదకివెదకి తుదకా ముప్పదితాళములను దెఱచితిమి. ఇందు మూఁడు ద్వారములును నాలుగు శృంగారవనములును నిరువదిమూఁడు గదులును గలవు. ఆగదులన్నియు రాజోపయుక్తంబులగు పదార్థములతోడను నసంఖ్యాకమగు ధనరాసులతోడను నిండియుండెను.

ఎపుడీ తఖఖానామార్గముగాక మఱియొక మార్గమును గనిపెట్ట గలిగితిమో యపుడు నేను నాగృహమున కరిగితిని. మఱియుఁ గొం

దలు పరిచారికలను నగత్యంబగు పదార్థములను గొని మరల నిచ
టికి వచ్చి చేరితిని. ఈద్వారంబు లన్నింటిని దెఱచిన పిదప గుమారి
కరుణాదేవి దేహమందుఁ గొంతవిపర్యాసము జనించెను. వారలెన్ని
యో మాఱులీ తిలస్మమునుండి వెలుపలికేగి తిరిగి మరలి వచ్చుటకు
నాయాజ్ఞను వేఁడుచువచ్చిరి.

వారలధికముగ చలమూనుటచేతను గుమారి దేహమందు వి
పర్యయము గలిగియుండుటచేతను నెట్టకేలకు నేనువారిప్రార్థన నంగీకరించి
తిని. నానేర్పు కొలఁది వారి యాకృతులయందుఁ బరివర్తనమును గావిం
చి విహరించుటకు మూఁడు గుఱ్ఱములను గొనితెచ్చి వారి కొసంగితిని.
వానిపయి నధిరోహించి వారలెన్నియోమాఱులీ తిలస్మమును దాఁటి
వెలుపల గ్రుమ్మరివచ్చిరి. తమ్మితరులు గుర్తింపకుండునటుల మాఱుగు
పఱచుకొని సంచరించుట కాజ్ఞాపించియుంటిని. వారలును నామాట
జవదాటక నటులనే ప్రవర్తించియుండిరి. ఈమధ్యనే నేనీశృంగారవన
ములను బాగుచేయించితిని.

కుమారవిజయేంద్రసింహుఁడా తిలస్మమందలి సంపదనంతయు
స్వాధీనపఱచుకొనెను. మఱియు నిచట గుప్తపఱచియుంచిన సంపదయు
గుమారికరుణాదేవి కరగతమయ్యెను. (ప్రతాపభాను మహారాజు వై
పునకుఁ గాంచి) మహారాజా! నేటి దనుక మీతనూజాతను నాప్రియ
పుత్రికగను యజమానురాలిగను భావించి మన్నించియుంటిని. ఇపుడు
మీనిక్షేపమును మీస్వాధీన పఱచియుంటిని.

కుమారికరుణాదేవి విక్రమసింహుని రాణిపయి జాలినొంది కు
మారవిజయేంద్రసింహుని యెడలనెట్టి వైరభావమును బూనకుండునటు
లవారివలన బాస చేయించుకొని వారిరువురను విడిచిపుచ్చెను. అతఁడు
తన యనుచరులను గూడినంతనే కుటిలుఁడయి కృతఘ్నత; గుమారవి
జయేంద్రసింహుఁడు స్కంధావారమునుండి తిరోహితుఁడగుట నెఱింగి

వాని లక్ష్యము పయింబడెను. తుదకు నిరుపాయుఁడనయి వారిని వంచించి మరల నాయిరువురను నీతఖఖానాలోనికి గొనితెచ్చి విడిచితిని. ఇంకను మీరెద్దియేని ప్రశ్నింపఁదలంచియుండిన యడుగుఁడు. నేనద్దానిని వివరించి మీశంకానివృత్తి గావించెద" ననెను.

జగత్సి:—ప్రశ్నించుటకు బెక్కు విషయములు కలవు. వాని నన్నింటిని యిపుడు మాకొదవియుండిన సంతోషాతిశయంబువలన విస్మృతిఁ జెందియుంటిమి. ఇపుడేమియు బ్రశ్నింప నగత్యము లేదు. మఱియొక సమయంబున బ్రశ్నించి తెలియదగిన వానిని తెలిసికొనియెదము. మంచిది. మీరెవరు? మీనివాసస్థాన మెయ్యది? మీరిట కరుదెంచి కుమారికకరుణాదేవికి దోడ్పడుటకు గతంబేమి? ఈ విషయములను మాత్రము వ్యక్తీకరించి మాహృదయాందోళనమును శంకలను బారదోలుఁడు.

ప్రతాప:—ఔను. నాప్రశ్నయు నియ్యదియే. మీనిజస్థితి మాకు దెలియుదనుక మాదేహములఁదలి తత్తరపాటుపశమింపఁ జాలదు. మఱియు మీరెన్నియోమాఱులు, "నేనొకయోగినిగాని సాధుపునుగాని కానని" వక్కాణించియుంటిరి. మీస్వరూపమునుబట్టి మేము తలంచుచుండినటుల యోగిపుంగవులు కానిచో, మీరెవరు?

సిద్ధనా:—అద్దియుఁ బోధపడగలదు.

ప్రతాప:—(కరుణాదేవి దెసఁగాంచి) అమ్మా! ఈయోగిపుంగవుఁ డెవరో నీవెఱుంగవా?

కరుణా॥—(కరములను జోడించి) తండ్రీ! నేనెఱుంగుదును. కాని వీరు నాతో బాస చేయించుకొని యుండుటవల్ల నేనేమియు విశదీకరింపఁ జాలను.

సిద్ధనా:—మీరిటుల వేగిరింపనేల? ఇపుడే నానిజస్థితియు బోధపడఁగలదు. తొలుత నా వెంట విచ్చేసి యీతిలస్మమునందుఁ గుమారికి లభించిన సంపత్తినంతయు నవలోకింపుఁడు.

ఇవ్విధంబున బలుకుచు సిద్ధనాథయోగీంద్రుఁడచటినుండి లేచి నిలిచెను. మఱియు నెల్లరను వెంటఁగొని రెండవ తోఁట వైపునకు వెడలెను.

---

## పదునైదవ ప్రకరణము.

సిద్ధనాథయోగీంద్రుఁడటుల జగత్సింహప్రతాపభానుమహారాజు మున్నగు వారలను వెంటనిడుకొని రెండవ తోఁటయందుఁ బ్రవేశించెను. అందు సంచరించుచుఁ దోఁటలను మందిరములను నీతిలస్మములోఁ గుమారికరుణాదేవికి లభించియుండిన సంపదను నితరవస్తుసమితిని జూపింపఁ దొడంగెను.

ప్రతాపభానుమహారాజు సమస్తపదార్థములను గాంచినంతనే, "ఓహో! ఇంత గొప్ప సంపదను గూడబెట్టిన యామహానీయున కనేక ధన్యవాదములను గావించుచుంటిని. నారాజ్యమంతయు విక్రయించి యిట్టివిధంబగు యీరణోపయుక్త పదార్థములను గూడఁబెట్టఁ దలంచిన, నిందు నాల్గవభాగమయినను గాఁజాల" దనెను.

కుమారవిజయేంద్రసింహుఁడేతోఁటయందుఁ గుమారి ప్రతిమ దర్బారును గాంచియుండెనో, యాదివానుఖానా యందలి యంతర్భవనమందు తాము గాంచిన వానికంటె నధికముగ స్వర్ణాలంకారములును నవరత్ననిధులును ధనరాశులును వారికి దృష్టిపడెను.

రెండు మూఁడు భాగంబుల ప్రారంభమందీ పర్వతములు మా

దిరములు యుపవనములు వానిలోని కేగు మార్గములు మున్నగు విషయములను కొంచెము గొప్పవర్ణించియుంటిమి. సిద్ధనాథయోగీంద్రుడు వారి నెల్లరను నాయాస్థానములయందు ద్రిప్పి యాస్థానవిశేషములను శిల్పకళా నైపుణ్యములను జక్కగ బోధించెను. వారలన్ని కార్యములనుండి తీరికగనిన పిదప నందఱా దివానుఖానాయందుఁ గూర్చుండిరి. పిదపఁ బ్రతాపభానుమహారాజు సిద్ధనాథయోగీంద్రునితో, "మీరిత్తెఱంగున కృపాకలితాంతఃకరణులయి కుమారికరుణాదేవికిఁ దోడ్పడి యామె ప్రాణములను సంరక్షించిన యుపకారభర మామరణము మా శిరముపయి గలదు. ఇపుడు తగురీతి మీనిజవృత్తాంతముల నెఱింగించి మా సంశయ నివృత్తి గావింపుఁడు. ఇఁక తాళఁ జాలము" అనెను.

సిద్ధనాథయోగీంద్రుఁడు దరహాసవదనుఁడై, నేనిపుడే నానిజవృత్తాంతమును వెల్లడింతును. కొంచెము సేపు తాళుఁడని పలికి గట్టిగా నీలవైచెను. తోడనే కొందఱు పరిచారికలు పరుగులిడుచువచ్చి వానికెట్టెదుట నిలిచిరి. అంత నతఁడా పరిచారికలతో, "నేను స్నానమాడుటకు జలమును ధరించుటకు వస్త్రములను (వ్రేలితో నొక గదివైపునకుఁ జూపుచు) నాగదిలోనికిఁ దెచ్చియుంచుఁడు. నేఁడీ మృగచర్మమును నీదీర్ఘశ్మశ్రువులను విసర్జించెద" ననెను.

కొంతసేపటికి సిద్ధనాథయోగీంద్రుని యాజ్ఞానుసారము సర్వము నాయిత్తపఱచబడెను. అంతదనుక వారలు యిష్టాగోష్టి ప్రసంగించుచుండిరి. అటుపిమ్మట సిద్ధనాథయోగీంద్రుఁ డచటినుండి లేచి స్నానమాచరించుట కొకగది వైపునకు వెడలెను.

సుస్నాతుఁడై వస్త్రములను ధరించి సిద్ధనాథయోగీంద్రుఁడు వెలుపలకు వెడలివచ్చెను. ఇపుడు వానిని సిద్ధనాథయోగీంద్రుఁడని పిలుచుట సమంజసము కాదు. నేటి దనుక తన్ను యోగీం

ద్రుఁడని పిలిపించుకొనుటయే వానికి భారమయ్యెను. ఇపు డతనిని యభయసింహుని తండ్రియనిగాని యర్జునసింహుఁ డని గాని పిలుచుట సముచితము.

వానిని గోదువసమాచారములను బ్రశ్నించుటకును స్థితిగతుల నారయుటకును నావకాశ మెచట గలదు? జగత్సింహభూపాలుఁ డర్జునసింహుని గుర్తించినంతనే లేచినిలిచి వానిని గాఢాలింగనము జేసికొని, "నీవు నాసోదరునికంటె వేయిమడుంగులు మిన్నవు. నీప్రజ్ఞావిశేషముల నెంతవర్ణించినను దీరవు. విక్రమవిజయేంద్రసింహుల సంగ్రామసమయమున రెండువేల యాశ్వికులనుఁ బ్రోగుజేసి కొనిపోయి కుమారునకు సాయపడితివి. మఱియు దేవీగడగౌరీగడములు రెండింటిపయినను నీ యుపకారభారమును మోపితి" వనెను.

పిదపఁ బ్రతాపభానుమహారాజును సముగౌరవమొసంగి వానిని కౌగలించుకొనెను. అభయమోహనసింహులు మున్నగువారలును నధికభక్తి వానికి మ్రొక్కిరి. కుమారికరుణాదేవి ప్రాణసంరక్షకుఁడును, దేవీగడ గౌరీగడరాజ్యంబుల మానపాలకుఁడును, వాని యశోభివృద్ధి నభిలషించువాఁడును, నొకచిన్న తిలస్మమును గుమారికరుణాదేవి వలన జయింపఁ జేసినవాఁడును, నేఁటి దనుక పేరెన్నగనిన గొప్పగొప్ప మైయారులను దన యసమానశేముషీవిశేషంబున వంచించిన వాఁడును, గుమారవిజయేంద్రసింహునకుఁ జిత్రనగరంబున విచిత్రనాటకప్రదర్శనమును జూపి మోసగించిన వాఁడును, కొండగుహనుండి క్రిందికి దుమికి జీవములను బాయ నుంకించుచున్న తఱి గుమారవిజయేంద్రసింహుని నాయుద్యమమునుండి నిలిపి ప్రాణమానంబులను గ పాడిన వాఁడును, కుమారిగడరాజ్యదుర్గమందు విజయదుందుభిని మ్రోయించిన వాఁడును, నైయార గురుకులభూషణుడగు మంత్రి యర్జునసింహుఁడ యిప్పు డెల్లరకుఁ దెల్లమయ్యెను.

ఆసమయానందమునకుఁ బరిమితి యేమికలదు! త్రిభువనమందలి సమస్తసంపదలు దమ యెదుట కరములు జోడించి నిలిచియుండినను వారికట్టి యానందమలవడియుండదు. కుమార విజయేంద్రసింహునకు గరుణాదేవిని కలిసికొనుటవలన గలిగిన యానందాతిశయమును పాఠకమహాశయులు స్వయముగ యోజించి తెలిసికొనఁ జాలుదురు. ఇదియునుగాక సిద్ధనాథయోగీంద్రుని యుపకారభార మెవరి శిరముననను స్థిరపడియుండలేదు. ఏయుపకారభరము గలదో యది యర్జునసింహునిదే యగు. ఆయు సిద్ధనాథయోగీంద్రుఁడను యన్య వ్యక్తి లేకుండుట నెఱింగియు వారి యానందమునకుఁ బరిమితియే కలుగకుండెను.

ఇపుడు జగత్సింహప్రతాపభాను పృథ్వీశుల పరస్పర ప్రేమానురాగము లత్యున్నత శైలశృంగము నధిష్ఠించెను. కుమారికరుణాదేవిని గృహమునకు గొనిపోయిన పిదప వివాహలగ్న పత్రికను బనుపు యగత్యమేమి కలదు? ప్రతాపభానుమహారాజు వెంటనే కుమారికరుణాదేవి చేయిఁబట్టుకొని జగత్సింహభూపాలుని పాదములపయిఁ బడవైచెను. మఱియు నానందబాష్పప్రపూరితములగు నేత్రములనొత్తుకొనుచు, జగత్సింహ నరపాలునితో "రాజపుంగవా! మీరనుమతింతురేని నేనీ బిడ్డను నాగృహమునకుఁ గొనిపోయెదను. మఱియు జ్ఞాతిబంధుసామంత్రమిత్రవిప్రపండితపురోహితపరివరుల సమక్షమున నాతనూజాతను గుమారవిజయేంద్రసింహునకు దాసిగ నర్పింతు" ననెను.

జగత్సింహనరపాలుఁడు కుమారికరుణాదేవిని తన చరణములపయినుండి లేవనెత్తి యధికవాత్సల్యభావమెరయ ప్రతాపభానుమహారాజు కంఠమునకుఁ జేర్చి యాభూపాలునితో, "భూపాలాగ్రణీ! సాధ్యమగురీతి గుమారిని వెంటఁ గొని శీఘ్రముగ గొరిగడమునకుఁ దరలిపొండు. పాపమీమె జనని పుత్రికావియోగజనిత దురంత దుఃఖమున గృశించి శల్యావశిష్టమైయుండు" ననెను.

పిమ్మటనర్జునసింహుని దెసఁగాంచి మనమిపుడేమి కావింపవలయునని జగత్సింహానరపాలుఁడు ప్రశ్నించెను.

ఇపుడు మనమందఱము నీచటనుండి వెడలిపోవలయును. ఇందలి ధనరాశులు మున్నగువానిని మనవెంటఁ గొనిపోవు నగత్యమెద్దియుఁ గలుగదు. కారణంబేమన, యీధనరాశులును నితరవస్తుసముదాయమును గుమారికరుణాదేవి కరణముగనిందుఁ జేర్పఁబడియున్నవి కాని, యవి యన్యుల ప్రయోజనముకయి కావు. వాని తాళపుచేతులును గుమారి స్వాధీనమందే కలవు. వాని నిచటినుండి వెలుపలకు వెడలించి కొనిపోవుటగాని కుమారివెంట నీసంపదనంతయు బనిచి ప్రజలకు జూపించుటగాని యగత్యములేదు. ఇదియునుగాక నిచటి జలవాయువులు కుమారి కారోగ్యప్రదములయి యున్నవి. కుమారి మరల నరుదెంచి యిచటఁ గొన్నిదినములు నివసించుట శ్రేయోదాయకము. కావున మన మిచటినుండి కుమారికరుణాదేవి మాత్రమే వెంటఁగొని పోవలయును" అనెను.

అవక్రపరాక్రమోపేతుండును నైయారగురుకులభూషణుండునునగు యర్జునసింహుని పలుకుల కెల్లరు "ఔనౌ" యని యేకగ్రీవముగ దమ సమ్మతులను బ్రకటించిరి.

కుమారికరుణాదేవి యూడిగమునకయి కొనితేబడిన దాసీజనులొందఱిని నర్జునసింహుఁ డచటికి బిలిచి, "మీరు మీముఖములను శుభ్రపఱచుకొని నిజస్వరూపంబులతోఁ గుమారికరుణాదేవికయి వేఱుపఱచియుంచిన పాలకీ నిచటికి సత్వరముగ గొనితెండని" యాజ్ఞాపించెను.

తోడనే యాదాసీజనులు మఱియొక తోఁటలోనికి వెడలిపోయిరి. వారు దాదా పిరువదిమందిగలరు. మఱియు ననతికాలములోనే యొక బంగరుపల్లకి తమ భుజములపయి నిడుకొని యచటికి వచ్చి

చేరిరి.

అంత నభయసింహుఁడా దాసీజనులను గుర్తించి, "అయ్యారే! మాయింటి దాసీజనులనే, నేనునేఁటిదనుక గుర్తింపఁ జాలనైతిని. నాతల్లి యు నీకీలకము దెలుపదయ్యెగదా? యని తనలో దానను కొనెను.

---

పదునాఱవ ప్రకరణము.

ఏమార్గమున కుమారవిజయేంద్రాభయసింహులు మున్నగు వారలీ తావునకుఁ వచ్చుచు బోవుచుండిరో యాతఖఖానామార్గము గుఱ్ఱములమీఁద కాని యేనుగులమీఁదగాని పాలకీపయినగాని వెడలు ట కుపయుక్తమయినదికాదు. మఱియు నీతోఁటనుండి వెలుపలకుఁ బో వు మార్గమున వెడలిన తఖఖానాద్వారమును జేరుటకుఁ జుట్టు దిగికి పోవలసియుండును. అందువలన నభయసింహుఁడు కుమారికరుణాదేవిక యి యాతిలసన్నమందులభించియుండిన యమూల్యంబగుబంగరుపల్లకిని వేలుపఱచి తగురీతి మంచి ముత్తెపుసరసములతోదాని నలంకరించియుం చెను. ఇఁక భూపాలు రిరువురకును గుమారవిజయేంద్రసింహునకును వాహనము లెవ్వియని యతఁడు కొంతతడవు తలపోసెను.

ఔను. కుమారికరుణాదేవి మున్నగువారలు స్వారిచేయుటక యి మూఁడు గుఱ్ఱములీ తఖఖానాకు గొనితేబడి యుండెఁగదా? వాని పయి నారూఢులగుటకు వారి కెఱింగించెను. కాని, కుమారవిజయేంద్ర సింహుఁడు మాత్రము వారువముపయి నధిరోహించి యేగుటకు సమ్మ తించక బాదచారియై పోవుట కిచ్ఛగించెను.

ఆతోఁటకు దక్షిణదిశయందొక సింహద్వారము కలదు. వాని కిరు పార్శ్వంబుల గడురమణీయముగ నొప్పుచుండిన రెండు లోహపు

తివులు కలవు. ప్రెగ్గడ,యర్జునసింహుఁడు వామభాగముననున్న ప్రతిమను సమీపించి దానికంటిలో దనవ్రేలుపెట్టి నొక్కెను. తోడనే దాని యుదరము రెండు తలుపురెక్కలువలె విడిపోయెను. దానిమధ్య నొక యినుపచక్రముగలదు. దానినిబట్టి అర్జునసింహుఁడు గిరగిరద్రిప్పఁ దొడంగెను. ఆచక్రము తిరుగుచున్నకొలఁది నాద్వారము క్రమక్రమముగా లోనికి దిగిపోయి తుదకు భూమితో సమమట్టమయ్యెను. దానికి వెలుపలి భాగమందొక పచ్చికబయలు కడుమనోజ్ఞమయి నేత్రపర్వముగావించుచుండెను.

పిదప నర్జునసింహుఁడు మరల నాభూపాలుర చెంతకేగి "పృథ్వీశులారా! లెండు. మన మీతఖఖానామందిరములనుండి వెలుపలకు వెడలిపోవుద" మనెను.

సూర్యుఁడింకను నస్తమించలేదు. అట్టితరుణంబున జగత్సింహ ప్రతాపభాను భూపాలురు గుఱ్ఱములపయి నధిరోహించి కుమారికరుణాదేవి పల్లకికి ముందుగ నడచుచు నాద్వారమును దాఁటి వెలుపలకు వెడలిరి. భూపాలు రిరువురకు మధ్య రెండుగుఱ్ఱముల కలీయములను బట్టుకొని మంత్రి యర్జునసింహుఁడు వారితో సంభాషించుచుఁ బోవుచుండెను. వారి వెనుక నైయాంకులు తన్ను బరివేష్టించి కొలువ, దరహాసచంద్రికలు ముఖమున దొనుకాడుచుండ, గుమారవిజయేంద్రసింహుఁడతి ముదంబున తఖఖానాద్వారము వైపునకు బయలు దేరెను.

ఒకజాముకాలము గడియుసరికి తఖఖానాద్వారమునొద్ద విడిసియుండిన తమ శిబందిని వారు చేరగలిగిరి. ఆరేయియంతయు నచటఁ గడపి తెల్లవాఱిన తోడనే యచటినుండి పయనంబయిరి. మిక్కిలి వెల పొడవు దుస్తులను ధరించిన బోయిలు కుమారికరుణాదేవి పల్లకిని దమ భుజములపై నిడుకొని ప్రతాపభానుమహారాజు వెంట గొరీగడమునకుఁ దరలిపోయిరి.

నేటిదనుక కుమారికరుణాదేవికి దోడును నీడయునై మెలంగుచుండిన దాసీజనము లామెపల్లకిని శిబిరమువఱకు మోసికొని వచ్చియుండిరి. వారియందుగల ప్రేమకారణంబున వారి నచట విడిచిపోవుటకు కుమారి సమ్మతించకుండుటచే బ్రతాపభానుమహారాజా దాసీజనంబులనుగూడ కుమారి వెంట గౌరీగడమునకుఁ దీసికొని వెడలెను. జగత్సింహనరపాలుఁడు కుమారవిజయేంద్రసింహుఁడు మున్నగువారిని వెంటనిడుకొని దేవీగడమార్గమునుబట్టి చనెను. కుమారవిజయేంద్రసింహుఁడు పురమున బ్రవేశించిన తోడనే యంతిపురము లోనికేగి తన తల్లిఁ సందర్శించెను. పిదపఁ గులదేవతనుబూజించి వెలుపలకు వెడలివచ్చెను

ఇపుడెల్లరకు నధికసంతోషమున దినములు గడచిపోవుచుండెను. ఐదవనాఁడు ప్రతాపభానుమహారాజువలన బుత్తెంపఁబడిన తిలకమచటికిఁ జేరుకొనెను. మఱియు నధికోత్సుకత మంగళవాద్యములు చెలరేఁగ దానిని కుమారవిజయేంద్రసింహుని నుదుటఁ బెట్టిరి.

పాఠకమహాశయులారా! యిపుడు కుమారికరుణాదేవి విజయేంద్రసింహుల చారిత్రము పరిసమాప్తి నొందినటులఁ దలంపుఁడు. ఇఁకను మిగిలియుండినది కేవలము వారి వివాహమహోత్సవము. ఇంతదనుక గథాభాగము సంక్షేపముగ లిఖించుచువచ్చి యిపుడు వివాహసందర్భమున గొన్నిపుటలు కాగితములకు రంగు వేయుట మాకు సమ్మతముగాదు. దేవీగడమునుండి గౌరీగడమునకుఁ బోవు రాజమార్గమును బాగుగఁ దుడిపించి పన్నీటికలయంపిఁ జిలుకరించిరనియుఁ బ్రకాశమునకై మార్గమున కిరుపార్శ్వంబుల విద్యుద్దీపములు వరుసలుదీర్చి యుంచిరనియు మున్నగు విషయములను వర్ణించి వ్రాయుటకు మేము గోరము.

అట్టి ప్రేమాస్పదులగువారి వివాహమహోత్సవమెట్టి వైభవముతో జరుగఁ గలదో మీరు స్వయముగ నూహింపఁ జాలుదురు. అందుపయి నిరువురును రాజాధీశ్వరులు ఇరువురసంతతి రెండు

తిలస్మములపయి విజయమునొందిన సంతసమును నసంఖ్యాకమగు సంపద వారిచేఁ జిక్కిన యానందమును వారికధికోత్సాహమును గలిగింపకుండునా? వేయేల? శుభముహూర్తమందుఁ గుమారవిజయేంద్రసింహుఁ డధిక సన్నాహపూర్వకముగ గుమారికరుణాదేవిని వివాహమాడ గారీగడమునకు దరలిపోయెనని వ్రాయుట మాత్రము సముచితముగ దలంచుచుంటిమి.

వివాహమహోత్సవవర్ణనమందు సంక్షేపమునుగలిగించి మాభారమును దించుకొంటిమి. కాని తుదకొక పరిహాసప్రసంగమును మాత్రము వ్రాయకయే విరమించుట మాకు సమ్మతముకాదు.

గారీగడమునందు విడిదింటియందలి యలంకారము లన్నిటికంటె నద్భుతభావప్రకటనలతోఁగూడి యున్నవి. పెండ్లివారు చేరుటకు మున్నె యచట సభ గూడియుండెను. గాన విద్యాప్రావీణ్యులును సౌందర్యరాశులునగు వేశ్యకాంతలాసభయందుఁ దమ గానాభినయపటిమను వెల్లడించుచు సభాస్తారులను చిత్రప్రతిమలుభంగి స్తంభీభూతులను గావించుచుండిరి. పెండ్లివారావిడిదింటిని సమీపించిన తోడనే యచటనొక విచిత్రమును గాంచి ప్రజలెల్లరు నబ్బురపాటు నొందసాగిరి.

పెండ్లికుమారుని యూరేగింపునకు మున్ముందు విక్రమసింహభూపాలుఁడు బాగుగ నలంకరించియున్న నొక గుఱ్ఱముపయి నధిరోహించి, కటిప్రదేశమం దిరుప్రక్కల రెండు ఖడ్గములు వ్రేలాడుచుండ శిరమున విజయతురాయిని ధరించి చేతియందొక పతాకమును బూని విడిదింటి ద్వారము నొద్దకు వచ్చి చేరెను. అటుపిమ్మట పెండ్లివారును గ్రమక్రమముగా నచటికివచ్చి చేరుకొనిరి. వరుఁడు తురంగమునుండి దిగి విడిదింటిలోఁ బ్రవేశించెను.

తోడనే యామందిరమునకు వెలుపల పెద్ద యల్లకల్లోలము వారికి వినిపించెను. ఎల్లరా విడిదింటినుండి వెలుపలకు వెడలివచ్చి యచట

నిరువురు విక్రమసింహులు పోరుసల్పుచుండఁ గాంచిరి. ఇరువురి చేతులయందలి కరవారము లధిక తేజముగ నడచుచుండెను. "వారిరువురును "మాకు సహాయముగ నెవరును రావలదు. దూరమున నిలిచి చూచుచుండుఁ"డని పలుకుచుండిరి.

వారిరువురిలో నొక విక్రమసింహుఁడు శిరమున విజయతురాయిని ధరించి గుఱ్ఱముపయి నెక్కి చేతనొక పతాకమును ధరించి కుమారవిజయేంద్రసింహుని యూరేగింపునకు ముందుగ వచ్చుచుండిన యతఁడు. రెండవ విక్రమసింహుఁడు సామాన్యమగు దుస్తులను ధరించియుండిన యాతఁడు.

వారిరువురు దమతమ బలపరాక్రమములు మెఱయ నతితీవ్రముగఁ బోరుసల్పుచుండిరి. కొంతసేపటికి (చేతియందు పతాకమును ధరించివచ్చిన) మన విక్రమసింహమహారాజునకు మంచి సులువు చేఁ జిక్కుటచే దన కటిప్రదేశమునుండి వితంసమును విప్పి తన్నెదిరించుచుండిన రెండవ విక్రమసింహు నతినేర్పున బంధించివైచెను. మఱియు వాని నీడ్చుచు విడిదింటిలోనికిఁ గొనిపోయెను. వారి వెనుకఁ బెక్కు జనులు గుంపులు గుంపులుగ నాయింటిలోని కేగి వారిరువుర నాశ్చర్యముగూడిన చూపులతోఁ జూడఁ దొడంగిరి.

అటుల వానిని విడిదింటిలోనికి నీడ్చుకొనిపోయి మన విక్రమసింహమహారాజు సాధారణమగు దుస్తులను ధరించిన రెండవ విక్రమసింహమహారాజు నాసభామండపమందలి యొక స్తంభమున కంటఁగట్టెను. మఱియు నచట వెలుతురు జూపుచుండిన దివిటీవాని చేతినుండి కాగడాను లాగుకొని వానిచేత బలవంతముగఁ బట్టించి చేతులకు గట్లను బిగించి తాను కుమారవిజయేంద్రసింహుని సమీపమునకుఁ బోయి కూర్చుండెను. ఆస్థానముననే పన్నీరుతో నింపిన యొక బంగరు కలశము గలదు. దానియందుఁ జేరుమాలునుదడిపి మన విక్రమసింహమహారాజు తన ము

ఖమును బాగుగ దుడుచుకొనెను. దుస్తులవియే! విజయతురాయి యునదియే! రూపము మాత్ర మభయసింహుని రూపముగ మాఱిపోయెను.

ఆసభామండపమున గూర్చుండిన వారెల్లరు సంతోషమును బట్టలేక కడుపులుబ్బ నవ్వఁ దొడంగిరి. పాఠకమహాశయులారా! మీరీ పరిహాస ప్రసంగమును బాగుగ నెఱుంగఁ జాలుదురు. మీకింకను భ్రమ గలిగి యుండిన మేమా విషయములను లిఖించి మీసంశయ నివృత్తిఁ గావించెదము.

మన యభయసింహుఁడు తన నేర్పుచే విక్రమసింహమహారాజు రూపమును ధరించి విజయతురాయి (మోహనసింహుఁడు ప్రథమ యుద్ధకాలమున విక్రమసింహుని డేరా లోనికేగి తన నేర్పుచేఁ గొని తెచ్చినది) శిరమున బంధించి చేతఁ బతాకమును బూని కుమారవిజయేంద్రసింహుని యూరేగింపునకు మున్ముందుగ బయలుదేరెను. ఇఁట బూర్వపు కుమారిగడాధీశుఁడగు విక్రమసింహమహారాజు జగత్సింహభూపాలుని వలనఁ బ్రాణములను దక్కించుకొని తపమును నెపమున నరణ్యమునకు వెడలి యుండెఁగదా! అతఁడు కుమారవిజయేంద్రసింహుని వైవాహికవిభవములను గాంచు తలంపున నిచటికరుదెంచియుండెను. మునివృత్తి నవలంబించెదనను నెపమును బన్నెనుగాని నిజమును ఘూజింప దుర్బుద్ధియు వైరభావమును వానిని విడువలేదు.

విక్రమసింహమహారాజు వివాహ వేడుకలను జూడవచ్చెను గాని, కుమార విజయేంద్రసింహుని వివాహోత్సవమునకు మున్ముందు జేతఁ బతాకమును ధరించియున్న తన స్వరూపమును గాంచి యది యేమైయారుని దుర్వ్యాపారమో యనితలంచెను. వాని దేహమందలి క్షాత్ర రక్తము పొంగి పొరలెను. తోడనే యతఁడు తన కరవాలము నూడబెఱికి పోరునందు గదిసెను.

కాని, ఫలిత మేమి తేలెను? ఆసభయం దాతఁడు దివిటీవాఁడు

గావలసి వచ్చెను. కుమారికరుణాదేవి విజయేంద్రసింహుల వివాహము
తి వైభవముగ జరుపఁబడెను.

ప్రియపాఠకులారా! ఇపుడు కుమారికరుణాదేవి విజయేంద్రసిం
హుల కథపరిసమాప్తి నొందినది. ఈనవల యొక్క ప్రథమభాగ ద్వితీ
య పరిచ్ఛేదమందలి పదునొకండవ ప్రకరణమందుఁ గుమారికరుణాదేవి
విజయేంద్రసింహులకు జగదైకవీరులును నతి ప్రతాపవంతులునగు నిరు
వురు సుపుత్రులు జన్మింతురను యోగీంద్రనాథజ్యోతిష్కుని పలుకులను
మీరు విస్మృతిజెందియుండరు. మేమా జగదైకవీరుల విచిత్ర చారిత్ర
మిపుడుప్రారంభించి వ్రాయుచున్నాము.

---

## పదునేఁడవ ప్రకరణము.

దేవీగడాధీశుఁడగు జగత్సింహభూపాలుని యనంగు పుత్రుఁడు
కుమారవిజయేంద్రసింహునకు గౌరీగడాధీశుఁడగు ప్రతాపభానుమహా
రాజు ప్రియపుత్రిక కుమారికరుణాదేవి నొసంగి యతి విభవోపేతముగ
బరిణయము గావింపఁబడెను. వివాహమునాఁ డభయసింహుఁడు గావిం
చిన తుది పరిహాససందర్భమున విక్రమసింహమహారాజొక దివిటీవాఁడు
గావలసివచ్చెను. విక్రమసింహుని మానసంబింతదనుక నిర్మలముగా
లేదనియు వానిని బంధించియుంచుటయే శ్రేయోదాయకమనియుఁ గొం
దఱ యభిప్రాయము. కాని, జగత్సింహభూపాలుఁడా సమ్మతియం దే
కీభవించకఁ దక్కినవారితో, మన మిదివఱకే వానిని బంధనావిముక్తు
నిగ నొనరించియుంటిమి. ఈసమయంబున విక్రమాభయసింహుల మ
ధ్యఁ దొడరిన పోరాటము వానికి మన మెడలగల శత్రుత్వమును సూ
చించునదికాదు. విక్రమసింహుఁడు నొకక్షత్రియుఁడేకదా? అభయసిం

హుఁడు తన రూపమును ధరించి యనుచితరీతిఁ బ్రవర్తించుచుండగాంచి యాతఁ డెటుల సహింపనోపును? ఏది యెటులుండినను, విక్రమసింహుని మానసము నిష్కాపట్యమైనదనియు వచియించుటకు వలనుబడదు. వాని యంతరంగము విశుద్ధమై యున్న నిటులఁ బ్రచ్ఛన్నరూపంబునఁ జరింప నగత్యమేమికలదు? ఆతఁడింకను మనయెడల వైరభావము నూనియే యున్నాఁడు. కానిండు. ఇందుఁ జెఱుపేమికలదు? ఉభయులము నుత్తమక్షత్రియవంశ సంజాతులమేకదా? తమతమ బాహుబల పరాక్రమములను వెల్లడించుకొననగు" నని పలికి మరల వానిని విడుదల చేయించెను.

విక్రమసింహమహారాజటుల బంధనావిముక్తుఁడయి యెచటికేగి యుండెనో యెవరికిని దెలియదు. కుమారికరుణాదేవి విజయేంద్రసింహుల వివాహానంతరము కొన్ని దినములు గతించిన పిదప సౌదామినిని నభయసింహునకును సరోజినిని మోహనసింహునకును నొసంగి యుద్వాహములు గావింపఁబడెను. సరోజిని దూరమగు బాంధవ్యమున సౌదామినికి మఱఁదలయియుండెను.

తక్కుంగల మైయారులందఱు వివాహితులు. వారి పుత్రమిత్రకళత్రాదిబంధువులు కుమారిగడమునందే కలరు. తత్కారణంబున వారికి స్థానపరివర్తనావశ్యకత గలుగలేదు. తదుపరి కొన్ని దినంబులు గడించిన పిదప నధిక సన్నాహపూర్వకముగఁ గుమారవిజయేంద్రసింహుని కుమారిగడ సింహాసనాధిష్ఠునిగఁ జేసి పట్టాభిషేక మహోత్సవ మతి విభవోపేతముగ నెఱపిరి. విజయేంద్రసింహుఁడు "కుమార" యను నుపాధిని విడిచి, "మహారా" జను నామమునఁ బేర్కొనఁ బడుచుండెను. అభయసింహుఁడు వాని మంత్రిపదవియందు నియుక్తుఁడయ్యెను. ఐయారులందఱుఁ గుమారిగడమునందే నివసించుచుండిరి.

జగత్సింహభూపాలుఁడు తన ప్రియపుత్రుని విడిచి యుండఁజాల

మి నిరుపాయుఁడై దేవీగడరాజ్య శాసనభారము ప్రభాకరసింహునకు దక్కొలుపఁజేచి తానును కుమారిగడమునందే నివసించుచుండెను. తద్రాజ్యకార్య నిర్వాహణభారమంతయు విజయేంద్రసింహమహారాజునందే కలదు. కాని, యతఁడు రాజకీయక్లిష్ట సమస్యలు సంభవించునపుడెల్ల తన తండ్రితోఁబర్యాలోచించి శాసించుచుండెను. అభయసింహుని తండ్రి యర్జునసింహుఁడు సధిక సన్మానపురస్సరముగఁ గుమారిగడమునందే వసియించుచుండెను.

వివాహానంతరము రెండు వత్సరములు గతించిన పిదపఁ గరుణాదేవి కొక సుపుత్త్రి లాభ మొదవెను. ఆయేటనే సౌదామిని సరోజనులుగూడ నిరువుర తనయులఁ గనిరి. తదుపరి వర్షత్రయము గతించిన పిదపఁ గరుణాదేవి మఱియొక పుత్త్రుని బ్రసవించెను. జ్యేష్ఠపుత్త్రుని నామము మహేంద్రసింహుఁడు. కనిష్ఠపుత్త్రుని యభిధానము నరేశసింహుఁడు. సౌదామిని తనయుని పేరజితేంద్రసింహుఁడు. సరోజిని కుమారుని నామ మజితసింహుడు.

ఆబాలురు నల్వురకు మాటలాడునంతటి ప్రాయము వచ్చినతోడనే జగత్సింహభూపాలుఁడు ధనుర్విద్యాది సకల విద్యలను గఱపుటకుఁ దగు యేర్పాటులను గావించి, వారిని యర్జునసింహుని సంరక్షణమందు విడిచిపెట్టెను.

రజితేంద్రాజితసింహు లిరువురు సకలశాస్త్రములందేకాక నైయారితనమునందును మిగులఁ బ్రావీణ్యులయిరి. వారి మైయారితనంపు పటిమను వికలుఁడు మున్నగు మైయారులందఱు నిరంతరము బరీక్షించుచుండ వలయుననియు, నటులనే యాబాలమైయారులును తమ తండ్రులు సహిత మైయారులందఱను గనుఁబ్రాముచుండ వలయునని యుజగత్సింహభూపాలుని యాజ్ఞ.

క్రమముగ నాబాలమైయారుల నైపుణ్యము ముందు పండితజగ

న్నాఘుఁడు మున్నుగువారి మైయారితన మెందులకుఁ గొఱగాకయుం డెను.

రజితేంద్రాజితసింహులలో నెవరు మిగులఁ జాకచక్యముగల వారను విషయమిపుడు విమర్శించుట కగత్యము గలుగదు. అయ్యదిముందు సందర్భములయందుఁ దేటతెల్లము కాఁగలదు.

రజితేంద్రసింహునకు మహేంద్రసింహునితోడను నజితసింహునకు నరేశసింహునితోడను గాఢమైత్రి కుదిరి యుండెను.

క్రమముగ నాబాలురు నల్వురు యుక్తవయస్కులయిరి. మహేంద్రాజిత రజితేంద్రసింహులు పదునెనిమిదేండ్ల ప్రాయముగలవారుగను నరేశసింహుఁడు పదునైదేండ్ల వయస్సు గలవాఁడును నైరి. ఇంతకాలము దనుక గుమారిగడమునందు శాంతి సామ్రాజ్యము నెలకొని యుండెను. కాని, గతకష్టపరంపరలును విక్రమసింహుని పైశాచికకృత్యములును వారి మానసంబుల స్థిరరూపములను దాల్చియుండెను.

మహేంద్రసింహున కాఖేటనమునం దభిరుచి మెండు. తఱచుగా నతఁడు తన చెలిమికాండ్రతోఁగూడి మృగయావిహారముల కేగుచుండును. ఒకనాఁడు వనపాలకు రరుదెంచి, "రాకుమారులారా! నేఁడు వనముల శోభకడు పెంపొందియున్నది ఆకాంతారంబుల వన్యమృగంబులసంఖ్యాకముగవచ్చి నివసించుచున్నవి. మాసముల వెంబడి నచ్చోట నిలిచి విహారములు సల్పుచున్నను మృగముల కొదువ గలుగఁ జాలదని" విన్నవించుకొనిరి.

వనపాలకుల యవ్వచనంబుల నాలించి రాకుమారు లిరువురు నతిప్రమోదభరితులయి తత్క్షణమే తమ తండ్రి సమీపమున కేగి, "జనకా! వనవిహారములను సలుప మాకెంతేనియుఁ గుతూహలము జనించుచున్నది. మేమచట నొక వారము దినములు గడిపివచ్చెదము. అనుమతింపుఁ డని సవినయముగఁ బ్రార్థించిరి. అంత విజయేంద్రసింహ

మహారాజు వారితో, "పుత్రరత్నములారా! మీరన్ని దినములు దనుక వనములందు నివసించుచు వేటాడుటకు నే ననుమతి నొసంగఁ జాలను. మీ పితామహు లిందుల కియ్యకొందు రేని నాకెట్టి యభ్యంతరము గలుగ" దని నుడివెను.

మహేంద్రనరేశసింహు లిరువురా క్షణముననే తమ పితామహుఁడు జగత్సింహభూపాలుని యంతికమున కేగి తమ యభిమతంబును వెల్లడించిరి. జగత్సింహనరపాలుఁడు తన పౌత్రుల యభిలాషను దీర్చ దలంచి, యొక దండనాయకు నఁటకు రావించి, వానితో, "సేనానీ! మనబాలురు మృగయావిహారములుసల్ప కాంతారముల కేగుచున్నారు. నీవును నైదువందల పదాతులను వెంటఁగొని వారి సంరక్షణమం దప్రమత్తుఁడవై మెలంగుచుండుము. వారలచట నివసించుటకు పరివార సమేతముగ బటకుటీరములను వెంటఁగొని పొమ్మని" యాజ్ఞాపించెను.

పిదప నాబాలురు తమ పితామహుని వలన ననుజ్ఞబడసి యమందానందకందళిత హృదయారవిందులై తమ మిత్రులు రజితేంద్రజితసింహులను వెంటఁగొని పంచశతానీకము దమ్ము బరివేష్టించి కొలువ యాఖేటనాకుతూహలాయత్తచిత్తులగుచుఁ గాంతారముల వైపునకు బయనంబైరి.

కుమారిగడమునకు దక్షిణ దిశయందైదు క్రోశుల దవ్వున మనోహరకాంతారములు గలవు. నాఁటి సంధ్యాసమయమునకు వారలొక సాంద్రారణ్యమునఁ బ్రవేశించి యందలి రమ్యస్థానంబున దమ పటకుటీరములను నాటించిరి. అపుడిఁకను పొద్దుచాలమికి యందు విశ్రమించుటకు నిశ్చయించుకొనిరి.

రేపటి యుదయమున వేటాడ నేగెదము. కావున దగు కట్టుబాటులను గావింపుఁ డనియు, వనపాలకులు నేఁడే మృగముల జాడనరయ నేగవలయుననియు, దమ పరివారమున కాజ్ఞాపించి రాకుమారు లిరువు

రు దమ మిత్ర మైయారులతోనందు విశ్రమించిరి.

మఱునాఁ డుదయముననే వనపాలకు రరుదెంచి, "రాకుమారులారా! యీ యడవియందు పులులు విస్తారముగ గలవు. మేము పోవుసరి కంధకారము బాగుగ వ్యాపించియుండుటచే మేమా మృగములను గన్నులారఁ గాంచఁజాల మైతిమి. నేఁడును వేట నిలిపి యుంచుఁడు. మేమేగి వానిజాడ నరసి వచ్చెద" మని విన్నవించిరి.

మంచిది! మృగముల జాడనరయ నేగుడని పలికి రాకుమారులు వారిని వీడ్కొల్పిరి.

సాయంకాల సమయంబున మహేంద్ర నరేశ సింహు లిరువురు వారువములపయి నధిరోహించి రజితేంద్రాజితసింహులతో గుడారములను వీడి వాహ్యాళికై బయలు వెడలిరి.

ఆమిత్రులు నల్వురు పెక్కు విషయములను సంభాషించుకొనుచు నెలదవ్వేఁగి యుండిరి. అంత వారికి వామపార్శ్వంబున భీకరారవంబులు శ్రుతి గోచరంబులయ్యె. తోడనే వారలచట నిలిచి యాధ్వని వెడలి వచ్చినదెసకు దిరిగి వీక్షింపసాగిరి.

వారికి దాదాపు రెండువందలు గజముల దూరమున నొక సాధుపుంగవుఁ డొక వ్యాఘ్రముపయి నధిరోహించి పోవుచుండుట వారు కనుగొనిరి. వాని శిరోజములు జటాబద్ధములయి పృష్ఠభాగమున వ్రేలాడుచుండెను. అతఁడొక కరమునందుఁ ద్రిశూలమును మఱియొక చేతియందు శంఖమునుధరించియుండెను. అతఁ డధిష్టించియుండిన శార్దూలము మిగులఁ బెద్దది.

ఆ సాధుపుంగవునకు వెనుక తట్టున పదిబార లంతరమున మఱియొక వ్యాఘ్రము సామానులను మోసికొని వచ్చుచుండెను. అపుడు కనుచీఁకటిపడి యుండుటచే నాసాధుపుంగవుని రూపము స్పష్టరూపంబున గోచరించకుండినను వానిని గాంచినంతనే మహేంద్రసింహుఁడు ము

న్నగువారల కధికాశ్చర్యము జనించెను.

మహేంద్రి:- మిత్రులారా! ఇవ్విధంబున వ్యాఘ్రముపయి నధిరోహించి సంచరించుట మిగుల గఠినకార్యము.

నరేశ:—ఆతఁడెవరో మహాత్ముఁడుగ దోఁచుచున్నాఁడు.

రజితేంద్ర:- వాని వెనుక నేతెంచుచుండిన యావ్యాఘ్రమును గాంచుఁడు. అది సామానులను మోయుచు మేషశాబకమువలె శిరము వంచుకొని పోవుచున్నది!

అజిత:—అతఁడు వ్యాఘ్రములను బాగుగ వశపఱచుకొని యున్నాఁడు.

మహేంద్ర:-అమ్మహాత్ముని సందర్శించుటకు నామానసం బభిలషించుచున్నది.

నరేశ:— మంచిది. డగ్గఱి యాపులులను బాగుగ వీక్షింతము.

అజిత:— సమీపమునకుఁ బోవకయే యాతఁడు మహాత్ముఁడో లేక పాషండుఁడో తెలియఁ జాలముగదా?

రజితేంద్ర:—చీఁకటి దట్టముగ వ్యాపించుచున్నది. త్వరితముగ నడువుఁడు. ముందునుండి వాని నెదుర్కొని నిలుపుదము.

నరేశ:—అమ్మహాత్ముఁ డయ్యెది చెడుగాఁ దలంపఁడుగదా?

రజితేంద్ర:— మొదట నతఁడు సాధుపుంగవుఁ డనియే మేమువిశ్వసింపఁ జాలము. మామైయారిలినంపు పద్ధతియే యట్టిది.

నరేశ:—ఎవరు తమ శ్మశ్రువులను నిరంతరము ముండనము గావించుకొని యుందురో వారి పలుకు లిట్టి విధంబుగనే యుండును. నడువుఁడు.

మహేంద్రి:- మంచిది. నడువుఁడు.

వార లిటుల సంభాషించుకొనుచు ముందునుండి తిరిగివచ్చి యా సాధుపుంగవుని సమ్ముఖమున కేగిరి.

ఆసాధుపుంగవుఁడును మహేంద్రసింహుఁడు మున్నగువారు త

న దెస కరుదెంచుచుండుటను గాంచి వ్యాఘ్రమును నాపి యచట నిలచెను. మహేంద్రసింహుని ఘోటకమా పులిని గాంచి భీతావహచిత్తయయి కొంతదవ్వున నిలచిపోయెను గాని, యతఁడు దాని నదలించి మరల ముందునకుఁ గొనిపోయెను. సాధు మహాత్ముని సమీపించి రాకుమారులిరువురు తమతమ వాహనములనుండి క్రిందికి యవతరించిరి. రజితేంద్రాజితసింహు లాతురంగముల నొక వృక్షమునకు బంధించియుంచిరి. పిదప నానల్వురు బాదచారులై యమ్మహాత్ముని సమీపమున కేగుచుండిరి.

సాధు:— (వారలింకను గొంతదూరమున నుండగనే) మహేంద్రనరేశసింహులారా! విచ్చేయుఁడు. మీకు గుశలమే కదా?

మహేంద్రనరేశ:—(నమస్కరించి) మహాత్మా! తమ కృపావిశేషంబున మేమెల్లరము కుశలపూర్వకముగ నుంటిమి.

సాధు:— రజితేంద్రజితసింహులారా! మీకును శుభమే కదా?

రజితేంద్రజితసింహులు:-(కరములను జోడించి) తమ దర్శనాకారణంబున.

సాధు:— (మహేంద్రనరేశసింహులతో) రాకుమారులారా! నేను స్వయముగ మీ చెంతకు రాదలంచియుంటిని. ఏమన, మీరలు మృగయావిహారార్థ మీయరణ్యంబున విడిసియుండుట నాకుఁ దెల్లమయ్యెను. నేను కాశీక్షేత్రమున కేగుచు నిటువచ్చి చేరితిని. ఈకాంతారము మిగుల మనోజ్ఞముగఁ జూపట్టుచున్నది. నేనింక రెండు మూఁడు దినములు గడుపనెంచితిని. వినిర్మల స్థానమును జూచుకొని యచట నగ్నిహోత్రమును బ్రజ్వలింపఁ జేయుదును. నావెంట బరువులను మోయుటకును స్వారీచేయుటకు నుపయోగపడు మఱికొన్ని వ్యాఘ్రములు గలవు. మీరు వాని నేమఱు

పాటున పొడవడంచుదురేమో యని సంశయాకుల చిత్తుం

డనై యుంటిని. అటులం దొడరిన నధిక విపత్తులు వాటిల్ల

గలవు. పెక్కు వ్యాఘ్రములరుదెంచి మీలస్కరుపయిం బ

డి విధ్వంసము గావింపం గలవు. పలువురు మృతినొందగల

రు. మీరు భూరియశోవిశాలుండగు *జగత్సింహభూపాలుని

తనయులని నేను బాగుగ నెఱుంగుదును. కావుననే యా

మృగంబులవలన మీకెట్టి యనర్థకములు సంభవింపకుండ

మిమ్ములను హెచ్చరించుచున్నాను.

మహేంద్రః:— మహాత్మా! మీపాలితవ్యాఘ్రము లెవ్వియో మేము గు

ర్తింపం జాలముగదా? అటులయిన మేము వేటాడుటయే

మానుకొందుము.

సాధు:— కాదుకాదు. మీయిచ్చచొప్పున మృగయావిహారములను

గావింపనగును. కాని, మాపాలితవ్యాఘ్రములను మాత్రము

బరిమార్పకుండు. నేను వాని నిటకు రావింతును. మీరు బా

గుగ వీక్షించి గుర్తించుకొనుండని పలికి, యాసాధుపుంగవుం

డాకాంతారమంతయుం బ్రతిధ్వనించునటుల శంఖమును బూ

రించెను. తోడనే నలుదెసల భీకరారవంబులు పిక్కటిల్లెను.

అనతి కాలములో నైదు పులు లా సాధుపుంగవుని సమీ

పమునకు వచ్చి చేరెను.

బాహువీర్యబలపరాక్రమ నిర్జితులగు యాబాలురు నల్వురు ని

ర్భీతచేతస్కులై యచటనే నిలిచి యుండిరి. వారి స్థానంబుల నితరు లె

వ్వరైన యగుచో భయాతిరేకంబున దమ ప్రాణంబులను గోల్పోయి

యేయుందురు. మహేంద్రనరేశసింహుల ఘోటకము లాఘోరదర్శన

*ఆసాధుపుంగవుం డేమలుపాటున విజయేంద్రసింహుం దనుటకు మాఱుగ జగత్సింహ
భూపాలుండని వచియించియుండెను.

ములను గాంచినంతనే భీతావహచిత్తలై గంతులు వైచుచుఁ బారిపోవు టకుఁ బ్రయత్నించినవి. కాని, యవి మిక్కిలి దృఢములగు పగ్గములతో బంధింపఁబడి యుండుటచే నటు కాఁజాలదయ్యెను. మహేంద్రిన శేశసింహులు మున్నగు వారినిగాంచి యాఘాతుకమృగములు గోడిగ్రించుచు వారిపయి నుఱుకనుండెనో యను నటుల భయంకరరూపములను దాల్చినవయ్యెను. అంత నాసాధుపుంగవుని లాలింపులచే నవియన్నియు శాంతించి మేషశాబకములభంగి మెడలు వాల్చి నిలిచియుండెను.

సాధు:— రాకుమారులారా! మీర లీవ్యాఘ్రములను గుర్తించుకొనుఁడు. ఇంకను మఱినాల్గు వ్యాఘ్రములు గలవు. అవి, యెచటనో దవ్వున సంచరించుచుండుటచే నాశంఖారవము వాటికి వినిపింపదాయెనని తలంచెదను. తక్కిన చండకములనుగూడ రేపటి దినమున మీకు జూపింతును రేపటి దినము మాత్రము వేటాడుట మానవలయు.

మహేంద్ర:—చిత్తము. అటులనే జరుగగలదు. మరల మీదర్శనలాభము మాకెచట లభించ గలదు.

సాధు:— ఈకాంతారము మిగుల మనోజ్ఞముగ నున్నది. నేను కొన్ని దినంబు లిచట నివసింపఁ దలంచుచుంటినని చెప్పియుంటిని గదా! మీరు రేపటి దినమున నన్నీస్థానమందే కలిసికొనఁ గలరు.

ఇవ్విధంబునఁ బలుకుచు నాసాధుపుంగవుఁడా వ్యాఘ్రము పైనుండి క్రిందికి దిగెను. అచట గూడియుండిన శార్దూలములన్నియు నాసాధుపుంగవునకు నలువైపులఁ గుమ్మరుచు స్నేహవాత్సల్య పూర్వకంబుగ వాని దేహమును లేహనంబొనరింప సాగెను. మన మహేంద్రసింహుఁడు మున్నగు వారలచటఁ గొంతతడవు నిలిచి పిదప నాసాధుపుంగవుని వలన ననుజ్ఞాతులయి తమ గుడారములకు వెడలిరి.

మహేంద్రరజితేంద్రసింహు లేకాంతమున నధివసించి యిటుల సంభాషింపఁ దొడంగిరి.

రజితే:— మిత్రమా! నామానసంబున ననేక శంకలు పొడసూపుచు చున్నవి. మనము నరేశాజిత సింహులతో నొక సభదీర్చి కొన్ని విషయములను యోజించి నిశ్చయించు కొనవలసి యున్నది.

మహేంద్ర:—మంచిది. నీవు వెడలి వారిరువురను వెంటఁగొని తెమ్ము.

రజితేంద్రసింహుఁ డాక్షణముననే యచటినుండి వెడలి నరేశాజితసింహులను వెంటనిడుకొని యాస్థానమునకు వచ్చిచేరెను. ఆసమయంబున నచట నానల్వురుదక్క నితరులెవ్వరును లేరు. రజితేంద్రసింహుఁడు తన మానసమును వేధించుచున్న సంశయములను జెప్పి వారికి వినిపించెను. ఆవిషయము లన్నింటి నందఱు మిగుల శ్రద్ధతో నాలించుచుండిరి. పిదప దామొనరింపఁదగు కార్యములను స్థిరపఱచుకొని యాసభను ముగించిరి.

ఆసభ యెట్టిది? రజితేంద్రసింహునకు గలిగియుండిన సందేహము లెట్టివి? మఱియు వారలేమి నిశ్చయించుకొనిరి? వాని నిట వివరించుట కావశ్యక మెద్దియుఁ గలుగదు. ముందు సందర్భముల నవి యన్నియు వెల్లడికాగలవు.

వఱువాతయైనతోడనే మహేంద్రనరేశరజితేంద్రాజితసింహులు తమ గుడారములనుండి వెడలి దండనాయకుఁడగు యమేరుసింహున కెద్దియో బోధించి సాధుపుంగవుని సందర్శింప వాని నివాసము వైపున కేగిరి.

ఆసాధుపుంగవుఁడు వ్యాఘ్రములమధ్య నగ్నిహోత్రమును బ్రజ్వలింపఁ జేయుచుఁ గూర్చుండియుండెను. కొన్ని పులులు వానికి నలువైపుల గ్రుమ్మరుచుఁ గావలి గాయుచుండెను.

మహేంద్రసింహుఁడా సాధుపుంగవుని డగ్గఱి యభివందన మాచరించెను. అంత నా మహాత్ముఁడు వానిని దగురీతి నాశీర్వదించి కూర్చుండు మని పలికెను.

ఆసాధుపుంగవుని సమీపమున నన్నిటికంటె నేఁడు రెంపు వులు లధికముగనుండుట మహేంద్రసింహుఁడు కనుగొనెను.

పిదప నాసాధుపుంగవుఁడు వాని దెసఁ బరికించి, "రాకుమారా! నీవొంటరిగ రాగతంబేమి? నీసోదరుఁడు నైయాముఁలు నెచటికేగియుండిరి?

"మహాత్మా! నాసోదరుఁడు విషమజ్వర ప్రపీడితుఁడయి యుందుచున్నాఁడు. వాని పరిచర్యల కచట రజితేంద్రాజితసింహులను విడిచి నేను తమ్ము దర్శింప నేతెంచితిని."

"మంచిది! భీతిల్లవలదు. సంధ్యాసమయముగాకమున్నె వానికి స్వస్థత చేకూరఁగలదు. మీప్రజలెల్లరు కుశలముగ నుండిరికదా?"

"తమ కరుణాతిరేకంబున నెల్లరు నానందచిత్తులయి యున్నారు"

"పాపము" మీజనకుఁడు వి జయేంద్రసింహుఁ డనేక యంగదములఁ జిక్కి శ్రమనొందియుండెను. ఏమయిననేమి? ఈసంసారప్రపంచమందు వాని సత్కీర్తి స్థిరస్థాయిగ నిలిచియున్నది. వేయి వత్సరములకు మధ్య నేభూపాలుఁడును తిలస్మమును ఖండించి యెఱుంగఁడు. ఇంకను మఱియొండు తిలస్మము గలదు. వహ్వా! ఏమి! నిజముగ నా తిలస్మమే యభినందించుటకుఁ బాత్రమైనది.

"మహాత్మా! ఆతిలస్మము నావలన ఖండింపఁ బడునని నాజనకుఁడు వేమఱు బలుకుచుండును."

"సందియమేల? అయ్యది నీవలననే ఖండింపఁబడును."

"అట్టి మహద్భాగ్య మెపుడు చేకూరఁగలదో కాంచవలసియున్నది. దాని బీగము జాడ యెచటను గానరాకున్నది."

"భగవతేచ్ఛ కలిగియుండిన రెండుమూఁడు దినములలో నీవా తిలస్మఖండనమున నుద్యమింపఁ గలవు. ఆతిలస్మమునకు బీగము నేనే యని తలంపుము. ఎన్ని తరములనుండియో మేమా తిలస్మమున కధ్యక్షులమగుచు వచ్చితిమి. మా ప్రపితామహుని కాలము నాఁటినుండియు నాతిలస్మము మా యధికారమందుఁ గలదు. నాతండ్రి యవసానకాలంబున నన్నా తిలస్మమున కధ్యక్షునిగ నొనరించి దాని బీగము నాకొసంగియుండెను. ఇపుడా బీగము మీకు సమర్పింపనై యుంటిని. కారణంబేమన, మీసహోదరు లిరువురిపేర నాతిలస్మము బంధింపఁ బడియున్నది. మీరుదక్క నితరులెవ్వరు నాతిలస్మమున కధికారులు గాఁజాలరు.

"అగుచో, నిఁక నాలశ్య మెందులకు?"

"అటులనే కాఁగలదు. రేపటినుండి నీవు దానిని ఖండించుటకు నారంభింపవచ్చును. కాని, మఱియొక యాటంకము మాత్రము పొడ గట్టుచున్నది."

"అది యెట్టిది?"

"దాని ఖండనమున నీసహోదరుఁడగు నరేశసింహుఁడును నీకుఁ దోడ్పడుచుండవలెను. ఆతిలస్మము మీయిరువురి నామముల బంధింపఁబడి యుండెనని తొలుతనే చెప్పియుంటినికదా? మీసహోదరు లిరువురి ప్రఖ్యాతియు నీప్రపంచమందాచంద్రతారార్కముగ నెలకొని యుండగలదు."

"అతఁ డస్వస్థత నొందియున్నాఁడుగదా?"

"నీవు వెడలి వాని నట్టిస్థితియందే యిచటికిఁ దోడ్కొనిరమ్ము నేను క్షణకాలములో వానికి స్వస్థతఁ జేకూర్చెదను. నేఁడే మీరిరువురు నావెంట నరుదేరవలెను. రేపటిదినమున మీరా తిలస్మఖండనమునఁ బ్రవృత్తులు కాఁగలరు. కానిచో, మఱియొక సంవత్సరము వఱకు

దానిని ఖండించు తరుణము లభింపఁ జాలదు."

"మహాత్మా! నాయభిమతంబు మీ రెఱుంగరు. దాఁచనేల? నేను నాసహోదరుని యున్నతిని వాంఛించువాఁడను గాను. నాతో సరిసమానముగ నతఁడు ప్రఖ్యాతినొందుట నాకు సమ్మతముగాదు."

"కాదుకాదు. నీవటులఁ దలంపరాదు. ఈప్రపంచమందు సహోదరునికి మించిన యనర్ఘరత్నము వేఱొండు గలుగదు."

"ప్రపంచమందు సహోదరునికి మించిన రత్నము లేకుండిన వానికి మించిన శత్రువును గలుగఁడు. నాహృదయసీమయం దీవిషయము బాగుగ నాటుకొనియున్నది. అయ్యది విధాతయైనను నాయంతరంగమునుండి తొలగింపఁ జాలఁడు"

"వాని తోడ్పాటులేనిదే నీవా తిలస్మమును ఖండింపఁ జాలవు"

"(కరములను జోడించి) మహాత్మా! అటులయిన పోనీయుఁడు మఱియు నన్ను మన్నింపుఁడు. నాకా తిలస్మమును ఖండించు యావశ్యకమే కలుగదు"

"రాకుమారా! నీకింత మాత్సర్యమేటికి?"

"పితామహుండైన నామతమును ద్రిప్పఁ జాలఁడని తొలుతనే చెప్పియుంటిని?"

"అటులయిన పోనిమ్ము. మన మిపుడే యిచటినుండి వెడలవలయును."

"నేను సంసిద్ధుఁడనై యుంటిని."

అంత నాసాధుపుంగవుఁ డాసమయంబుననే తన సామగ్రినంతయు మూటగట్టి యొక పులిపయినిడి తానొక వ్యాఘ్రముపయి నధిరోహించెను. అటుపిమ్మట మఱియొక శార్దూలము వైపునకుఁ దిలకించి, "బిడ్డా! గంగారామ్! నీవిటు రమ్మని" పిలిచెను. తత్క్షణమే యా వ్యాఘ్రము వాని సమీపమున కరుదెంచి నిలిచెను. పిదప నాసాధుపుంగ

వుఁడు మహేంద్రసింహుని దెసఁగాంచి, "రాకుమారా! నీవు దీనిపయి నధిష్ఠింపు" మనెను. మహేంద్రసింహుఁడా వ్యాఘ్రముపై కెగసి దాని పయిఁ గూర్చుండెను. తదనంతర మాసాధుమహాత్ముఁడు దక్షిణముఖముగాఁ దన పులిని నడిపించుకొని పోసాగెను. వానివెంటఁ గల కొదువ పులులలో గొన్ని ముందుగను గొన్ని వెనుకను మఱికొన్ని గుడి యెడమ వైపులను నాసాధుపుంగవుని వెంటఁ బోఁదొడంగెను.

క్రమముగ బులులన్నియు వెనుకఁబడెను. సాధుపుంగవుఁడును మహేంద్రసింహుఁడును నధిష్ఠించియున్న వ్యాఘ్రములుమాత్రము సరాసరిగ ముందునకు వెడలిపోవుచుండెను.

మిట్టమధ్యాహ్నము వఱకా పులు లెడ తెఱపిలేక నడచుచునే యుండెను. కొంత ప్రొద్దువ్రాలిన పిదప నాసాధుపుంగవుఁడు మహేంద్రసింహుని వైపునకుఁ దిరిగి, "రాకుమారా! ఇచట నీపాదపంబుల శీతలచ్ఛాయయందుఁ గొంతతడవు విశ్రమించి పిదప భుజించి యావల ప్రయాణము సాగింత" మనెను దానికి బ్రత్యుత్తరముగ మహేంద్రసింహుఁడు వానితో, "మహాత్మా! నేను భుజింపనొల్లను. ఇఁక మీరు మహాత్ములేకదా? మీ కాకలిదప్పికలు గలిగియే యుండవు. వ్యర్థముగ గాలవిలంబన మేల సేయవలయును? ఏకార్యసాధనమునకయి మన మగ్రసరులమైయుంటిమో యద్దాని వెనుకవైచుట యుత్తమపురుషుల క్షణముఁ గా" దని పలికెను.

అంత సాధుపుంగవుఁడు వానితో, "సెబాస్! నీమనోదార్ఢ్యము మెచ్చఁదగియున్నది. నీవంతటి ప్రతాపశాలివి కావుననే యాతిలస్మము నీవలన ఖండింపఁ బడునని పెద్దలు వచియించియున్నారు. మంచిది. నడువుము.

సంధ్యాసమయమగుసరికి వారలొక పెద్దపర్వతము సమీపమునకు బోయిచేరిరి. పిదప నాసాధుమూర్తి మహేంద్రసింహునిఁ గని

"రాకుమారా! మన మనాయాసముగ గమ్యస్థానమును జేరగలిగితి" మని పలికి యాపర్వతప్రాంతములు ప్రతిధ్వనించు నటుల శంఖమును బూరించెను. తోడనే పలుదెసలనుండి కొండదొంగలు చేతులయందు భల్లములను ధరించి తండోపతండములుగ నచటికి వచ్చిచేరిరి. అట్టి వారినే యిరువదిమందిని వెంటఁగొని విక్రమసింహనరపాలుఁడు నచటి వచ్చిచేరెను. వానిని గాంచినంతనే మహేంద్రసింహుఁడు గంభీరస్వరంబుతో, "ఓహో! నేను వీనిని గుర్తించితిని. ఇతఁడు విక్రమసింహనరపాలుఁడు. వీని ఛాయాపటము నామందిరమున వ్రేలాడుచున్నది. ఒకనాఁడు నా జనకుఁడా ఛాయాపటమును జూపి" యీతఁడే మనకు శత్రువగు విక్రమసింహభూపాలుఁ" డని వచియించియుండె" ననెను.

అహా! ఏమి! ఆశ్చర్యము! అటులయిన నీసాధుపుంగవుఁడై యారుఁడు గావలయును. ఔను! మన తలంపే నిక్కువమాయెను. అయిననేమి? మహేంద్రసింహుని బంధించుటొక సామాన్య విషయమా?

విక్రమసింహుఁడు వానిని సమీపించి, "నాహృదయాగ్ని పూర్వకముగ నుపశమిల్లదయ్యెను. ఆశ్చర్యము! సోదరు లిరువురొక్కమాఱుగ మాచే జిక్కిరి" అనెను.

మహేంద్రసింహుఁడు (తనలో) సంతసింపకుము. మహేంద్రసింహుని బంధించితిమని విశ్వసింపకుము. వాని వైపునకుఁ గుదృష్టితోఁ వీక్షించుటకైన నెవరికి సామర్థ్యము గలదు?

గ్రంథకర్త:—నిక్కువము. సందేహమేమి కలదు?

---

పదునెనిమిదవ ప్రకరణము.

విక్రమసింహనరపాలుని సంక్షిప్తయితిహాస మిచట లిఖించుట

యావశ్యకముగ దలంచుచుంటిమి. విక్రమసింహభూపాలుఁ డన్ని తె
అంగుల విజయేంద్రసింహుని వలన బరాజితుఁడై జగత్సింహభూపాలుని
వలన మరల బంధివిముక్తుఁడయి కుమారిగడము వైపునకు దారిపట్టెను.
అతఁ డచటఁ గల తన సుహృజ్జనంబులలో గొందఱను వెంటఁగొని కు
మారిగడమునుండి బయలుదేరెను.

కుమారిగడమునకు దక్షిణదిశగా గొంతదవ్వున వింధ్యపర్వతా
రణ్యము గలదు. అయ్యది రావర్ఘను, గంజి, సర్గుజా, సింగరౌరీలమీఁ
దుగా వందలకొలఁది మైళ్ల దూరము విస్తరించియుండెను. ఆపర్వతము
లు గొప్పగొప్ప కందరములను గలిగి నడుమనడుమ మూఁడునాల్గుక్రో
శుల దూరమందు గ్రామములును గలిగియుండెను. అచ్చటచ్చట పర్వ
తోపరిభాగములయందుఁ బురాతన దుర్గములు శిథిలములయి నేడును
దమ శిల్పకళా నైపుణ్యమున దేజరిల్లుచు నేత్రపర్వము గావించుచుండె
ను. కుమారిగడమునుండి యాఱు క్రోసుల దవ్వున నహారౌరీ సమీ
పపర్వతముల పయి శిథిలమైన పురాతన దుర్గచిహ్నములను గాంచుటవ
లన నేడుకూడ చిత్రభావములు మాఱుచుండును. దూరదృష్టిఁ బరిశీలిం
చిన నాదుర్గము తన యున్నతదశయందు మూఁడు క్రోశులు చుట్టుకొ
లఁత గలిగియుండెనని తోపకమానదు, తుదకా దుర్గము సుప్రసిద్ధుఁడగు
కాశీనరేశుని యధికారము లోనికి వచ్చెను. ఆయరణ్యమార్గమున విక్ర
మసింహనరపాలుఁడు ప్రియపత్నీ సమేతుఁడై హితబృత్యవర్గముతోఁ బ
ర్యటనము గావించుచుఁ గుమారిగడము నుండి యిరువది యైదు క్రో
శులదవ్వున నొక మనోహరపర్వతముపయి శిథిలంబగు పురాతనదుర్గ
మందునివసింపసాగెను. దాని యందాసమయంబున నివాసయోగ్యం
బులగుకొన్ని మందిరములు గలవు. అతఁడా స్థానమునకు విక్రమగడము
ని పేరిడెను. ఆదుర్గము నలుకెలంకుల నెత్తైన పర్వతమాలికలమధ్యదాఁ
గియుండి దుర్భేద్యమయి యుండెను. అపరిచితమనుష్య లొక్క-మాఱు

గ నచటఁ జేరుటగాని, యచటనొక దుర్గముగలదని తెలిసికొనుటగాని కఠినము.

ఆసమయంబున విక్రమసింహభూపాలుని వెంటఁ గేవల మిరువదిమంది పరివారము మాత్రముగలదు. వారిలో ముసల్మాను నైయారులునుగలరు. వారు దావూత్ ఖానిబ్రహాముల బాంధుకోటిలోనివారు. తాము విక్రమసింహునితోఁగూడియుండిన నేనాఁటికైనను విజయేంద్రసింహునినుండి ప్రతీకారము బడయఁగలుగుదుమని వారి విశ్వాసము. అదియునుఁగాక తమ్ముబోలు విశ్వాసఘాతకులగు నైయారులను గొలువునందు జేర్చుకొను భూపాలుఁడెవ్వఁడును వారికి గనిపించరయ్యెను. ఆముసల్మాన్ నైయారులు ముప్పురు నీదిగువనుదహరింపఁబడిన నామములతోఁ బేర్కొనఁబడుచుండిరి. 1 బాకరల్లీ 2 ఖుదాబక్సు 3 యారల్లీ. ఈ నైయారులును పరిజనులును దమకు సాధ్యమగురీతి దేహమనోధనంబుల విక్రమసింహునకుఁ దోడ్పడియుండిరి.

విక్రమసింహనరపాలుఁడు విజయేంద్రసింహునిపై గల పగను సాధించుకొనుటకుఁ దగు తరుణమునకై నిరీక్షించుచుఁ జాలకాలము వఱకు వేచియుండెను. అతఁడు తన నేర్పు పెంపున భిల్లులు మున్నగు కొండజాతుల వారికి ప్రభువై వారివలన నెయ్యి, తేనె, కాయధాన్యములు మున్నగు యడవి పదార్థములను కరరూపంబున గైకొనుచు దన పరిజనుల మూలమున నాపదార్థములను బట్టణములకుఁ బంపి విక్రయించి ధనము నార్జించుచుండెను. ఆజాతులను జ్ఞానసంపన్నులనుగ నొనర్చి కొంత సైన్యమును నిర్మించుకొనియుండెను. విక్రమసింహభూపాలు డట్టి విధంబున నచట స్థిరపడి రాజశాసన మొనర్చుచుండెను.

బాకరల్లీ మున్నగు నైయారులును గుమారిగడమునుండి వెడలివచ్చిన విక్రమసింహనరపాలుని పరిజనుల నైయారితనమునందుఁ బ్రావీణ్యులనుగ నొనరించియుండిరి. ఈయంతరంబున విక్రమసింహభూ

పాలున కొక పుత్రుఁడు నొక పుత్రికయు జన్మించిరి.

విక్రమసింహనరపాలుఁడు సుయోగమునఁగని పరిజనులను నైయారులను వెంటఁగొని విజయేంద్రసింహమహారాజునుండి బదులు తీర్చుకొను తలంపుతో విక్రమగడమునుండి బయలుదేరెను. విక్రమసింహభూపాలుని వృత్తాంత మింతదనుక లిఖించి యీప్రకరణమును ముగించుచుంటిమి. మరల మహేంద్రసింహుని కథను వ్రాయుచుంటిమి.

మహేంద్రసింహుఁ డటులా సాధుపుంగవుని వలన వంచింపఁబడిన పిదప నాకృత్రిమవ్యాఘ్రములు తమ రూపంబులను మార్చుకొని నిజరూపంబుల నైయ్యారులైరి. వారిలో బాకరల్లీ, ఖుదాబక్సు, యారల్లీలు ముఖ్యులు. "తన దుర్దినంబు లిపుడు తొలఁగి పోయెననియు, దాను గోల్పోయియుండిన కుమారిగడసింహాసనము భగవదనుగ్రహంబున మరల సంపాదించగలననియు, దన పగతుఁనుండి పూర్ణప్రతీకారము బడయఁజాలుదుననియు" విక్రమసింహభూపాలుఁ డువ్విళ్లూరుచుండెను.

పిదప వారలా మహేంద్రసింహుని బంధించి విక్రమగడమునకు గొనిపోయి కారాగృహబద్ధునిగ నొనరించిరి. అతఁడు వారివలన బంధింపఁబడు నపుడెట్టి యుత్పాతములను గలిగించియుండలేదు. ఎవరిపైనను గుపితుఁడు గాలేదు. ఖడ్గమును దూయలేదు. వాని ముఖమండలమున క్రోధాశ్చర్యభయాదిభావము లెవ్వియు గోచరింపలేదు.

ఆహా! ఏమి! ఆశ్చర్యము! అట్టి బాహువీర్యబలపరాక్రమోపేతుఁడగు విక్రమసింహమహారాజు గర్భమున జనించిన సింహకిశోరమునకా, యింతటి శాంతము. కాదుకాదు. దానియం దెట్టిదియో యొక రహస్యము దప్పక నుండియుండును.

# పంచో న్మూదవ పరిచ్ఛేదము.



కుమారిగడదుర్గమందొక రహస్యాలోచన మందిరంబున జగత్సింహవిజయేంద్రసింహభూపాలు రర్జునాభయ మోహనమహేంద్రిన శేశసింహులతోఁ గూర్చుండి సంభాషించుచుండిరి.

అర్జున:—రజితేంద్రసింహుఁ డతి విదగ్ధతతో మహేంద్రసింహుని రూపమును దాల్చుకొని విక్రమసింహుని మైయారులవలన బంధింపఁబడి యుండెఁగదా?

జగత్సిం:—విక్రమసింహుని మైయారులును మిగుల నేర్పుతోఁ దమ కార్యముల నిర్వహించియుండిరి కాని ... ... ..."

విజయేం:—సాధుమహాత్ముఁడు వ్యాఘ్రముపయి నధిరోహించి సిద్ధుఁ డాయెను. కాని, తన మనోవాంఛితమును మాత్రము సిద్ధింప జేసికొనఁ జాలఁడయ్యెను.

మహేంద్ర:—ఏమయిననేమి? రజితేంద్రసింహుని వేగమే విక్రమసింహుని బందిగమునుండి విడిపింపవలసియున్నది.

అర్జున:—రాకుమారా! నీవిటు లేల తొట్రుపడుచుంటివి? నీమిత్రునకెట్టి యిక్కట్టులును గలుగఁజాలవు. అతఁడింక నచట బంధీకృతుఁడయి యుండుటయే శ్రేయము. రజితేంద్రుఁ డవివేకి గాఁడు. అతఁడొరుల సహాయమర్థింపకయే బంధవిముక్తుఁడయి రాఁగల సమర్థుఁడు. వానికిఁ దోడ్పడుటకుఁ బండితజగన్నాథయోగీంద్రవిశలజాలిమరమేశసింహులు వెడలియుండిరి కదా? వారలేమి కావించుకొని వత్తురో మనము పరికింపవలసియున్నది. విక్రమసింహభూపాలుఁ డింతకాలముదనుక మిన్నకుండి మరల నిపుడు కలహమునకుఁ గాలుదువ్వుచున్నాఁడు.

మోహన:— కుమారుల వెంటఁ గాంతారముల కేగియుండిన పదాదుల విషయమై యేమి యాజ్ఞ?

అర్జున:— వారలింకను నచట నిలిచి యుండుటయే యుచితము. (అభయసింహుని దెసఁగాంచి,) "అభయా! నీయభిప్రాయ మేమి?

అభయ:— చిత్తము. పటకుటీరములు సహితము వారలచటనే నిలిచియుండవలెను. అందువలన మన వార లతి హేళనముగ దమ కార్యములను జక్క పఱచుకొనఁ జాలుదురు.

జగత్సిం:— మన కచటి సమాచారములు తెలియుట కైయోధులలో నొక్కరైనను మగిడిరారైరి.

అభయ:— రెండుమూఁడు దినములలో నెవరో యొకరు తప్పక రాగలరు.

వార లివ్విధంబున నొకజాముపఱకుఁ బెక్కు సంగతులను సంభాషించుచుండిరి. ఆవిషయము లన్నింటిని మేమిచట వివరించి తెలుపుటుచితముగ దలంచుటలేదు. సభాభంగమైన పిదప నర్జునసింహుఁడొంటరిపాటున నభయసింహునకు వివరించియుండిన విషయమెట్టిదో దానిని మేమును నెఱుఁగము.

గ్రంథకర్త:— మంచిది. తొందరయేల? ఏమి తొడరునో కాంచెదము గదా?

గంగానదీతీరమందలి యొక విలాసమందిరమున మహేంద్రనరేశసింహులు కూర్చుండి యానదీతరంగమాలికల నాట్యవినోదములను దిలకించుచుండిరి. అది వర్షర్తువు అజాహ్నవి కెరలుచుఁ దన చిన్నచిన్న యలలతో నాదుర్గ ప్రాకారమును దాఁకుచుండెను. అస్తోన్ముఖుఁడగు ప్రభాకరుని కిరణజాలంబులు తమ యరుణకాంతులచే నావీచి నిచయంబులశోభ నినుమడింపఁ జేయుచుండెను. నలుగడల నిస్తబ్ధత వ్యాపించియుండెను. ఆమందిరమున నాసోదరు లిరువురుదక్క నితరులెవ్వరును లేరు.

మహేంద్రసింహుఁడు తన సోదరుని వైపునకుఁ దిలకించి, నరేశా! ఈగంగాభవాని జలప్రపూరితమై యెటుల పొంగిపొరలుచున్నదో చూడుము! అనెను.

"సోదరా! ఈజాహ్నవి నిరుడీ దినంబులలో నేఁటికంటె నెన్ని మడుంగులో విజృంభించియున్నది. అపుడేకదా పితామహుఁడు మన కీఁత పరీక్షను గావించియుండెను."

"ఆనాఁడు మన యానందమునకు మేర లేకుండెను. నాఁడీఁత పరీక్షయందు రజితేంద్రసింహుఁడు బండితజగన్నాథు నెటుల నిర్జించియుండెనో చూచితివిగదా? అతఁడెన్ని మాఱులో రజితేంద్రసింహుని కంటె ముందుగ నావలితీరమునకుఁ జేరఁ బ్రయత్నించెనుగాని, తుదకు విఫలమనోరథుఁ డాయెను."

"ఆనాఁటినుండియు గంగాప్రవాహమందు నీఁదులాడు యవకాశము మరల మనకు లభింపదాయెను."

"నిన్నటి దినమున నేను మన పితామహునితో, "ఈకాలంబున గంగామాత జలపరిపూర్ణమై యున్నది. మేమందుఁ గొండతడవు జలవిహారములను గావించి వచ్చెద"మని తెలిపి యనుమతి, యొసంగుఁడని ప్రార్థించియుంటిని."

"వారేమనిరి?"

"చాలింపుము. మీరిపుడు యుక్తవయస్కులరగుచుంటిరి. ఈఁతయు నొక విద్య మైయుండినను మీరిపు డీఁదులాడుటకుఁ బోయిన ప్రజలు మిమ్ములను గాంచి పరిహసింతురు. మీ రా విద్యయందుఁ గడతేఱియుంటిరికదా? ఇపుడేమి యావశ్యకముగలదు? మీకట్టి వేడుక బొడముచుండిన జలయానముపై విహరింపఁ బోవుఁడని మందలించియుండిరి."

"అటులయిన నడుపుము. మనమా నావపై నెక్కి యీగంగా ప్రవాహమున గొంతతడవు విహరించవత్తము. దీని కొఱకరి యాజ్ఞతోఁ బనిలేదుకదా?"

ఆసహోదరు లిరువు రివ్విధంబున సంభాషించుచుండ నొక చోబుదారుఁ డరుదెంచి, "రాకుమారులారా! ఒక వృద్ధవణిగ్వరుఁడు తమ దర్శనాభిలాషియై వచ్చి ద్వారముకడ నిలిచియున్నాఁ" డని వి న్నవించెను.

నరేశ:—ఇదియెట్టి సమయమో నీవెఱుంగవా? పొమ్ము.

చోబుదా:—[కరములను జోడించి] రాకుమారా! అది నే నెఱింగి యుండియే, వానితో నిది సమయముగాదు; వెడలిపొమ్మని పలుకదలంచితిని కాని, యతఁడు మనరాజ్య శుభచింతకుఁ డగుటవలనను, విశ్వాసపాత్రుఁడగుటచేతను, మన భూపా లురకు వానిపై నధికానుగ్రహము గలిగియుండిన కతంబున ను, వృద్ధుఁడగుటవలనను, నతఁడీ నగరమున కేతెంచిన తో డనే భూపాలురను సందర్శించిపోవుట యాచారమైయుండు కారణంబునను; నేను భూపాలురను సందర్శించి వచ్చితిని. ఇఁక రాకుమారుల సందర్శనమును లభించిన విశ్రాంతి బ డయుటకై సత్త్రమున కేగుదునని తెలుపుటవలనను, నాకట్టి ధైర్యము చేకూరదయ్యెను.

మహేంద్ర:—అగుచో, వానిని వెంటనే యిటకుఁ దోడ్కొనిరమ్ము.

నరేశ:—సోదరా! మనమిపుడు గంగాప్రవాహమున విహరింప నేగనుం టిమికదా?

మహేంద్ర:—పోనిమ్ము. రేపటి దినమున నేగుదము.

ఆచోబుదారుఁడా రాకుమారులకు మ్రొక్కి యచటినుండి వెడ లెను. మఱియు ననతికాలములో నొక వణిగ్వరుని దోడ్కొనివచ్చి వా

రి సమ్ముఖమున నిలిపెను. ఆవణిగ్వరుఁడు వృద్ధుఁడు. శాంతనమ్రతభా వంబులును సజ్జనత్వమును వానిముఖమండలమునఁ బ్రకాశించుచుండెను అంత నావణిగ్వరుఁడా రాకుమారులకుఁ జేమోడ్చి రెండుస్వర్ణాంగుళీ యకములను జెరి యొకటికానుకగ నర్పించెను. ఆరాకుమారులును వా నిని గూర్చుండుమని సన్మాన పూర్వకంబుగబలికి వాని కుశలమును సం చారవృత్తాంతములను బ్రశ్నించిరి. ఆవణిగ్వరుఁడును వారి ప్రశ్నములకుఁ దగురీతిఁ బ్రత్యుత్తరంబొసంగి, "రాకుమారులారా! నేనిపుడే యీనగ రమును జేరగలిగితిని. మార్గాయాసంబున మిక్కిలిబడలియున్నాను. సె లవొసంగెదరేని, నేవెడలి రేపటిదినమున మరల మిమ్ము సందర్శించెద నని" పలికి వారివలన వీడుకోలును బడసి తన మార్గంబును బట్టివెడలెను.

ఆవృద్ధ వణిగర్వుఁడు కానుకగ నొసంగియుండిన యుంగరముల లో నరేశసింహునకొసంగిన యంగుళీయక మమూల్యాలంబులగు రత్నము లతోఁబొదుగబడి ముద్దులుమూటగట్టుచుండెను. మహేంద్రసింహున కొసంగిన యుంగరము పయి నొక యతిలావణ్యవతియగు సుందరీమణి విగ్రహము జెక్కఁబడియుండెను. మహేంద్రసింహుడు రెండుమూఁడు మాఱులా విగ్రహముపయి దనదృష్టిని బ్రసరింపఁజేసి యెద్దియో యో జించుకొని మిన్నకుండెను.

ఆతఁడు రాత్రికాలంబున నొంటరిగ నొకదీపపుబ్రకాశమునొద్ద కూర్చుండి యాయంగుళీయకమును గాఢదృష్టిబరిశీలింపసాగెను. దాని పై నతిరూపశాలిని యగు స్త్రీప్రతిబింబ మొకటి చక్కఁగఁ జెక్కఁబడి యుండెను. ఆవిగ్రహమెంత చిన్నదైనను సజీవప్రతిమవలె దీపించు చుండెను. దానిని నిర్మించినస్వర్ణకారుఁడు తన నేర్పంతయుదానినిర్మాణ మందు వెచ్చించియుండెనని దోఁచుచుండెను. ఆవిగ్రహమునుగాంచి నంతనే మహేంద్రసింహుడు మోహవివశుఁడయి యాసుందరి తనయం తికమున గూర్చుండియుండినటులను నామెతో తానెద్దియో పలుకఁ

గోరుచుండినటులను జూపట్టుచుండెను. అతఁడాకస్మికముగఁ దుల్లిపడి, "యిదియేమి?" యని తనయవివేకమును గూర్చి యబ్బురపాటు నొందసాగెను. కాని, దానివలన నేమి కాగలదు?

ఆవిగ్రహ మందెట్టిమంత్రశక్తిగలదో, తెలియఁజాలముగాని, యది వాని కిశోరావస్థను దృటిలో మంట గలిపివైచెను, ఆసమయమున యౌవనోన్మత్తరూపము వానిముందు ప్రత్యక్షమై నిలిచెను. ఇంతకుఁబూర్వము— కొన్నిక్షణములకు వెనుక, అశ్వారోహణము— ఆఖేటనము—వ్యాయామము మున్నగు విషయములయందు వానిహృదయము లీనమైయుండెను. ఇపుడు వానియంతరంగము మఱియొకవిధంబగు జంజాటమందుఁ జిక్కుకొనెను. వానిమానస మిపుడా యద్వితీయస్త్రీరత్నమును బడయుమార్గమును గవేషింపఁ దొడంగెను. ప్రాణమిత్రుఁడు రజితేంద్రసింహుఁ డెటుల బంధివిముక్తుఁడగు? పండితజగన్నాథుఁడు మున్నగువారు విక్రమగడమున కేగి యుండిరికదా? వారలచట నేమి కావించుచున్నారు? మృగయావిహారమున కేగు తరుణమెపుడు లభించు? ఒక్కసాయకముతోడనే శార్దూలమును బరిమార్చు యానందమెపుడు చేకూరు? జలయానముపై నధివసించి గంగాప్రవాహమున విహరించు సమయమెపుడు సంభవించు మున్నగు యోజనల నిపు డతఁడు మఱచియుండెను. ఆవణిగ్వరున కీయంగుళీయక మెటుల లభించియుండెను? ఈచిత్రము కల్పితమా లేకనొకానొక సుందరీమణి ప్రతిస్వరూపమా? ఆమె యిపుడీపుడమిఁ గలదా? ఆవణిగ్వరుఁడా యన్నులమిన్న నివాసస్థానమును నామె తలిదండ్రుల నెఱింగియుండెనా? పదమ సౌందర్యమున కిదియే పరసీమయా లేక నింకనుగలదా? నే నీమోహాబ్ధి నెటుల దరింపఁ జాలుదునను విచారములు వానికిపుడు మెండాయెను.

ఇపుడు కుమారమహేంద్రసింహుఁడు సాకులను నేర్చుకొన మొదలిడి యొక గడియకాలములోనే యందుఁ బ్రావీణ్యుఁడయ్యెను.

నాకడుపు నొచ్చుచున్నది. భుజింపనొల్ల. శిరోపీడన మధికమగుచున్నది. ఇతరుల పలుకులు నాకు వెగటుగ దోఁచుచున్నవి. నిశ్శబ్దముగ నుండిన గొంత నిద్దురపట్టునేమో, యిట్టి విధంబులగు నెపంబులను బన్ని యాసుందరీమణి యందలి కోరిక నేకాగ్రచిత్తుఁడయి కుమారమహేంద్రసింహుఁడు లోలోన గుందసాగెను. ఆనాఁటి రేయియంతయుఁ బ్రక్కనుమార్చుకొనుటయందును, దెల్లవాఱిన తోడనే యావణిగ్వరుని రప్పించి యాసత్త్రశాలిని వృత్తాంతములను బ్రశ్నించు యాలోచన యందును గడపెను.

ప్రభాతంబయిన వెంటనే కుమారమహేంద్రసింహుఁ డాచోబుదారుని జేరఁబిలిచి, "ఓయీ! నీవు వేగమే వెడలి యావృద్ధవణిగ్వరుని దోడ్కొని" రమ్మని యాజ్ఞాపించెను.

కుమారమహేంద్రసింహుని యాజ్ఞానుసార మాచోబుదారుఁడు వెడలి యావృద్ధవణిగ్వరునికై పలుతావుల వెదకిచూచెను గాని, వాని యడపొడ యెచటను జూపట్టదయ్యెను. తుదకా చోబుదారుఁడు మగిడి వచ్చి, మహేంద్రసింహునితో, "రాకుమారా! నేనా వృద్ధవణిగ్వరునికై మన నగరమంతయు వెదకివచ్చితిని. కాని యెచటను వాని జాడ చూపట్టకున్న" దని విన్నవించెను.

మహేంద్ర:—అతఁడు నిన్నటి దినంబున విశ్రాంతిగైకొనుటకయి సత్త్రమున కేగుదునని కదా వచియించియుండెను.

చోబుదా:—రాకుమారా! ఆవృద్ధవణిగ్వరుఁ డటులనే తెలిపియుండెను గాని, నేనా సత్త్రము నొద్దకేగి దాని యధికారిని బ్రశ్నింప, నిన్నటి దినంబున నిచటి కేవణిగ్వరుఁడును వచ్చియుండలే దని తెలుపుచున్నాఁడు.

మహేంద్ర:—అతఁడు మఱియొక తావున విడిసియుండును. నీవు వెడలి వానిజాడ బాగుగ నరసిరమ్మ.

"చిత్త" మని పలికి యా చోబుదారుఁ డచటినుండి వెడలెను. కుమారమహేంద్రసింహుని హృదయంబున బెక్కువిధంబులగు శంకలు పుట్టుచుండెను. అతఁడు శిరము వంచి యెద్దియో యోజింపఁ దొడంగెను. అంత నెవరి యడుగుల సవ్వడియో వానినిఁ దొట్రుపఱచెను. శిరమును బైకెత్తి కుమారనరేశసింహుఁడు తన దెస కరుదెంచుచుంట యాతఁడు కనుగొనెను.

పిదపఁ గుమారనరేశసింహుఁడు వానిని సమీపించి, "సోదరా! నేఁడిదియేమి? స్నానమాచరించు కాలము మీఱియున్నదికదా? అనెను.

"ఔను. నేఁడు కొంత వ్యవధియయ్యెను."

"నీమోమిటుల వికాసము దక్కియున్నదేమి?"

"శిరోపీడనంబున రాత్రియంతయు నిద్దురపట్టదాయె."

"ఇపుడు స్వస్థత చేకూరియున్నదా?"

"కొంచె మారోగ్యము గలిగినది."

"సోదరా! నిన్నటి దినంబున నావృద్ధవణిగ్వరుఁడు నీకొసంగియుండిన యంగుళీయకముపై నొక విగ్రహముండినటుల నాకుఁ దోఁచినది."

"ఔను కలదు."

"దాని నొకమాఱు నాకు జూపింతువా?"

"ఆయంగుళీయక మెచట నునిచియుంటినో నాకు జ్ఞప్తికిరాకున్నది. తెల్లవాఱిన పిదప బాగుగ వీక్షింపనగునని తలంచియుంటిని కాని ... ... ..."

గ్రంథకర్త:—నిజము. మేముగూడ సాక్ష్యమొసంగుచుంటిమి.

తన రహస్యము వెల్లడి కాగలదను భీతి కుమారమహేంద్రసింహునకు బాగుగ గలిగియుండెను. అతఁడు పలుమాఱులు నిట్టూర్పులఁ బుచ్చుట దక్క నితరకార్యములెవ్వియు వానికి గలుగకుండెను. ఏమి

సేయఁగలఁడు? అతఁడు నిరుపాయుఁడై తన స్థానమునుండి లేచి స్నానసంధ్యాదినిత్యకృత్యములను దీర్చుకొని నియమానుసరణి తన పితామహుని సాపంక్తిని గూర్చుండి భుజింపవలసిన వాఁడాయెను.

సాయంతనసమయంబున మరల నాచోబుదారుఁడు కుమారమహేంద్రసింహుని చెంతకరుదెంచి, "రాకుమారా! నే నావణిగ్వ్యాపుని కై మన నగరమంతయు గాలించి వచ్చితిని. వాని జాడ యెచటను జూపట్టదయ్యెను. మఱియు నతఁడు మన భూపాలురను సందర్శించి వచ్చితినని వచియించియుండిన మాటయుఁ గల్లయే" అని విన్నవించుకొనెను.

మూఁడవనాఁడు, కుమారమహేంద్రసింహుఁడు మిగుల నుదాసీనుఁడయి యుండుటను గాంచి, వాని మానసమున కూరటగలుగునను తలంపుతోఁ గుమారనరేశసింహుఁడు గంగాప్రవాహమున జలయానముపై విహరింపఁ బోవుట కెంతేనియు చలమూనెను. ఆతఁడు నిరుపాయుఁడై వాని పలుకులను మన్నింపవలసియే వచ్చెను.

పిదప వారిరువురు నొక సుందరంబైన నావపై నెక్కి కూర్చుండిరి. తమ వెంట నితరులెవరును రాకూడదని వారి యభిప్రాయము. కాని, పిన్ననాఁడా రాకుమారు లిరువుర నెత్తుకొని సాఁకియుండిన యొక వృద్ధసేవకుఁడు వారితో, "రాకుమారులారా! వెంట పరిజనులు లేనిదే మీరిరువురిటుల వెడలుట శ్రేయముగా"దని పెక్కువిధంబుల బోధించెను గాని, వాని పలుకొక్కటియు సాగిరాదయ్యెను. తుదకతఁడు సేయునదిలేక తానా నావపై బలాత్కారపూర్వకముగ నెక్కి కూర్చుండెను. రాకుమారులును నతఁడు పురాతనసేవకుఁడను తలంపులో వాని నేమియు బలుకఁ జాలరైరి. తుద కావృద్ధుని తమ వెంటఁ గొనిపోవలసిన వారైరి.

పిదప నరేశసింహుఁడు మహేంద్రసింహునితో "సోదరా! యీ నావను ప్రవాహము వైపునకుఁ గొనిపోయి విడిచిపెట్టుము. మనము

మరలివచ్చు సమయంబున గోలలువైచుచుఁ గొనితేవచ్చు" ననెను.

"మంచిది. అటులనే కావించెద" నని కుమారమహేంద్రసింహుఁడు బదులు పలికెను.

సూర్యుఁడపరవారాశిలోఁ గ్రుంకులిడు సమయంబున కింక నొకగంట కాలము వ్యవధిగలదు. అట్టి తరుణంబున వారలా నావపై నెక్కి గంగానదీప్రవాహంబున విహరింపఁ బోయిరి. వారు మగిడివచ్చు సమయంబున వెన్నెలయానందమును ననుభవించుఁ గోరిక వారికి గలదు.

కుమారిగడమునకుఁ బశ్చిమదిశగా రెండు క్రోశుల దూరమున గంగానదీతీరమందొక చిన్నయడవి గలదు. కుమారమహేంద్రనరేశసింహులు విహరింపఁబోయిన యానావ యెపుడా యడవిని సమీపించెనో యపుడు మంజులమురళీ నినాదమును నానిస్వనంబుతో నైక్యమైన సన్నని కంఠస్వరంబును వారికి శ్రుతిగోచరంబయ్యెను.

ఆహా! సంగీతధ్వని చరాచరంబులను ముగ్ధలనుగఁ జేయఁజాలిన ప్రభావము గలిగియున్నదిగదా? భక్తవత్సలుండగు పుండరీకాక్షుండును దన భక్తుల ప్రేమగానంబుల ముగ్ధుఁడయి వారి సమీపములకుఁ బరుగులిడుచున్నాఁడు. విషప్రవర్షి కాకోదరంబులును తుంబీమంజుల లలిత గానరసమునకు బలియగుచున్నవి. మృగములును వీణాకలితక్వణక్వణ నిస్వనంబుల మైమఱచి తమ తనువులను కిరాతుల కర్పించుచున్నవి. తుదకు బాషాణహృదయంబులును గఱఁగి పోవుచున్నవి. ఏసంగీతమందుఁ గావ్యశిల్పియొక్క యలౌకిక కావ్యాభాసము గలదో-ఏసౌందర్యమందుఁ బునీతపాతివ్రత్యముగలదో—ఏస్వరూపమందు సారళ్యసౌందర్యముగలదో—ఏపావన ప్రేమయందు నిస్స్వార్థత్యాగముగలదో వాని మహాత్మ్యములను వర్ణించుటకు నాలేఖినియందు శక్తిచాలదు.

కుమారమహేంద్రసింహుఁ డింతదనుక నిజప్రేమైక నిధానమగుయా (యంగుళీయకముపైఁ జిత్రింపఁబడియున్న) సుందరీమణి యాలోచ

నయందు నిమగ్నమానసుఁడయి శిరము వంచి కూర్చుండియుండెను. కాని, యామంజులసంగీతనినాదము సహోదరు లిరువురి కుత్తుకలను దన వైపునకుఁ ద్రిప్పుకొనెను. మఱియు దాను నిర్గమించుచుండిన దెసఁ గాంచుటకు వారిని బలాత్కరించెను.

తీరము వైపునకుఁ గాంచుటవలన బాడుచున్న దెవరో వారికి దెలియదయ్యెను గాని, వారు మిక్కిలి సమీపముననే యుండినట్లుమాత్రము వారికి బోధపడెను.

కుమారమహేంద్రసింహుఁడు నరేశసింహునిఁ దెసఁ బరికించి, “సోదరా! ఏమి! ఆమధురగానరసము!” అనెను.

నరేశ:—మఱియొక కంఠధ్వనియు వినిపించుచున్నది. తప్పక కొందఱు స్త్రీలు కలిసిపాడుచు జంత్రములను వాయించుచుండవలెను.

మహేంద్ర:—(నావముఖము తీరము వైపునకుఁ ద్రిప్పి) వారలిట్టి విధంబున నాడుచుఁ బాడుచుఁ దమ మానసంబుల నుల్లాసము జనింపఁ జేసికొనుట కీనిర్జనారణ్యమునే రమ్యస్థానముగ దలంచియుండిరి కాఁబోలు. మనమును వారలెట్టి వారలో కొంచెము గాంచివత్తము” అనెను. “మంచిది. నడువు” మని నరేశసింహుఁడు బదులు పలికెను.

అంత నావృద్ధసేవకుఁడు కుమారమహేశనరేశసింహులతో, “నా నావను తీరమునకు గొనిపోవలదని పెక్కుభంగుల బోధించెను. కాని, వాని మాటలను వినువా రెవరు? నావను తీరమునకుఁ జేర్చి యాసహోదరు లిరువురు గ్రిందికిదిగి యాగానధ్వని నిర్గమించుచుండిన దెసకుఁ సూటిగాఁ బోయిరి. వారలటులా యడవియందుఁ గొంతదూరమేగి యభినవతారుణ్యలక్ష్మీవిలాసభాసమానలగు కొందఱు విలాసవతులను గాంచిరి. వారు దాదాపు పదునైదుగురుందురు. వారు ధరించియుండిన

యమూల్యవస్త్రాలంకారములు స్వతస్సిద్ధంబగు వారి సుందరాకృతిని నినుమడింపఁ జేయుచుండెను. వారిలో గొంద ఱొక యెత్తైన వృక్షశాఖకు వ్రేలాడుచుండిన ఉయ్యాల నూపుచుండిరి. ఆమత్తకాశినులలో గొందఱు మురళీ, వీణె, మృదంగాది జంత్రములను వాయించుచుండిరి. కొందఱు కరతాళములు వైచుచుండిరి. కొందఱు పాడుచుండిరి. మఱి కొందఱు నృత్యముఁ జేయుచుండిరి. ఆఉయ్యాలపయి నూగుచుండిన భాసురాంగి గంగానది వైపునకు ముఖము నునిచికొని కూర్చుండియుండెను ఆదృశ్యమును దిలకించినంతనే యావిలాసవతులా ఉయ్యెలపై గూర్చుండియుండిన దేవకన్యక నూపుచు, నాడుచుఁబాడుచు నామెను బ్రసన్నురాలినిగఁజేసి దమ యౌవనరూపసంపదలు స్థిరస్థాయిగా నుండునటుల వరప్రసాదము నర్థించుచుండిరో యనునటుల దోఁచుచుండెను. వారలాకస్మికముగ మన కుమారమహేంద్రనరేశసింహులు తమ దెస కరుదెంచుచుంటను గాంచి ఉయ్యెలపయిఁ గూర్చుండియుండిన భాసురాంగి నొంటరిగ విడిచి యేల పారిపోవలసివచ్చెనో మన మూహింపఁ జాలము.

నరేశ:— సోదరా! ఆసుందరీమణులు పారిపోవుచున్నారు.

మహేంద్ర:— ఔను. నేనీ ఉయ్యెల సమీపమున కేగెదను. నీవాకాంత లెచటికేగుచుండిరో కనుఁగొనిరమ్ము.

"మంచిది" యని పలికి నరేశసింహుఁ డాయువతుల వెన్నంటి పోఁదొడంగెను.

కుమారమహేంద్రసింహుఁ డాఉయ్యెలపయి నొంటరిగ గూర్చుండియుండిన భాసురాంగిని గుర్తించెను. బాగు! అతఁడామె నేల గుర్తింపకుండును? ఆవృద్ధవణిగ్వరుఁడు కానుకగ నొసంగియుండిన యంగుళీయకముపయి నామె ప్రతిస్వరూపమును జూచియుండెను. అది వాని హృదయఫలకమున బూర్ణరూపంబున ఖచితమై యుండెను. ఏసుంద

రీమణిని బడయుటకై యాతఁడుత్కంఠితుఁడగుచుండెనో యామె నెట్టి పరిశ్రమ నొందకయే యతఁడు బడయ గలిగెను. ఇఁక వానికి గావలసిన దేమికలదు?

ఇటు కుమారనరేశసింహుఁడా యువతీమణుల జాడనరయ నేగెను. కాని, తుదకు వారి ఛాయమైనను వానికి జూపట్టదయ్యెను. కొంత సేపటివఱకు నిటునటు సంచరించి పరిశ్రాంతుఁడై మరల నాఊయ్యెల నొద్దకుఁ బోయెను. ఆఊయ్యెలపయి నధివసించియుండిన భాసురాంగి సంగతి యటుంచుఁడు. తన సోదరునైన నచటఁ గాంచక సంభ్రమచిత్తుఁడయి పెక్కుతావులయందు వెదకుచుఁ గేకలిడి వానిని పిలువసాగెను. కాని, ప్రయోజనము గలుగదయ్యెను. పిదప నతఁడు, తన సోదరుఁడు జలయానమునొద్ద కేగియుండునని తలంచి యావైపున కేగెను. అచటను దమ సహోదరుఁడు గనరాకుండుటచే సంక్షుభిత మనస్కుడై గడచిన వృత్తాంతమంతయు నావృద్ధసేవకునకు వివరించి తెలిపి, "నీవు వెంటనే పోయి యీవృత్తాంతమంతయు మనవారి కెఱింగింపుము. నాసహోదరుని జాడ తెలియుదనుక నేను నగరికి రాఁజాల" ననెను.

అంత నావృద్ధసేవకుఁడు కుమారనరేశసింహునితోఁ దన వెంట నేతెంచుటకు పెక్కుభంగుల బోధించెనుగాని, యాతఁడు వాని పలుకొక్కటియుఁ జెవిఁబెట్టఁడాయెను. తుదకా వృద్ధసేవకుఁడా సమాచారము లన్నింటిని విజయేంద్రసింహమహారాజున కెఱింగించుట యావశ్యకమని తలంచి యానావ నచటనే విడిచి పాదచారియై యాక్రందించుచుఁ గోటవైపునకు దారిపట్టెను.

---

# ఇరువదియవ ప్రకరణము.



ఆవృద్ధసేవకుఁడు దుర్గమంబుఁ బ్రవేశించి జగత్సింహవిజయేంద్రసింహ నరపాలు రొక్క తావున గూర్చుండి ప్రసంగించుచుండిన సమాచారమును దెలిసికొనెను. మఱియు వారి సమీపమునకుఁ బరుగులిడుచుఁ బోయి "భూపతులారా! కుమారమహేంద్రసింహుని జాడ తెలియుట లే" దని పలికి తాను నరేశసింహుని వలన నాలించియున్న సమాచారము లామూలాగ్రముగ వారి కెఱింగించెను.

ఆసమాచారముల నాలించినంతనే యాపృథ్వీశుల హృదయములందు గాఢాఘాతములు దవిలెను. కొంతసేపటివఱకు కింకర్తవ్యవిమూఢులయి కలఁతనొందసాగిరి. అప్పటికొక జామురాత్రి గడచియుండెను. తుద కర్జునాభయసింహుల నచటికి రావించి, వారికి సకలవృత్తాంతములు దేటతెల్లముగ నెఱింగించి మన మిపు డేమి కావింపవలయునని వారిని బ్రశ్నించిరి.

అభయ:—ఆయడవి యందందఱు కాంతలుకూడి పాడుచునాడుచు నివ్విధంబున గుమారమహేంద్రసింహుని వంచించుటొక యద్భుత విషయముగాదు.

జగత్సిం:—విక్రమసింహుఁడు మరల విజృంభించెనను వార్తనాలించిన నాటినుండియు నేను సంశయాకులచిత్తుఁడనైయుంటిని. ఈ పైశాచిక కృత్యములు వానివలన గలిగినవి కావుగదా?

విజయేం:—తమ యిచ్ఛచొప్పున బంధించుటకు కుమారులంత పరాక్రమవిహీనులుగారు.

జగత్సిం:—నిక్కవము కాని, నరేశుఁ డచట నిలిచిపోవుట యుక్తిసంగతము గాదు.

అభయ:—పాపమా వృద్ధసేవకుఁడు బలాత్కారముగ వారిని వెంబడిం

చి యుండెను. కానిచో, వారలెచటకేగి యుండినదియుఁ దె లియక మనము మిగులఁ దొట్రుపడవలసియుండును. మంచి ది. మన మిపుడేమి కావింపవలయునో దానిని యోజింపుఁ డు. నేనిపుడే వేయిమంది సిపాయిలను వెంటఁగొనిపోయి యా యడవి నలువైపులనుండి ముట్టడించి యుంచుట కనుజ్ఞ నొ సంగుఁడు. పిదప నేమి కానున్నదో కనుగొనఁదొమెదముగదా!

జగత్సి:—(అర్జునసింహునితో) నీయభిప్రాయ మేమి?

అర్జున:—అభయసింహుని పలుకులు యుక్తియుక్తములు. వాని కనుమ తి యొసంగుఁడు.

జగత్సి:—అభయసింహా! నీయిచ్చవొప్పన గావింపుము. మేమును వె నుకనుండి యచటికరుదెంతుము. పిదపఁ గర్తవ్యమును యో జింపనగును.

అభయసింహుఁ డటులా భూపాలునివలన ననుజ్ఞను బడసి వెం టనే దివాన్ఖానా మిద్దెపై కేగి యచట నుంచబడియున్న ఢంకాపై నానగరమంతయుఁ బ్రతిధ్వనించునటుల దనశక్తికొలఁది నొకదెబ్బ కొ ట్టెను. దాని కారణ మా పురజనులకుఁ దెలియదయ్యెను. కాని, తత్క్షణ మే వేయిమంది సిపాయిల యావశ్యకము గలదని సేనాని గ్రహించి తగు యేర్పాటులను గావించియుంచెను.

అభయసింహుఁ డైయారి సామానుల నలంకరించుకొని కోట వెడలివచ్చి ప్రభునాజ్ఞకై యెదురుచూచుచుండిన సిపాయిలను బెక్కు ఱు దివిటీవాండ్రను వెంటఁగొని యాయడవి వైపునకు బయలుదేరి య నతికాలములో నచటికి జేరుకొనెను మఱియు నాయడవిచుట్టు నాసి పాయిలను గాపుంచి తాను కుమారనరేశసింహునికై పలుతావుల వెద కిచూచెను. కాని, యందు వాని జాడయుఁ బొడకట్టదయ్యెను. అవ్విధం బున వారి కారాత్రియంతయు గడచిపోయెను. ప్రభాతంబయిన వెం ట

నే అభయసింహుఁడా సిపాయిలతో, "నీయడవి నొకవైపునుండి శీఘ్రముగ ఖండింపుఁడని యాజ్ఞాపించెను.

అసమయమునకే జగత్సింహభూపాలుఁ డర్జునసింహుని వెంట నచటికివచ్చి చేరెను. మఱియు నభయసింహుని బుద్ధికుశలతకు మిక్కిలి సంతసించుచు వానిని తద్దయుఁ బొగడెను. ఒకచిన్న యడవి నఱుకుట కెంతకాలము పట్టును? అదియునుగాక భూపాలుఁడు స్వయముగ నచట నిలిచియుండుటచే నెల్లరు నాకార్యమందుఁ బ్రవేశించి యతిశీఘ్రముగ నాయడవిని ఖండింపసాగిరి.

అపరాహ్ణము గాకమున్నె యాసిపాయి లాయడవియంతయు ఖండించివైచిరి. కాని, యందెవరి జాడయుఁ జూపట్టదయ్యెను. దానియం దొకమూల బహుమూల్యవస్త్రాలంకారంబుల సుసజ్జితమైన నొక యావనోన్ముఖియగు సుందరాంగిప్రేతము మాత్రము వారికి జూపట్టెను- దాని శిరమచట లేకుండెను. తుదకు కుమారమహేంద్రసింహుని విధంబుననే నరేశసింహుఁ డదృశ్యుఁడై యుండునని నిశ్చయింపఁబడెను. ఆశవము జగత్సింహభూపాలుని సమీపమునకుఁ గొని తేబడెను. ఇపు డెల్లరకుఁ బలువిధంబులగు శంకలు వృద్ధికాదొడంగెను. పిదప జగత్సింహభూపాలుఁ డాశవమును వెంటఁగొని తెచ్చుట కాజ్ఞాపించి నగరము వైపునకు బయలుదేర సంసిద్ధుఁ డయ్యెను. అర్జునసింహుఁ డభయసింహునిఁ జేరి, "అభయా! మేమిపుడు నగరమునకు వెడలుచుంటిమి. అజితసింహుని బుత్తెంచి విక్రమగడమున కేగియుండిన మన మైయారులందఱను బిలువనంపి కుమారమహేంద్రనరేశసింహుల జాడనరయుటకై పుత్తెంచెదము. నీవును వారిజాడ నరయుటకై నీయిచ్చవచ్చిన తావున కిపుడే బోయిర"మ్మని యాజ్ఞాపించెను.

అభయసింహుఁడు తన మైయారిసామానులతో నచటికి వచ్చియుండెనుగదా? ఇఁక తడవేమి కలదు? అతఁడా భూపాలునకును తన

జనకునకును మ్రొక్కిడి యొకవైపునకు దారిపట్టెను.

జగత్సింహభూపాలుఁడు తన పౌత్రుల వియోగమునకుఁ మదిగుందుచుఁదననేత్రములఁ గ్రమ్ముకొనియున్న యశ్రుజలంబులఁ జేరుమాలుతో నల్లన నొత్తుకొనుచుఁ, గుమారిగడమువైపునకుఁ బయలుదేరి కొంత తడవునకుఁ గోటయందుఁ బ్రవేశించెను.

కుమారమహేంద్రసింహులు లిరువురు రదృశ్యులైయిన సమాచారము కరుణాదేవిమహారాణికిని దెల్లమయ్యెను. పాపమామెయీ ప్రపంచమందలి సుఖదుఃఖములను బాగుగ ననుభవించి యుండెను. ఆమె పెల్లుగ విలపించుట కిచ్ఛగింపదు. అందువలన నామె కోమల హృదయంబున వేదనపుట్టి వచ్చును. ఆమె తనహృదయమును రాయిజేసికొని లోలోనఁ గుందుచుండెను. ఒకగడియ కాలములోనే యామె రూపము మాఱిపోయెను. సౌదామిని సరోజినులకుఁ గరుణాదేవియందెంత ప్రేమగలదో మాపాఠకమహాశయులు బాగుగ నెఱింగియున్నారు. దాని నిచట వర్ణించు టనావశ్యకము. రాకుమారు లిరువు రదృశ్యులగుటవలన గలిగిన విచారము కరుణాదేవికంటె వారి కధికమాయెను. తుదకుఁ దాము స్వయముగ నా రాకుమారుల జాడ నరయ నేగుటకుఁ గృతనిశ్చయులై యుండిరి.

జగత్సింహభూపాలుని యాగమన సమాచారమునాలించి విజయేంద్రసింహమహారాజు వాని యంతికమున కేగెను. మోహనసింహుఁడును వానివెంట గలఁడు. జగత్సింహభూపాలుఁడు పట్టరాని దుఃఖమున గన్నుల నీరుగార్చుచు, విజయేంద్రసింహుని యెదుట సకల వృత్తాంతములు మోహనసింహునితోఁ జెప్పి, "మనమిపుడేమి సేయువలయు"నని ప్రశ్నించెను.

మోహన:—తొలుత నే నాయడవియందు లభించియుండిన శవమును జూడగోరుచుంటిని.

జగత్సిం:— మంచిది. నీవు దానిని దప్పక దిలకింపుము.

అర్జున:—(చోబుదారునితో) ఆయడవియందు దొరికిన శవము ని చటికి గొనితెచ్చుటకు సేవకుల కెఱింగింపుము.

"చిత్త" మని పలికి యాచోబుదారుఁడు వెడలెనుగాని, శీఘ్ర కాలములోనే మగిడివచ్చి, "ప్రభూ! భూపాలుని వెంటఁగొనితేబడిన శవము మార్గమధ్యమందెచట మాయమయ్యెనో తెలియరాకున్నది. పలువురు పలుతెఱంగులఁ బ్రయత్నించి చూచిరికాని, దానిజాడ తెలి యకుండెనని" విన్నవించుకొనెను.

విజయేం:—మనము జాగరూకులమయి ప్రవర్తించు సమయము మర ల సంభవించినది. వేయిమంది జనుల మధ్య గొనితేబడుచు న్న శవమెపుడు మాయమాయెనో యిపుడింకను గొన్ని యుత్పాతములు పుట్టనై యుండెననుట నిశ్చయము.

అర్జున:—నా మిగిలియున్న యాయుఃపరిమాణము విశ్రాంతితో గడు పనెంచితిని. కాని యది కేవలము యవివేకము. అట్టి వి శ్వాస మెవరు దేనియందు నునుపరాదు.

జగత్సిం:—మంచిది. ఏమికానున్నదో కాంచెదముగదా? మనమిపు డేమి యొనరింపవలయునో దానిని యోజింపుము.

అర్జున:—పండితజగన్నాథుఁడు మున్నగువారలు రజితేంద్రసింహుని బందిగమునుండి విడిపించి యచట నేకార్యాచరణము నందే నియుఁ జిక్కియుందురేమో యని తలంచి,వారినిచటికి బిలి చికొని వచ్చుట కజితసింహుని విక్రమగడమునకుఁ బుత్తెంచు టకు యోజించుచుంటిని. కాని యిపుడటు లొనరించుటకు నామానసం బొప్పకున్నది. నేఁటికి తాళుఁడు. నేను బాగు గ యోజించి రేపటిదినమున నాయభిప్రాయమును వెల్లడిం తును.

వార లివ్విధంబున సంభాషించుకొని యాసభను ముగించిరి.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

పండితజగన్నాధవిఠ్ఠలరమేశజాలిమయోగీంద్రనాధులు రజతేంద్రసింహామైయారుని బందిగమునుండి విడిపించి తెచ్చుటకు విక్రమగడము వైపునకు బయలుదేరిరి. కుమారమహేంద్రిన శేశసింహుల యాజ్ఞానుసారము సేనాధిపతి యమేరుసింహుఁ డాసాధుపుంగవుని వెనుక గూఢచారులను బుత్తెంచి, రజతేంద్రసింహుఁడు విక్రిమగడమునకుఁ గొనిపోబడిన సమాచారమును వారివలన దెలిసికొనియుండెను. అందువలన రజతేంద్రసింహుని జాడనరయఁ బండితజగన్నాధుఁడు మున్నుగువారి కెట్టి యావశ్యకమును గలుగదాయెను. వారలు సరాసరిగ విక్రిమగడము వైపునకు బయలుదేరి మఱుసటిదినము సాయంకాలసమయమున కానగరమును జేరుకొనిరి. నగరబహిఃప్రదేశమందు వారలొక సంకేతస్థానము నేర్పఱుచుకొని యారేయియంతయు నందు గడపిరి. తెల్లవారినతోడనే తమ రూపములను మార్చుకొని వేర్వేఱు మార్గంబుల నాప్రోలునందుఁ బ్రవేశించిరి.

ఆమైయ్యారు లైదుగురు బగలంతయు నావీడునందు విచ్చలవిడి సంచరించుచు, రజతేంద్రసింహుని బంధించియుంచిన తావును దమ నేర్పుపెంపున నెఱింగి, రాత్రికాలంబున దమ సంకేతస్థానంబున నందఱు గూడుకొనిరి. వారలా రాత్రియంతయుఁదాము గావింపవలసిన కార్యాచరణములను నిర్ణయించుకొనుటయందుఁ గడపిరి. తెల్లవాఱినతోడనే నిత్యకృత్యములను నిర్వర్తించుకొని కొంత భుజించి తమ రూపములను మార్చుకొనిరి. వారిలో విఠ్ఠలజాలిమసింహులు తమ రూపంబుల నచటి

చోబుదారులవలె సవరించుకొని రజితేంద్రసింహుఁడు బంధింపబడియున్న కారాగృహము చెంతకుఁ బోయి చేరిరి.

రజితేంద్రసింహుఁడు కొన్నిదినములనుండి బంధింపఁబడియుండుటచేఁ దన్ను వెల్లడించుకొనియుండెను. అతఁడు తన నిజరూపమున నొక గదియందు బంధింపఁబడియుండెను. ఆగదికి మూఁడు తట్టుల ప్రాకారములును నాల్గవవైపున నినుపగజములతో నమర్చబడిన ద్వారమును గలవు. ఆగదిని జేరి యట్టివిధంబగు గది మఱియొకటిగలదు. దానియందొక వృద్ధకర్మచారి యొకకుర్చీలోఁ గూర్చుండియుండెను. ఆగదులకు ముందుఁ గొందఱు సిపాయిలు విచ్చుకత్తులను జేతధరించి యిటునటుఁ సంచరించుచుఁ గావలికాయుచుండిరి. అంత విఠ్ఠలజాలిమసింహులా వృద్ధుఁడు కూర్చుండియుండిన ద్వారము నొద్దకేగి వానితో నిటుల సంభాషింపఁ దొడంగిరి.

విఠ్ఠలు:—అయ్యా! భూపాలుఁడు మిమ్ములను బిలుచుచున్నారు.

వృద్ధుఁ:—ఎందులకు? పనియేమి? మంచిది. లోనికివచ్చి కూర్చుండుఁడు. పోవుదము.

విఠ్ఠలజాలిమసింహులా గదిలోనికిఁ బోయి కూర్చుండిరి. పిదప విఠ్ఠలుఁడు వానితో, "కార్యమెద్దియో మాకు తెలియదు. మిమ్మ వెంటనే తోడ్కొని రమ్మని మాత్రము దెలిపియుండిరి"అనెను.

వృద్ధుఁడు:—ఇంతకుఁ బూర్వమొకఁ డరుదెంచి భూపాలుఁడు స్వయముగ నిచటికి రానైయుండెనని తెలిపిపోయెనుగదా?

విఠ్ఠలుఁ: — అయ్యదియు నిక్కువమే. కాని, వారిపు డిచటి కరుదేరరు.

వృద్ధుఁడు:—అటులయిన మీరిరువురు నిచటఁ గూర్చుండియుండుఁడు. నేను పోయివచ్చెదను.

విఠ్ఠలుఁడు:—చిత్తమటులనే,

పిదప నావృద్ధుఁ డచటినుండి లేచి వెలుపల కేగి యాద్వారము

ను బంధించి, "ఓ విద్రోహులారా! మీరిరువురైయారులని నేనెంత సూక్ష్మముగ దెలిసికొనఁగలిగితినో చూడుఁడు. నేనూఱక యే భూపాలుఁడిచటికి రానై యుండెఁగదా యని పలికితిని. మీరు వెంటనే యయ్యది నిక్కువమే కాని వారిపుడిచటి కరుదేరరని వచియించియుంటిరి. మీరిట్టి చతురతతోడనే మైయారితనము గావించుచుంటిరా? సిగ్గు! సిగ్గు!! మీకు తన సామర్థ్యము జూపుటకే మైయారశేఖరుఁడగు యీ బాకరల్లీ కారాగృహాధ్యక్షుని రూపంబున నిచటఁ గూర్చుండియుండెనని యిపుడైన నెఱుంగుఁడు. ఏమి! మీరిపుడు నావలన బంధింపఁబడితిరా లేదా? దానిని వచియింపుఁ" డనెను.

వాని పలుకుల నాలించి వికలజాలిమసింహులు లజ్జావశీభూతులయి, శిరములను వంచుకొనిరి. ఆవృద్ధకారాగృహాధ్యక్షుఁ డమితానందంబున బెల్లుబ్బుచు విక్రమసింహభూపాలుని యంతికమునకేగి యామైయారులను వంచించిన విధంబంతయు వానికెఱింగించెను. ఆభూపాలుఁడానందపరవశుఁడై వాని నేర్పరితనంబును దద్దయు శ్లాఘించుచు వానికిఁ గొంతధనము బారితోషికముగ నొసంగెను. మఱియు నాతఁడా వికలజాలిమసింహులను దిలకించుటకుఁ గారాగృహమునొద్ద కేగెను.

పండితజగన్నాథయోగీంద్రరమేశసింహులు తమ యనుచరు లిరువురు బంధింపఁబడుట నెఱింగి విషణ్ణహృదయులై యొకతావున గూర్చుండి వారిని విడిపించుటకుఁ దగు నుపాయములను యోజింపఁ దొడంగిరి.

కొంతసేయి గతించిన పిదప నామైయారులు ముప్వురు నానగరము వెలుపలకుఁ బోవుచుండిరి. అంత నొకఁడు నల్లని దుస్తులతో మేనెల్ల మఱుగుపఱచుకొని పరువువాఱుచు వారి సమీపమునకేతెంచి, యొక మడిచియున్న కాగితము వారిముందు విసరివైచెను. మఱియు దన వెంట నరుదెంచుటకుఁ జేతితో సన్నజేయుచు ముందునకుఁ వెడలి

పోయెను.

పండితజగన్నాథుఁ డాకాగితమును దీసికొని సమీపమున నొక యంగడియందు వెలుతురునిచ్చుచుండిన దీపపుప్రకాశమందు దానిని జదువుకొనెను. దానియందు "రజితేంద్రసింహుఁ" డని మాత్రము వ్రాయఁబడియుండెను. ఆవ్రాఁత రజితేంద్రసింహునిదిగ జగన్నాథుఁడు గుర్తించి యాతఁ డేయుపాయాంతరముననో బంధివిముక్తుఁడయి పారిపోయి వచ్చుచున్నాఁడని తెలిసికొనెను.

రజితేంద్రసింహుఁ డటులా కాగితమును వారి ముందు విసరివైచి సంజ్ఞాపూర్వకముగ వారిని బిలుచుచు, బది యడుగులు ముందున కేగి వారి రాకకై ప్రతీక్షించుచు నచట నిలిచియుండెను

పండితజగన్నాథుఁడు మున్నగువార లతిప్రమోదభరితులయి నల్లని దుస్తులను గప్పుకొని మార్గముప్రక్క నిలిచియున్న రజితేంద్రసింహుని సమీపించిరి. వారు సంభాషించుటకు వీలు చిక్కదాయెను. మున్ముందు రజితేంద్రసింహుఁడును వాని వెనుక బండితజగన్నాథయోగీంద్రరమేశచంద్రులును సత్వరముగ నడుచుచు నాపట్టణము వెలుపల కేగిరి.

---

నలుదెసలఁ గాఱుచీఁకటులు దట్టముగ గ్రమ్మియుండెను. వారలు మైదానమందుఁ బ్రవేశించిన తోడనే రజితేంద్రసింహుఁ డానల్లని దుస్తులను దీసివైచెను. తారకముల ప్రకాశమం దారజితేంద్రసింహుని గుర్తించి సంతోషాయితచిత్తులయి పండిత జగన్నాథుఁడు మున్నగువారలొకరి వెనుక నొకరు వానిని గౌగలించుకొనిరి. మఱియు నొక శిలాఫలకముపైఁ గూర్చుండి యివ్విధంబున సంభాషింపఁ దొడంగిరి.

జగన్నా:—రజితేంద్రసింహా! నీవెటుల బంధివిముక్తుఁడవయి రాగలిగితివి? నిన్ను గాంచుటవలన మాకమితానంద ముదయించుచున్నది.

రజితేం:—నే నెట్టెటులంగుననో యాబందిగమునుండి తప్పించుకొని వచ్చితిని. కాని, విఠ్ఠల జాలిమసింహులు వారిచేఁ జిక్కియుండిరి.

యోగీంద్ర:—ఔను. వారిరువురును బంధింపఁబడి యుండిరి.

రజితేం:—నేను వారిని విడిపించుటకుఁ బ్రయత్నించుచుంటిని.

రమేశ:—ఎటుల?

రజితేం:—ఆవృత్తాంతములన్నియుఁ జెప్పుటకు నాలించుటకిది కాదు. జాలరాత్రిగలదు. నే నిపుడు మిక్కిలి యాఁకొని యున్నాను. మీయొద్ద భుజించుట కేపదార్థములయినను న్నయెడల వాని నాకొసంగుఁడు.

జగన్నా:—మాయొద్ద రెండుమూఁడు పూరీలుమాత్రము గలవు. అవి నీకొసంగెదము. భుజింపుము.

రజితేం:—రెండుమూఁడు పూరీలవలన నేమి కాగలదు. మంచిది. జలమునైనను గొంత యొసంగుఁడు.

జగన్నా:—అదియును లేదు. అటులయిన మన మిపుడేమి సేయవలయును?

రజితేం:—(చేతితోఁ జూపుము) అటు చూడుఁడు. ఆవెలుతురొక యంగడి యందలి దీపప్రకాశము. నేనిటకరుదెంచుచు దానిని గాంచియుంటిని. అదియొక మిఠాయి యంగడి. అచట మనకుఁ గావలసిన పదార్థములు లభింపఁగలవు. జలమును దొరకఁగలదు.

రమేశ:—మంచిది. నేవెడలి మనకుఁ గావలసిన పదార్థములను గొని తెచ్చెదను.

రజితేం:—మేమును నీవెంట నేతెంతుము. మన మందఱము గూడి యుండుటయే మంచిది. నీవు వెడలి దైవికముగ నెవరివలననైన బంధింపఁబడినచో, నీరాఁకకై మేమెదురు చూచు

చుందుము.

రమేశ:— బంధింపఁ బడుటొక యాటయయ్యెనా?

రజితే:— ఇందుఁ జెఱుపేమి కలదు? మన మందఱము గలసిపోవుదము. ఒకరు దుకాణము నొద్దకుఁ బోయి మనకుఁ గావలసిన పదార్థములను గొనవచ్చును. తక్కినవారు కొంతదవ్వున నిలిచియుండ నగును.

జగన్నా:— ఔను. బాగుగనున్నది. పదుఁడు. మన మందఱము గలిసి పోవుదమని పలికి లేచి నిలిచెను.

అమ్మెయారులు నల్వురచటనుండి బయలుదేరి నగరము వెలులనున్న మిఠాయియంగడి నొద్దకుఁ బోయి చేరిరి. పండితజగన్నాథయోగీంద్రరజితేంద్రసింహులా మిఠాయియంగడికి కొలఁది దవ్వున మార్గము ప్రక్కను నిల్చియుండిరి. రమేశసింహుఁడు దమకుఁ గావలసిన వానిని గొని తెచ్చుట కా యంగడిలోని కేగెను. అతఁడు వెడలునపుడు రజితేంద్రసింహుఁడు వానితో, రమేశసింహా! మిఠాయితోపాటు జలము సంగుటకును మొదట వానితో మాట్లాడుకొనుము. అటుకానిచో, పిదప నతఁడు తగవుపెట్టఁ గలఁడు" అని చెప్పియుండెను.

రమేశసింహుఁ డటులా యంగడిలోని కేగి రెండు శేర్లు పూరీలను నొక శేరు హల్వాయును గోరెను. అంత నా యంగడివాఁడు వానితో "మీకు జలముగూడ గావలసి యుండెనా" యని ప్రశ్నించెను.

రమేశ:— ఔను. మాకు ముఖ్యముగ జలము గావలసియున్నది.

అంగడివాఁడు:— పాత్రను గొని తెచ్చితివా?

రమేశ:— నాయొద్ద నొకటి కలదు. కాని, యది మిగులఁ జిన్నది. నీ వొక కడవయందు జలమును నింపి యొసంగుము.

అంగడివాఁడు:— ఒక కడవెడు జలమున కెనిమిది అణా లొసంగవలసి యుండును.

రమేశ:—ఇంతటి యన్యాయమా! కానిమ్ము. అటులనే యొసంగెదము

పిదప రమేశసింహుఁడు పూరీలు, హల్వా, జలములను దీసికొని యాయంగడివాని కీయవలసిన క్రయధనము వానికొసంగి తన యనుచరులతోఁ గలిసికొనెను. ఆమైయూరులు నల్వురు నచటినుండి తమ నెలవు వైపునకు బయలుదేరిరి. కాని, తమ వెనుకఁ గొంత దూరమున నాయంగడివాఁ డిరువురు మనుష్యులను వెంటఁగొని దాఁగుచు వచ్చుచుండిన సమాచారము వారిలో నొక్కరికైనను దెలియకుండెను.

వార లటులా నగరము వెలుపలనుండిన మైదానములోనికిఁ బోయి యొక శిలాఫలకమునఁ గూర్చుండిరి. పిదప వారంద ఱాపదార్థములను భుజించి జలమును గ్రోలిరి. వారు నిశ్చింతితులయి పరస్పరము సంభాషించు కొనఁదొడఁగిరి. ఒక యరగంటకాలము గడచి యుండును. అంత నా మైయూరులు నల్వురు మూర్ఛాగతులయి యా శిలాఫలకమునఁ బడిరి. ఆయంగడివాఁడును దన యనుచరులిరువురితోడ నచటికి వచ్చి చేరెను.

పిదప వారలా పండితజగన్నాథయోగీంద్రరమేశసింహులనుమూటలుగ గట్టియుంచిరి. మఱియు రజితేంద్రసింహున కెద్దియో వాసన జూపించి వానికి తేఁకువను గలిగించిరి. తదుపరి వారలా రజితేంద్రసింహునితో, "వహ్వా! అచ్యుతసింహుఁడా! నీవతినేర్పున గార్యములను నిర్వహించియుంటివి. కుమారిగడమునుండి యరుదెంచి యుండిన మైయూరు లైదుగురును మనవలన బంధింపఁబడియుండిరికదా? భూపాలునివలన నధిక పారితోషికమును బడయు కార్యమును నీవే యొనరించియుంటి" వని వానిని బొగడ సాగిరి.

---

# ఇరువదిరెండవ ప్రకరణము.



పెక్కుకష్టముల ననుభవించిన మీఁదట జగత్సింహవిజయేంద్ర సింహులును వారి కారణంబున గరుణాదేవి సౌదామిని సరోజినులును అర్జునాభయమోహనసింహులు మున్నగు వారలును గొంత కాల మతిముదంబున సమస్తసుఖములను జూరగొనియుండిరి. కాని, యిపుడు వారికా సుఖదినంబులు తొలఁగిపోయినవి. నిక్కువము! ఈసంసార ప్రపంచమందలి మానవకోటిపై సుఖదుఃఖములను పహరా నిరంతరము మాఱుచుండును. సుఖదినంబులు మిక్కిలి తేలికగ మాటలాడునంతలో గడచిపోయినటుల దోఁచును. కాని, కష్టదినంబులంత సులువుగాఁ గడువఁజాలవు. ఇంతదనుక మాకును వారి విషయమున లిఖించుటకు యోగ్యమైన వృత్తాంతములెవ్వియు లభించియుండలేదు. కాని యిపుడు వారి కష్టదినములు గడచుట దుర్లభమగుచున్నవి. పరాజితుఁడయిన విక్రమసింహుఁ డగ్నిశిఖవలె మరల విజృంభించునని యెవరెఱుంగుదురు? కరుణాదేవి యొడియందుఁ బెఱిగిన యాసుకుమారకుమారులిటుల దృశ్యులయి యామెకు దురంతవియోగసంతాపమును గూర్తురని యెవరూహింపగలరు? వారి వంశమందును రాజ్యమందును నెలకొనియుండిన సంతోషాతిశయంబులు డిందువడి కాకతాళీయముగ నాపదలు వచ్చిపడునని యెవరు తలంచగలరు? సుఖమనుభవించువారలే యాపదలనుగూడ ననుభవింపవలసి యుండెను. మంచిది! ఇపుడేమి కానున్నదో కాంతుము గదా? ఇపుడెల్లరి మానసంబులు సంక్షుభితములై యుండెను. తన యేకాంతమందిరమున జగత్సింహ భూపాలుఁడు దురంతచింతాక్రాంతచిత్తుఁడై యొకగద్దియపై గూర్చుండియుండెను. వానికి వామపార్శ్వమున విజయేంద్రసింహుఁ డాగద్దియకోణముపై చేయినానుకొని తనయెదుట కూర్చుండియుండిన అర్జునసింహుని వైపునకు వ్యగ్రతాపూర్వకంబుగ నవ

లోకించుచుండెను. మోహనాజితసింహులు తమ సమీపమున బైతరగ తియందుఁ గూర్చుండియున్న వృద్ధుఁడును గురుతుల్యుఁడునగు యర్జున సింహుని వైపున కొఱగి యాతఁడేమి యాజ్ఞాపించునో యని ప్రతీక్షిం చుచుండిరి. పైన వివరింపఁబడినవారుదక్క నితరులెవ్వరు నామందిరము న లేరు. ఇపుడా మందిరమున నిస్తబ్ధత వ్యాపించియుండెను. ఇంతకుఁ బూర్వము వారలేమి ప్రసంగించియుండిరో మనకు తెలియదు. అంత జగత్సింహభూపాలుఁడు వారితో, "మంచిది! సౌదామిని సరోజినుల వ చనములనుగూడ మనము మన్నింపవలసియున్న" దని పలికి యానిస్తబ్ధ తను భంగపఱచెను.

అర్జున?—మీ చిత్తము. కాని, మోహనసింహునకుఁ దామేమి శాసిం చుచున్నారు?

జగత్సి:—మఱియేమియును లేదు. ఈకుమారిగడ సంరక్షణ విషయ మున మాత్రము కొంత చింతగలదు.

అర్జున:—ఇచటి జాగ్రత్తకై అజితసింహుఁడు సరిపడునని నాతలంపు. మఱియు సమయము ననుసరించి నేనీ వృద్ధాప్యమందుఁ గూ డ గొంత సేయగలను.

జగత్సిం:—(మందహాసవదనుఁడయి విశ్వాసపూరితేక్షణంబుల యర్జున సింహుని వైపునకుఁ బరికించుచు) మంచిది. నీకుచితమని తోచిన విధంబునఁ జేయుము.

అర్జున:—(మోహనసింహునితో) నీయభీప్సితమును దీర్చుకొను సమ య మాసన్నమైనది. నీవేమి కావించి తెచ్చెదవో కాంతు ముగదా? భగవంతుఁడు నీకన్ని విధంబుల దోడ్పడుచుండఁ గలఁడు.

ఇవ్వచనంబుల నాలించినంతనే మోహనసింహుఁడు లేచి నిలిచి భూపాలురకును నర్జునసింహునకును మ్రొక్కులిడి వెలుపలకు వెడలెను

## ఇరువదిమూఁడవ ప్రకరణము.



కుమారనరేశసింహుఁడు తన సహోదరుని యెడబాటునకు మదిఁగుందుచు, వ్యాకులచిత్తుఁడయి యాయడవి దాఁటి మైదానమందు బ్రవేశించెను. మఱియు నచట నిలిచి యిటునటు దృష్టిఁ బ్రసరింపఁజేసి చూడఁ దొడంగెను.

ప్రాగ్దిశయం దిరువురు స్త్రీలు తురంగములపై నధిరోహించి పోవుచుండుట వానికి జూపట్టెను. అంత నతఁడా యిరువురు స్త్రీలను గలిసికొను తలంపుతో ద్వరితగమనంబున రెండుక్రోశుల దవ్వువఱకు వారి వెన్నంటిబోయెనుగాని, ఫలితము గలుగదాయెను. ఆవనిత లిరువురిం తదనుక నిశ్చింతతో దమ మార్గమును వెనుకవైచుచు బోవుచుండిరి. వారలొక పర్వత నిమ్నప్రదేశమునకుఁ జేరి యచట నిలిచిరి. మఱియుఁ గుమారనరేశసింహుఁడు తమవెన్నంటి వచ్చుచుండుటను గాంచి తమ యశ్వములను వాయువేగమున బర్వెత్తించుచు నాపర్వతము ప్రక్కకు మరలి యదృశ్యులైరి.

ఆదినము శుక్లపక్షములోని దగుట లేఁజందురుని వెన్నెలయందా యిరువురు స్త్రీలను గాంచి, మన కుమారనరేశసింహుఁ డాకాంతల వెన్నంటి పోదొడంగెను గాని, వారలటు లదృశ్యులగుటఁ గని యమిత చింతావిహ్వల చిత్తుఁడయి యిపుడేమి సేయవలయునని దీర్ఘాలోచనాపరుండై యచట నిలిచెను. వాని నట్టిస్థితియందు విడచి నిర్దయస్వాంతుండై శశాంకుఁడు నెమ్మదినెమ్మదిగా తన నిలయము వైపునకు దారిపట్టెను. తన ఘోరశత్రువగు అమృతాంశుఁడు వెడలుటఁ గని యంధకార మమితోత్సాహముతో నలుదెసలనుండి తన యధికారమును విస్తరింపఁ జేసికొనెను.

అకటా! నేనిపుడేమి సేయుదును? నాప్రియ సోదరుఁ డెచటికేగి

యుండినదియు నీయంధకారమం దెటుల తెలిసికొనఁ జాలుదును? ఎవరిని ప్రశ్నింతు" నని కొందలమంద సాగెను. అంతఁ గొంతదూరమున వానికొక ప్రకాశము జూపట్టెను. అతఁడా వైపునకు బాగుగ దృష్టిని గుడించి చూచుటవల్ల నాప్రకాశ మొక కుటీరము యెదుట మండుచున్న యగ్నిజ్వాలలని యాతఁ డెఱింగెను. పిదప నాకుమారనరేశసింహుఁడావైపునకు బయలుదేరి స్వల్పకాలములో నచటికిబోయి చేరెను. పచ్చని యాకులతో నిర్మింపఁబడిన యొక కుటీరము ముందు పదివన్నిద్దరు పురుషులొక రత్నకంబళముపయి నాసీనులయియుండిరి. దీర్ఘముగ పెఱిగియుండిన వారి గడ్డములును దుస్తులును వారు తురుష్కులని చెప్పకయే చెప్పుచుండెను. వారి మధ్య రెండు మైనపుదివ్వెలు వెలుతురు నిచ్చుచుండెను. వారిలో నొకఁడు పారసిపద్యములను జదువుచుండెను. తక్కిన వారందఱు వాని పఠనకౌశల్యమున కమితానందభరితులై "వహ్వా! వహ్వా!!" యనుచు వానిని బొగడుచుండిరి. ఒకవైపున నిరువురు పురుషులు భోజనపదార్థములను బచనము గావించుచుండిరి. కుమారనరేశసింహుఁడు వారిని సమీపించి యచట నిలిచెను.

వారలా కుమారనరేశసింహుని గాంచినంతనే లేచినిలిచి యధికసన్మాన పూర్వకంబుగ వాని నారత్నకంబళముపై సుఖాసీనునిగ నొనరించిరి. పిదప బద్యములను జదువుచుండిన యాతురుష్కుఁడు వారిమధ్యను నిలిచి, "సోదరులారా! నేఁడు మనకు సుదినము. కుమారిగడాధీశుఁడగు విజయేంద్రసింహనరపాలుని కనిష్టపుత్రుఁడు నేఁడీ సభయందాసీనుఁడై యుంట మన మహద్భాగ్యముగఁ దలంపుఁడు. మఱియు మన గౌరవాదికములు* "ఫల్ కేహప్తుమ్" వఱకు జేరియున్నవని భావింపుఁడు. మనమీ యరణ్యంబున నిశీథసమయమున వారి నుచితరీతి

* మహమ్మదీయ గ్రంథమం దంతరిక్షము లేడు గలవని వర్ణింపబడియుండెను. ఆసప్తాకాశములలో నన్నిటికంటె పైన నుండిన దానిని ఫల్ కేహప్తుమ్" అని వ్యవహరింతురు.

ని సత్కరింపఁ జాలనందుల కెంతయుఁ జింతిల్లుచున్నాను. వారి పదసరోజములకు మన నేత్రములయందు స్థానమొసంగుటదక్క నితరమగు యేయుపచారములను మనమిపుడు గావింపఁజాల" మని పలుకుచు నత్తరుపేటికయు జాలవల్లికయు వాని ముందిడెను.

కుమారనరేశసింహుఁడా విద్యావ్యాసంగుల యాదరణను దిరస్కరించుట భావ్యముగాదని తలంచి యాఅత్తరుఫుల నాఘ్రాణించి రెండు లవంగములను దీసికొనెను. తదనంతర మాతురుష్కుఁడు రాకుమారుని యనుజ్ఞను వేఁడి మరలఁ బద్యములను జదువ నారంభించెను. ఒకఁడు రెండుమూఁడొఱుఁగు దిండ్లను నారాకుమారుని ప్రక్కనిడెను.

కుమారనరేశసింహుఁడా యొఱుఁగు దిండ్లను నానుకొని కూర్చుండియుండెను. ఆసుగంధతైలము లందెట్టి ప్రభావముగలదో తెలియజాలముగాని, క్రమముగా కుమారనరేశసింహునకు మైకము క్రమ్మసాగెను. కనురెప్పలు భారము వహించెను. తుద కతఁడు మూర్ఛాగతుఁడై యారత్నకంబళముపై నొఱిగెను. మఱునటి దినము పగలు రెండు జాముల కాతఁడు తనకన్నులఁ దెఱచెను. తానితరుల మందిరమున నపూర్వశోభాయమానంబగు నొక హంసతూలికాపర్యంకమున బవళించియుండుట నెఱింగి సంభ్రమాయత్తచిత్తుఁడగుచు లేచి కూర్చుండి నవయౌవనవతులగు కొందఱు వనితామణులు తన యెట్టెదుట నిలిచియుండుటఁ గనుఁగొనెను. ఆయువతీమణులలో నాయికయగు నొకసౌందర్యరాశి మోహంపువీక్షణంబుల వాని వైపునకుఁ బరికించుచు నిలుచుండియుండెను. ఆమె రూపవయోవిలాసములను గాంచినంతనే మన కుమార నరేశసింహుఁడు మోహవిభ్రాంతమనస్కుఁడయ్యెను. ఆమె విశాలనేత్రములు, చారువదనము, అంగసౌష్ఠవము వానికి మైమఱుపును గలిగించెను. ఆమె వానిని సమీపించి, "మోహనాంగా! నీవు నాపై రుష్టుఁడవై యుంటివా" యని పలికెను.

నరేశసింహుఁడు తన సహోదరుని యెడబాటును గతరాత్రి తానా తురుష్కులవలన వంచింపఁబడిన విషయమును విస్మృతిజెంది ప్రేమమదోన్మత్తుఁడయి యామెతో, "శోభనాంగీ! నినుబోలు గూప మాధుర్యవయోవిలాసవతి నెందుఁగాననైతి" ననెను:

అంత నాసుందరాంగి దరహాసచంద్రికలు మోమున దోనుకాడు చుండ వాని ప్రక్క నాసీనయై తన బాహువల్లరి నల్లన వాని కంఠము నవైచి తన యమృతంపు పలుకులతో "మనోహరా! నాహృదయ ఫలకమున భవదీయసుందరాకృతి గాఢముగ నాటుకొనియున్నది. నే ను నీప్రేమపాశమున జిక్కి దాదాపొక వత్సరము గతించియున్నది నే నప్పటినుండియు నిద్ర బడయు వెరవుల నెనుకుచు మోహవిభ్రాం తచిత్తనై కొందలమందుచుంటిని. అన్నపానీయంబుల రోసి భవదీయ విరహానలదందహ్యమానమానసనై సకల సుఖోపభోగంబుల ద్యజించి యింతదనుక నిరుపాయనై యుంటిని. నేటి కా యల్లా దయాకారణం బున నానేత్రపర్వంబుగ నినుఁ గాంచు భాగ్యమును బడయగలిగితిని. మనోహరా! ఇఁక తాళఁజాల. సహింపనోప. దయాంతరంగుఁడవై వే గమె నీయాశ్లేషసుఖంబు నొసంగి నన్ను ధన్యురాలినిగ నొనరింపు" మనెను.

నరేశు:—మగువా! నీ వల్లాను పేర్కొనుచున్నావు. ఏమి! నీవు తురు ష్కాంగనవు కావుగదా?

యువతి:—(మందస్మితవదనయై) ప్రియుఁడా! ఔను. నేను తురుష్కాం గనను. ఏమి! తురుష్కులు మానవులుగారా? నీవటులేల ప్రశ్నించుచుంటివి?

నరేశ:—ఆశ్చర్యము! నీవు తురుష్కాంగనవైతివి. కానిచో, యసమా న్యసౌందర్యసముజ్వలవగు నీకు నాప్రాణమనోధనంబుల న ర్పించియుందును. నిన్ను నాయర్థాంగినిగ జేకొనియుందును

యువతి:—(వాని కరము వనకేలు దమిన్మని గీలించి) మనోహరా! నీవిట్టి బెడిదంపు పలుకులను గట్టిపెట్టి నన్ను నీయురమునఁ జేర్చి బిగియాఁ గౌగలిమ్ము. నీవియోగమును భరింపఁజాల. నమ్ముము.

నరేశ:—సుందరాంగీ! నేనొక స్త్రీరత్నమును బడయుటకయి స్వమత విముఖుఁడను గాజాలను. నాయందలి కోర్కెను బూర్తిగ విడిచిపెట్టుము.

యువతి:—(కన్నులు నీరునింపుచు) ఏమి! మనోనాథా! నీవు నిక్కవముగనే పలుకుచుంటివియా? ఈపలుకులు నీయంతఃకరణమునుండి వెడలుచుండెనా?

నరేశ:—అంతియగాదు. శపథ పూర్వకంబుగ బలుకుచుంటిని.

యువతి:—(డగ్గుత్తికబడిన స్వరముతో) కందర్పసుందరాకారా! నన్ను చేబట్టుము. మన మిరువుర మన్యోన్యానురాగ బద్ధులమై సుఖార్ణవ వీచిడోలికల నూఁగాడుచు సకల భోగ భాగ్యంబుల సార్థకజన్ములమై హాయిగ జీవితములను గడుపగలము.

నరేశ:—(తన చేయి విడిపించుకొని) వనితామణీ! నీయట్టి కోరికను దిరస్కరించుచున్నాను.

యువతి:—ఏమి! నీవు వెడలి పోవుదువా?

నరేశ:—అవశ్యము.

యువతి:—సాధ్యమా?

నరేశ:—అసాధ్యమా?

యువతి:—(దురంతశోకాకుల వికారవదనయై) అట్టితలంపును వీడుము.

"నన్నెవరు నిలిపెదరో కాంచెదగాక" యని నరేశసింహుఁడా గదినుండి వెలుపల కేగెను. కానిమ్ము. మరలమరలఁ బ్రయత్నించి

చూచెదనుగాక" యని తలఁచి యాసుందరీమణియు దన చెలిమికత్తెల
ను వెంటఁగొని దుర్భరవిషాదానల సంతప్తహృదయమైయాగదియందుఁ
గల వాతాయనమార్గమున వెడలిపోయెను.

కుమారనరేశసింహుఁడు నలువైపుల సంచరించుచు వెలుపలకు
బోవు మార్గమునకై వెదకసాగెను. కాని, వాని కందెచటను మార్గము
జూపట్టదయ్యెను.

ఆమందిరమంత పెద్దదిగాదు. దానియందొక గదియు నొక వ
సారామాత్రము గలవు. దానికి నలువైపులఁగల ప్రాకారములు మిగు
ల నెత్తుగనుండి వెలుపలకేగు మార్గము లేకుండనుండెను. కుమారనరే
శసింహుఁ డన్నివిధంబుల నిరుపాయుఁడై చింతాక్రాంతచిత్తుఁడగుచు
మరల నామందిరములోని కేతెంచి యాపర్యంకముపయి మేనువాల్చి
యోజనాపరంపరల నిమగ్నమానసుఁడయ్యెను.

"అకటా! నేనిపుడేమి సేయుదును? నేనామె నెటుల స్వీకరిం
పఁ జాలుదును? హరి! హరి!! తురుష్కాంగనతోడనా సాంగత్యము!
అటుల స్వప్నమందైనను గాఁజాలదు. ఎపుడు నాకిచటినుండి విముక్తి
లాభము గలుగదో యపుడు నానడికట్టునందలి కైదువ యెచటికి
బోవును?"

ఇవ్విధంబున బలుకుచు నాతఁ డాకైజారును వెడలింపఁ గోరె
ను. కాని, యది వాని నడికట్టునందుఁ జూపట్టదాయెను. అంత నతఁడు
దుర్వారదురాగ్రహపరిచలితగాత్రుఁడై, "అన్నా! ఆదురితాత్మురాలు
నన్నెంతగ గాఁటియ పెట్టుచున్నది? తుదకు నామొలయందలి కైదువ
నుగూడ లాగుకొని నన్నొక పనికిమాలినవానిగ జేసియుంచెనుగదా?
నాపగతుఁ డెవరైన నిటకరుదెంచిన నేనేమి సేయగలను? ఆదుష్టురాలు
మరల నాసమీపమున కరుదెంచిన దాని కుత్తుకను బిసికి దోరింపకుండు
నా? కాదుకాదు. నేనొక వీరపుత్రుఁడనైయుండియు నొకయబలమీఁద

నా నాప్రతాపమును జూపుట? అయ్యది నావలన గాఁజాలదు. అటులయి నక్షుత్పిపాసాపీడితుఁడనై మరణింపవలయునా? ఔను. నాకొకయుక్తి దోచుచున్నది. (ప్రాకారము వైపునకు గాంచుచు) ఈవాతయన మార్గముననేకదా యాయువతులు వెడలియుండిరి? మరల వారలిటకే తెంచిన బలాత్కారపూర్వకముగ నేనామార్గమునుండి వెలుపలకుఁ బోయెదనుగాక" యని కృతనిశ్చయుఁ డయ్యెను.

అతఁ డాపగలంతయు నాకలిదప్పికలతోడనే కడపెను. ఒక జామురాత్రి గతించిన పిదపఁ దటాలున నావాతాయన ద్వారము తెఱవబడెను. ఆయపూర్వలావణ్యవతియగు తురుష్కాంగన నలువురు పరిచారికలను వెంటగొని మగుడ నాగదిలోనికి వచ్చిచేరెను. ఒకపరిచారిక చేతియందు దివ్వెయు, రెండవదాని హస్తమందొక జలకలశమును మూఁడవదాని కరమందు వివిధభక్ష్యపదార్థములతో నింపఁబడిన వెండి పళ్లెరమును మఱియు నాల్గవ పరిచారిక చేతియం దత్తరుపేటికయు జాలవల్లికయుఁ గలవు.

ఆయువతీమణు లాగదియందుఁ బ్రవేశించిన తోడనే కుమారనరేశసింహుఁడు లేచినిలిచి, రయమున నాగవాక్షమార్గమున వెలుపలి కేగెను. ఆయువతులు వాని నెంతమాత్రము నిరోధించియుండలేదు. ఆగవాక్షమార్గమున వెడలిన మాత్రముననే వాని యభీప్సితము నెఱవేఱఁ జాలదని వారు బాగుగ నెఱింగియుండిరి.

కుమారనరేశసింహుఁ డాగవాక్షమును దాఁటి వెలుపల కేగెను. కాని, యచట నంధకారము దట్టముగ వ్యాపించియుండెను. ఆతఁడచట తడవులాడుచు నలువైపులఁ జుట్టిచూచెను. వాని కేచటను మార్గము లభింపదాయెను. ఆస్థానమున నొక ద్వారము మాత్రము వానికి బొడకట్టెను. దానిని దెఱచుట కతఁడు పెక్కుభంగుల బ్రయత్నించి చెక్కుచెమర్చెనుగాని, లాభమిసుమంతయుఁ గలుగదాయె

ను. తుదకతఁడు విఫలమనోరథుఁడై మగుడ నాగదిలోనికిఁ బోయి చేరెను.

అంత నాతురుష్కాంగన మందస్మితవదనయై నిజమృదుమధురాలాపంబుల వానితో, "మోహనాంగా! నీవిచటినుండి వెడలఁజాలవని తొలుతనే తెలిపియుంటినికదా? దయామయుండగు పరాత్పరుఁడు నాకొఱకు నిన్ను సృజించియుండెను. కాని, ఆశ్చర్యము! నీవు నావైపునకుఁ గన్నెత్తియైనను వీక్షింపకున్నావు. ప్రాణప్రియుఁడా! వ్యర్థముగ నాకలిదప్పికల బ్రాణముల నేల కోల్పోయెదవు? రమ్ము.—కూర్చుండుము.—భుజింపుము.—క్రోలుము. నన్ను నీయక్కునఁ జేర్చి కామసుఖంబుల దనియింపఁ జేయుము. జాగుసేయకుము" అనెను.

నరేశ:—పొలఁతీ! మీరు తాఁకిన పదార్థములను నేనెటుల భుజింపఁగలను?

యువతి:—సుందరాకారా! నీవిటులేల పలుకుచుంటివి? భగవంతుఁ డెల్లరకు నొక్కఁడేకదా? ఆతఁడే నిన్నును నన్నును సృజించియున్నాఁడు. మన మెల్లర మొక జనకుని సంతతివారమై యుండ నీయంటరానితన మెచటనుండి వచ్చినది?

నరేశ:—(అసూయతతో) భగవంతుఁ డేనుఁగులను సృజించియుండెను. గార్ధబములను సృష్టించియుండెను. శునకములను బుట్టించెను. సూకరములను గల్పించియుండెను. అటులనే మానవజాతియందును బెక్కు జాతులు గలవు.

యువతి:— మోహనాంగుఁడా! నీతో వాగ్వివాదమునకు గడంగుట నాకు సమ్మతముగాదు. నన్ను చేబట్టిన సర్వవిధసుఖంబులఁ జూరకొనఁగలవు. నాపలుకులను మన్నించి దయాన్విత హృదయుఁడవై నీకృపాకలితేక్షణంబులు నాపైఁ బ్రసరింపఁ జేసి నన్ను కృతార్థురాలినిగ నొనరింపుము. కానిచో, పిద

పఁ బశ్చాత్తాపము నొందకమానవు. ఆకలి దప్పికలఁ బ్రాణముల బాయుట కొంచెము కఠిన విషయము. తుదకు వివశుఁడనై నేను వచియించినటు లొనరింపవలసియే యుండును. లెమ్మ్! నేవెడలుచుంటి" నని పలికెను.

తాము గొనితెచ్చియుండిన పదార్థము లచట నునిచి యాపరిచారికలు గవాక్షమార్గమున వెలుపలకు వెడలిరి.

"ఎపుడా తురుష్కాంగన యీగవాక్షమందుఁ బ్రవేశించునో యపుడు నేనుకూడ బలాత్కారపూర్వకంబుగ నామె వెన్నంటి వెలుపల కేగుటకుఁ బ్రయత్నించెదను. అటుల సాధ్యముగానిచో, యామెయు వెలుపలకు వెడలకుండ నిచట నిలిపియుంచెదనుగాక" యని కుమారనరేశసింహుఁడు తన యుల్లంబున నిశ్చయించుకొని యుండెను. కాని, తుదకటుల కాఁజాలదయ్యెను.

ఆతురుష్కాంగన యల్లన నావాతాయనమును సమీపించి లోపలి వైపునకుఁ గాళ్లువ్రేలాడవైచుకొని కూర్చుండి వానితో సంభాషింప దొడంగెను.

యువతి:—నీవు నన్ను పరిణయమాడకుండినను సరియే! నిన్ను నేప్రేమించి యుంటిని. అటులనే నీవుకూడ నాయందుఁ బ్రేముడి గలిగియుందుము.

నరేశ:—అటులెన్నటికి గాఁజాలదు.

యువతి:—(చేతితోఁ జూపుచు) పోనిమ్మ్. నీవెనుక నిలిచియున్న యూహిందూయువతినైనను బరిణయం బాడెదవా?

"నా వెనుక కితరస్త్రీ యెటుల రాగలిగె"నని యబ్బురపడుచుఁ గుమారనరేశసింహుఁడు వెనుకకు మరలి కాంచెను. తరుణమును గని యాతురుష్కాంగన రయమున వెలుపలి వైపునకుఱికి యాగవాక్షద్వారమును బంధించివైచెను.

ఆమాయలమారి టక్కరిపలుకులకుఁ జిక్కి కుమారనరేశసింహుఁడు బాగుగ వంచింపఁబడెను. అతఁడు విచలితధైర్యుఁడయి—నిరుపాయుఁడై—మగుడ పర్యంకమును జేరి యందుఁ గూర్చుండెను. క్షుత్పిపాసలు వానిని మిక్కుటముగ వేధించుచుండెను. వాని కవి దుర్భరమగుచుండెను. భోజనపదార్థములును జలమును నచటఁ గలవు. కాని, యవి విషముకన్న నెన్నిమడుంగులో చెడుగా వానికి దోఁచుచుండెను. ఇఁకను ప్రాణములు నిల్చుట యసంభవమని వానికి దోఁచెను. అతఁడు దుర్భరవిషణ్ణహృదయుఁడై మాటిమాటికి లేచుచుఁ గూర్చుండుచు నిటునటు పచారము జేయుచుఁ బల్లెరమునఁ బోసిన పాదరసమువలెఁ దల్లడిల్లుచుండెను. అర్ధరాత్రమగుసరి కాతఁడు మిగుల నిర్బలుఁడై లేచుటకుఁ దిరుగుటకుఁ గూడ నసమర్థుఁడగుచుండెను. అతఁడు మరలఁ బర్యంకముపై మేనువాల్చి దీనజనశరణ్యుఁడగు రమాధవుని పవిత్రపాదపంకేరుహ స్మరణైకచిత్తుఁడయ్యెను. ఆహా! ఆదయామయుని మహామహిమలు వర్ణనాతీతములుగదా!

అంత నాకస్మికముగ మిద్దెపైనుండి యెవరో క్రిందికి దుమికినట్టుల సద్దువానికి వినిపించెను. కుమార నరేశసింహుఁడు విస్మయాతురచిత్తుఁడయి ద్వారము వైపునకు వీక్షింపసాగెను.

అంత నొకఁడా గదిలోనికిఁ బ్రవేశించి కుమారనరేశసింహుని సమీపమున కేతెంచి నిలిచెను. వాని వయస్సు దాదాపు నలుబది వత్సరములుండెను. అతఁడు సిపాయి దుస్తులను దొడిగి లలాటమున త్రిపుండ్రమును దిద్దుకొని కటిప్రదేశమునకై జారును వితంసముము బంధించి దోర్మూలంబునఁ గక్షపాలను ధరించియుండెను. వాని కరమందొక దుగ్ధపాత్రయుఁ గలదు. అతఁ డాకుమారనరేశసింహుని యుపలక్షించి “ఆశ్చర్యము! మీరు రాకుమారులైయుండియు నై దూరులు, చాపలభటులు, మున్నగువారలు గావించుటకు యోగ్యములగు కార్యాచరణ

ములందుఁ బ్రవేశించితిరి. దాని ఫలితమేమి కలిగెను? ఒకానొక దుష్టురాలిచేఁ జిక్కి పరిపరిభంగులఁ బరితపింపవలసి వచ్చెను. రాకుమారా! నీవాటక్కులాఁడి వలన నిందు బంధింపఁబడి యెన్నినాళ్ళనుండి నీసుకుమార శరీరమిటులఁ గాసిలఁ జేయుచుంటివి? నీవు సంభ్రమచిత్తుఁడవు గాకుము. నేను మీ మిత్రకోటిలోని వాఁడనుగాని శత్రువునుగాను." అనెను.

కుమారనరేశసింహుఁ డాసిపాయిని గాంచి, విస్మయాందోళిత మనస్కుఁడయి, యిట్టికుటిల సమయంబున నాప్రాణములను గాపాడవచ్చిన యీతఁడు నాశుభమును గాంక్షించు వాఁడనుట కెట్టి సంశయమును గలుగదని తన యుల్లంబున నిశ్చయించుకొనెను. కుమారనరేశసింహుఁడు వానితో:—

"నేనీ తురుష్కాంగనచేఁ జిక్కి నేఁటికి రెండు దినములాయెనని తలంచెదను."

"మీరప్పటినుండియు నేమైనను భుజించియుంటిరా?"

"లేదు."

"అకటా! అట్టి ప్రతాపోజ్వలయశోమండితుఁడగు విక్రమసింహపృథ్వీశుని ప్రియపుత్రునకా యిట్టి యగచాట్లు! రాకుమారా! నేను కొనితెచ్చిన పదార్థములను భుజించి కొంత యాఁకలి దీర్చుకొనుఁడు."

"నీవుత్తమకుల సంజాతుఁడవనియు, స్వధర్మ నిరతుఁడవనియు మొదట నేనెఱుంగవలసియున్నది. నన్ను వంచించి ధర్మభ్రష్టునిగఁ జేయదలంచుట లేదుకదా?

"కటకటా! ఎంతమాటాడితిరి? నేనట్టి పాపకర్ముఁడనుగాను. మీరా విషయమును స్వప్నమందైనను దలంపవలదు. మీరివ్విధంబున సంశయాకులచిత్తులగుదురని యెఱింగియుండియే మీరు భుజించుట కెట్టి యభ్యంతరము గలుఁగని పదార్థములనుకొనితెచ్చియుంటిని. ప

ర్యంకమును వీడి వెలుపలకు విచ్చేయుఁడు."

అంతఁ గుమారరవశేఖరసింహుఁడా శయ్యనుండి లేచి వెలుపలి వసారాలోనికి వానివెంట నేగెను. అపుడా సిపాయి తన చేతియందలి దుగ్ధపాత్రను భూమిపై నిడి తన కక్షపాలనుండి కొన్ని ఫలములను వెడలించి "రాకుమారా! ఈఫలములను భుజించి యీపాలను గ్రోలుఁడని" పలికెను.

ఇపుడు కుమారరవశేఖరసింహుని ప్రాణములు కుదుటఁబడెను. క్షుత్పిపాసాపీడనంబున వాని ప్రాణములు వెడలనైయుండెనుగదా? ఆతఁడా ఫలములను దుగ్ధమును గాంచినంతనే యమితానందభరితుఁడై వాని యుపకృతిని తన మనంబున దద్దయుఁ బొగడుచు, నాఫలములను భుజించి దుగ్ధమును గ్రోలెను. క్రమముగ వాని దేహమందు బలదారుఢ్యముల సంచలనముగాఁ దొడంగెను. పిదప నతఁడా సిపాయితో, "నీవు నాకొనరించిన మహోపకార మెన్నటికి మఱువఁజాలను. అతుల నే పరోపకారబుద్ధి నన్నీ మందిరమునుండి వెలుపలకు వెడలింపు" మనెను.

"నేను మిమ్మీ మందిరమునుండి వెడలింపఁ జాలుదునుగాని, దానికిఁ బ్రతిఫలముగ నాకుఁ గొంత పారితోషికము లభింపవలయును."

"మంచిది! నీకేమికావలయునో కోరుకొమ్ము."

"నేనకోరినదాని నొసంగుట కిపుడు మీయొద్దనేమి కలదు?"

"ఏమి! నాదేహమందుగల యాభరణములు సరిపడవా? అవి కొన్నివేల రూప్యముల విలువగలిగియుండును."

"నాకవి యనగత్యములేదు."

"అటులయిన, నీవేమి కోరుచుంటివి?"

ఆతురుప్పాంగన మొదలి యుంగలి యాభరణములను నొకవే యిబంగరు నాణెములను నొసంగుఁడు"

"అదియెటుల సమకూరును? ఆయాభరణములు నాయొద్ద లేవు కదా! మఱియు వేయిబంగరునాణెములెచటనుండి రాగలవు"

"ఆతురుష్కాంగన యొద్దనుండి కైకొని నాకొసంగుడు."

"ఆయంగన తన యాభరణములను నాకేల యొసంగును?"

"(నవ్వుచు) రాకుమారా! ఆమె నీయందు బద్ధానురాగమై యున్నది. మీరు కోరిన తన ప్రాణములనైన నర్పించుటకు సంసిద్ధమై యున్నది."

"అటుకానిచో, నన్నీ యాపదనుండి తొలగింపఁ జాలవా?"

"కాదు. మీరు వ్యాకులము నొందవలదు. ఇందు మీకుఁ బోవునదేమి కలదు? రేపటి దినంబున నాదుష్టురాలు మగుడ మీచెంతకు రాఁగలదు. అపుడామెతో, నీదేహమందలి యలంకారములన్నియును, వేయిబంగరు నాణెములను నాకీ నాఁడొసంగిన రేపటి దినంబున నీయభిలాష నీడేర్తునని వచియింపుఁడు. ఆమె తత్క్షణమవి మీకొసంగును. ఆమె మిక్కిలి ధనికురాలు. ఆమెకెట్టి లోపమును లేదు."

"సరియే, అటులనే కావించెదను."

"మీరటుల కావించిననే మిమ్మీ చెఱనుండి విడిపింపఁ గలను మీరు బలాత్కారముగగాని, వంచనతోగాని, యిచటినుండి వెడలి పోవుదునని తలంపకుఁడు. అటు లెన్నటికిఁ గాఁజాలదు. ఆమె యిచటికరుదెంచుటకును బోవుటకును బెక్కుమార్గములు గలవు"

"నాలుగైదు దినముల వఱకా యంగన యిచటికి రాకుండిన నేనేమి సేయగలను?"

"కానిండు! నే ననుదినము మీక్షేమము నారసిపోవుచుందును. భోజనపదార్థములను గొనితెచ్చి మీకొసంగుచుందును."

"మంచిది."

పిదప నాసిపాయి కుమారనరేశసింహుని వలన వీడుకోలునుబడసి వితంసనసహాయమున మిద్దెపైకిఁ బోయి యచటినుండి ప్రాకారము మీఁదుగ క్రిందికిదిగి వెడలిపోయెను.

"ఇట్టి విపత్సమయంబున నాకుఁ దోడ్పడ నరుదెంచిన యాతఁడె వరు? ఆతఁడొక మైయారుఁడయి యుండవలెను. వానికి ధనతృష్ణయధికము. పాపమా మైయారులేమి సేయుదురు? వారి కమితవ్యయము గలిగియుండును. అతఁడు తెలిపియుండిన విధంబున నేను ప్రవర్తింపవలసి యున్నది." యిట్టి విధంబులగు వివిధాలోచనలయందుఁ గుమారనరేశసింహుఁ డారేయి యంతయుఁ గడపెను.

తెల్లవాఱిన పిదప నాతురుష్కాంగన మరల నల్వురు పరిచారికలను వెంటఁగొని కుమారనరేశసింహుఁడు బంధింపఁబడియుండిన గదిలోనికి వచ్చిచేరెను. మఱియు నతఁడు పర్యంకముపయిఁ బరుండి మేల్కాంచియుండుటయుఁ దాము గతరాత్రి డించిపోయిన భోజనపదార్థములన్నియు నట్టివిధంబుననే యచటఁబడియుండుటయుఁ నామె తిలకించెను

యువతి:—(నరేశసింహుని సమీపించి) మనోధవా! నీవటులేల చలమూనెదవు? ఆకలిదప్పికల ప్రాణములేల కోల్పోయెదవు? నాపలుకుల నాలింపుము. నన్ను చేబట్టుము.

నరేశ:—పొలఁతీ! నే నివ్విధంబున మరణించుటకు సమ్మతించెదనుగాని నిన్ను ప్రేమింపఁ జాలను.

యువతి:—సుందరాంగా! నీయనుపమసుందరస్వరూప మేల మంటిపాలు సేసెదవు?

నరేశ:—(నిజహృదయభావములను మఱుఁగుపుచ్చి నిక్కంపు కాముతురునిఁ బోలె మందహాసవిరాజితవదనుఁడై) కాంతామణీ! నీమానసం బెఱుగ నిటుల ప్రవర్తించియుంటిని. కాని, నీయందు మక్కువలేకగాదు. భవదీయసుధారసాంచిత చా

రువదన సందర్శన మాత్రమున నాకుఁ గలుగుచుండిన మనోవికారము లాభగవంతునికే యెఱుక. నీమృదుమధు రాంచిత సంభాషణములను దనివిదీర నాలించు తరుణమెపుడు చేకూరునాయని యువ్విళ్లూరుచుంటిని. నాకు నీపైఁగల కూరిమిపెంపున నీ కధీనుఁడనగుచుంటిని. హేమగాత్రీ! నా పలుకొక్కటి గలదు. నీవు దానిని మన్నించెదవుకదా?

యువతి:—(ఆనందపరవశయై వాని సమీపమునఁ గూర్చుండి) మనోనాయకా! నీవేమని పలుకుచుంటివి? నాకధీనుఁడనగుదునని యా?—నన్ను ప్రేమించెదననియా?—ఆహా! ఈపలుకులెంత మధురముగనున్నవి! ఎంత సుధాప్రపూరితములై యొప్పారుచున్నవి! మనోనాథా! ఏది? నీకోరిక యెట్టిదో వ్యక్తీకరింపుము! వ్యక్తీకరింపుము!!

నరేశ:—సుందరీ! నీ దేహమందలి స్వర్ణాలంకారములన్నియు నాకొసంగవలయును. మఱియు వేయిబంగరు మొహరీలును గావలసి యున్నవి.

యువతి:—(అమితానందభరితయై) ప్రాణేశ్వరా! ఇంతియేకదా నీకోరిక. స్వర్ణాభరణములేయేల? నాదేహమనోధనంబుల నీకర్పితనై యుంటిని."

ఇవ్విధంబున బలికి యాతురుష్కాంగన తన మేనునందలి యలంకారములన్నియుఁ దీసి వాని కొసంగెను. మఱియు నిరువురు పరిచారికలను బుత్తెంచి వేయిబంగరు నాణెములను దెప్పించి వాని ముందిడెను.

యువతి:—సుందరాంగా! ఇఁక నెట్టి యభ్యంతరమును లేదుకదా?

నరేశ:—లేదులేదు. మోహనాంగీ! నేనొక దినము గడువుమాత్రము గోరుచుంటిని. రేపటి దినమున నీవేళకే యిచటికి రమ్ము.

నిన్ను చేబట్టెదను.

యువతి:—ప్రాణేశ్వరా! నేఁడును భుజింపకుందువా?

నరేశ:—నీవా విషయమున జింతింపఁ బనిలేదు. నాకది బాగుగ నలవడి యున్నది. కొన్నిదినములు దనుక నాకలిదప్పికల సహించి యుండఁగలను.

యువతి:—నీయిష్టము. నేనేమి సేయఁగలను? నిరుపాయను. మంచిది. నేనిపు డేగి వచ్చెదను.

ఇటులఁ బలికి యాతురుష్కాంగన యా వాతాయనమార్గంబున దన పరిచారికల వెంట నాగది వెలుపల కేగెను. ఆమె కపుడు గలిగి యుండిన సంతోషాతిశయంబున నాగవాక్షద్వారమును బంధించుట మఱచియుండెను. పిదప నరేశసింహుఁడా తలినముపైనుండి లేచి యాగవాక్షమార్గమున వెలుపల కేగి యాతురుష్కాంగనను వెదకసాగెను. ఆమె జాడ యెందును జూపట్టదయ్యెను. అచటి భిత్తికయందు మాత్రము రెండు యాలమారులు చూపట్టుచుండెను. ఆయాలమారులు వాతాయన విధంబున గూఢమార్గములయి యుండవలెనని యాతఁ డూహించెను.

కుమారనరేశసింహుఁ డాపగలంతయు వివిధాలోచనలయందు గడపెను. ఒకజామురేయి గడచిన పిదప నిన్నటిదినము వలెనే నేఁడు కూడ నాసిపాయి వాని సమీపమున కరుదెంచి ఫలదుగ్ధంబులను వాని కొసంగెను. కుమారనరేశసింహుఁ డాఫలములను భుజించి పాలను గ్రోలి, వానితో "ఇవిగో! కైకొనుము. నీకోరిక ఫలించినది" అని పలికి యాస్వర్ణాలంకారములను మొహరీలను వాని కొసంగెను.

అంత నాసిపాయి యమితానందభరితుఁడై వానిని దన కక్షపాలయందుఁ బదిలపఱచుకొని, వానితో, "మంచిది. నడువుఁడు. మిమ్మీ మందిరమునుండి వెడలించెదను. ఒకనాఁటి కష్టమున కింతధనము చేఁ

జిక్కఁగదా?" అనెను.

తదనంతర మాసిపాయి కుమారనరేశసింహుని వితంప సాహాయ్యమున నామందిరము వెలుపల డించి తానును క్రిందికి దిగిపోయెను. మైదానమందలి నిర్మలవాయు సంస్పర్శమువలన కుమారనరేశసింహుని సకలాంగకములు వికసించి వాని దేహమం దెప్పటియటుల బలదార్ఢ్యములు వచ్చి చేరెను. వెలుపలినుండి గాంచుటవలన నామందిరమొక పర్వతాంతర్భాగమున గలదనియు శిల్పకారుఁడా పర్వతమును దొలిచి యామందిరమును నిర్మించియుండెననియు కుమారనరేశసింహుఁడు గ్రహింపఁ గలిగెను. ఆపర్వతమం దచ్చటచ్చటఁ గొన్ని సారంగములను నావెన్నెల యందాతఁడు కనుగొనెను.

పిదప నాసిపాయి కుమారనరేశసింహుని వెంటఁగొని యొక తావునకు బోయి చేరెను. అచట రెండు గుఱ్ఱములొక మ్రానునకుఁ గట్టఁబడి యుండెను. ఆసిపాయి కుమారనరేశసింహునితో, "రాకుమారా! మీరొక ఘోటకముపై నధిరోహింపుఁడు. నేను రెండవ దానిపై నధిష్టించి మిమ్ము కుమారిగడమునకుఁ జేర్చిపోయెద" ననెను.

నరేశ:—కుమారిగడ మిచటి కెంత దవ్వున గలదు?

సిపాయి:—రమారమీ యిరువది క్రోశుల దవ్వుండును. నడువుఁడు. ఈతురంగములు మిగుల చుఱుకైనవి. మనము తెల్లవాఱుసరికి కుమారిగడము చేరఁగలము. మీసహోదరుడు మహేంద్రసింహుని విషయమున మీరు చింతింపవలదు. వారి జాడయు నతి శీఘ్రముగ దెలియగలదు. మీవైయారులు వారి జాడ నరయ నేగియుండిరి.

నరేశ:—ఈవారువముల నీవెచటినుండి కొనివచ్చితివి?

సిపాయి:—నేనెచటనో ముచ్చిలించి తీసికొని వచ్చితిని. అది మీకెందులకు?

నరేశ:—పోనిమ్ము! నీవెవరవు? నీనామమెయ్యది?

సిపాయి:—నేనా విషయములను దెలుపఁ జాలను. మన్నింపుఁడు.

నరేశ:—వివరించుటయం దాటంకము గలిగియుండిన ... ..."

నరేశసింహుఁ డింకను దన యభిప్రాయమును బూర్తిగ వెల్లడించియుండలేదు. అంత నల్లని దుస్తులను ధరించిన యొకవ్యక్తి తమ దెస కరుదెంచుటను గాంచి యాతఁడు దద్దఱిల్లెను. తోడనే వారిరువురు నొక వృక్షము చాటునకుఁ బోయి డాగియుండిరి. ఆవ్యక్తి "ఇపుడు నా హృదయసంతాప ముపశమించినది. ఇఁక నేనింటికిఁ బోయి హాయిగ నిదురించెదను. నన్నొక సామాన్య వనితగ దలంచి యామరితాత్ముఁడు నన్ను బాధింపవచ్చెను. కాని, నాహృదయము పురుషహృదయముకంటె నతిశయించి యుండునని యాతఁడెఱుంగఁడు కాఁబోలు. ఆదురాత్ముని శవమును గృధ్రములు కాకములు మెసవి సంతుష్టినొందగల" వని గొణగొణ వదరుచుఁ గుమారనరేశసింహుఁ డాసిపాయితో డాగియుండిన వృక్షసమీపమునుండి వెడలి యదృశ్యయయ్యెను. కుమారనరేశసింహుఁడు నాసిపాయియుఁ దన్ను గాంచియుండిన సమాచారమా వ్యక్తి యెఱుంగదు.

పిదప నాసిపాయి కుమారనరేశసింహునితో, "రాకుమారా! ఆ దుష్టురాలు తప్పక నెవరినో హత్యగావించి యుండవలె" ననెను.

నరేశ:—ఆహత్యాకాండ మీసమీపముననే జరిగియుండును. నమువ్ము. అదియెట్టి విషయమో కాంచివత్తము. అన్వేషించుట వలన నాశవము మనకుఁ జూపట్టఁ గలదు.

ఆయిరువురు నిటునటు వెదకి చూడసాగిరి. వార లధికశ్రమ నొంద నగత్యము గలుగదాయెను. వారికి పదిగజముల దూరమున గిజగిజ దన్నుకొనుచుండిన యొక క్షతగాత్రుని వారు తిలకించిరి.

వెంటనే యాసిపాయి తన దోగ్మాలమునుండి కక్షపాలను వెడ

లించి చకుముకిరాయివలన నిప్పురగుల్చేసి యొక మైనపువత్తిని వెలి గించెను. మఱియు నాక్షతగాత్రుని హృదయము చీలిపోవునట్టుల నెవరో కైదువుతో బొడిచియుండెననియుఁ దెలిసికొనెను. ఆక్షతము నుండి రక్తము సంతతధారగఁ బ్రవహించుచుండెను. ఆక్షతగాత్రుఁ డేద్దియో పలుకఁ గోరుచుండెను. కాని, వాని నోట నేపలుకును వెడలఁ జాలకుండెను.

అంత నాసిపాయి తన కక్షపాలనుండి యొక చిన్న సీసాను వెడలించి దానియందలి ద్రావకము రెండుమూడు చుక్కలు వాని నోటి యందుఁ బడవైచెను. ఆయౌషధము కంఠగతమైన తోడనే వానికిఁ గొంతదార్ఢ్యము గలిగెను. మఱియు మిక్కిలి మందస్వరంబున నీదిగువను లిఖింపఁబడిన తుదిమొదలు లేని కొన్ని శబ్దములను మాత్రము పలికి యతఁడు విగతజీవుఁ డయ్యెను.

అహా ... ... ఆశ్చర్యము. ఆసౌందర్యవతియగు పిశాచి ... ... అభయసింహు ... ... ని ... ... ప్రాణము ... ... నావలె ... ... ఆమె వలలో ... ... హా!... మహేంద్రసింహుని ... ..."

ఆ మృతప్రాయుని నోటినుండి వెడలిన పలుకులెంత తుదిమొదలు లేనివై యుండినను యవి వారి మానసంబులను సంక్షుభితము నొనరింపఁ జాలియుండెను.

సకలకార్యసంపాదన సమర్థుఁడగు యాసిపాయికి కుమారనరేశసింహునికంటె నధికతర సంతాపము జనించెను. ఈసమయంబున గుమారమహేంద్రాభయసింహులకుఁ దోడ్పడుట నావిధికృతమని యాతఁ డూహించెను. పిదప నతఁడు కుమారనరేశసింహుని దెసఁగాంచి "రాకుమారా! మీరిపుడు గృహమునకు వెడలిపొండు. ఇపుడీ మృతప్రాయుని నోట వెడలిన పలుకులెంత తుదిమొదలు లేనివై యుండిన

ను నవి భావగర్భితములును నర్థసంపూర్ణములు నైయున్నవి. వాని వలన మీాసహోదరుఁడు కుమారమహేంద్రసింహుఁడును నైయూర శిరోభూషణుఁడగు యభయసింహుఁడును నేదియో గురుతరవిపత్తియందుఁ జిక్కియుండినటుల తోఁచుచున్నది. అట్టి విపత్సమయంబున వారికిఁ దోడ్పడుట నాకు ముఖ్యకర్తవ్యము. నేనిపు డిచట నిలువఁ జాలను. నేనెంత దీర్ఘముగ యోజించి చూచినను, ఏస్త్రీ యిపుడీ హత్యను గావించి పోయెనో, మఱియుఁ బెక్కు యుత్పాతములను గలిగింపనుండెనో యామగువను వెదకి కనుగొను వఱకు నాయుద్దేశ్యము ఫలింపఁ జాలదని తోఁచుచున్నది.

నరేశ:—నీపలుకులు మిగుల సమంజసములు. కాని, యిట్టి సమాచారముల నెఱింగియుండియుఁ బ్రాణములకన్న మిన్నలగువారికిఁ దోడ్పడక సంకుచితచిత్తుఁడనై గృహమునకుఁ మరలి పోవుదునని నీవు తలంచుచుంటివా?

సిపాయి:—సరియే. నడువుఁడు. మనమిపు డాలసింపరాదు. నాయొద్ద నొక కైజారును జేతుపాకియుగలవు. వానిలో మీాకు గావలసిన దానిని తీసికొనుఁడు. సమయము తటస్థించు నపుడది మీాకుపకారియగును.

నరేశ:—చేతుపాకి నాకొసంగుము. (కైకొని) మంచిది. నడువుము.

నరేశసింహుఁ డాచేతుపాకి దన నడికట్టునందు జతనపఱచుకొని యాసిపాయి వెంటఁ బాదచారియై యాహంతకురాలు వెడలిన వైపునకు దారిపట్టెను. వారిరువురు మార్గమందుఁ దమ శ్వాసలను బిగియబట్టి నెమ్మదినెమ్మదిగా నడచుచు, నిటునటు దృక్కులను బ్రసరింపఁజేసి సద్దులను జాడకట్టుచు ముందునకు వెడలుచుండిరి.

అవ్విధంబున వారలొక క్రోశుదవ్వఱిగిన పిదప నొక పర్వతముఁ దాటి పోవు నావశ్యకము వారికిఁ గలిగెను. వారలా పర్వతముపై

కొంత దవ్వఱిగిన పిదప నచట నిలిచి నలుదెసల వీక్షింపసాగిరి. అంత జిఱుగంటల మ్రోఁత వారికి వినిపించెను. ఆధ్వని యొకకొండగుహనుండి వెడలుచుండెననియు నయ్యది తాము నిలచియుండిన తావునకు సామీప్యముననే కలదనియు వారు గ్రహింపఁ గలిగిరి.

పిదపఁ గుమారనరేశసింహుఁడు సిపాయి వెంట నాధ్వని నిర్గమించిన దెసకు వెడలెను. రాజమార్గమున కెడమ తట్టుగ కొంచెము తొలఁగియుండిన యాపర్వతమందలి కందర ముఖద్వారము నొద్దకు వారిరువురును బోయి నిర్భీతచిత్తులై యందుఁ బ్రవేశించిరి. ఇపుడొక వైపు నుండి యాచిఱుగంటల మ్రోఁత మరల వారికి వినిపించెను. మఱియుఁ దటాలున విద్యుత్ప్రకాశమును బోలిన యొక కాంతి యందు మెఱసెను. ఆప్రకాశమం దాగుహాయందలి మార్గము స్పష్టరూపమున జూపట్ట దొడంగెను. దానియందుఁ గొంతదూరమున నిలచియుండిన యొకయువతి యాప్రకాశమునుగాంచిన తోడనే యాగుహాయందలి యగడ్తలోనికి దిగిపోవుచుండుట కుమారనరేశసింహుఁడును సిపాయియుఁ గనుగొనిరి. "ఆహా! మన మెవరిజాడ నరయుటకు బయలు వెడలితిమో యామెయే యిందుఁ జూపట్టె" నని వారిరువురు నొక్కమాఱుగ బలికిరి. ఆయగడ్త లోనికిఁ బోవు మార్గ మిరువురు మనుష్యులొక్కమాఱుగ బ్రవేశించుటకుఁ దగినంత విశాలములేక మిగులఁ జిన్నదిగ నుండెను.

తోడనే యాప్రకాశ మదృశ్యమయ్యెను. ఇపుడా గుహాయందుఁ జీఁకటి దట్టముగ వ్యాపించెను. కుమారనరేశసింహుఁడు సిపాయితో నందు దడవులాడుచు నాయువతి దిగిపోయిన యగడ్తసమీపమునకుఁ బోయిచేరెను. దానిలోనికిఁ బోవు మార్గమిపుడొక ఱాతిబండవలన మూయఁబడి యుండెను. కాని యాఱాతి కిరుపార్శ్వంబుల బెద్ద పెద్దరంధ్రము లేర్పడియుండెను. ఆరంధ్రములనుండి యాయగడ్తయందలి లో

పలి భాగమంతయు బాగుగఁ జూపట్టుచుండెను.

కుమారనరేశసింహుఁ డాసిపాయితో నారంధ్రముల సమీపమునఁ గూర్చుండి యందలి భయంకరదృశ్యముల ననిమేషదృష్టిఁ జూడఁ దొడంగెను. దాని లోపల బాగుగఁ బ్రకాశము గలిగియుండెను. ఆ మార్గమున కెట్టయెదుట నొకశిలాఫలకముపయి నాయువతి, మొగముపై నకాబుపోషును ధరించి కూర్చుండి యుండెను. ఆమె మిక్కిలి పరిశ్రాంతి నొందియుండుటచేఁ గాఁబోలు, మాటిమాటికి నిట్టూర్పులను బుచ్చుచుండెను. ఆమెకు నొకవైపున నతిలావణ్యవతియగు బాలిక యొకతె చేత నొక కైదువును బూని నిలిచియుండెను. రెండవతట్టునఁ గురూపియగు యొకకుఱ్ఱబానిసీఁడు గునపముతో నచటిభూమిని ద్రవ్వుచుండెను ఆయగడ్తకు మధ్య దాని మిద్దెనుండి యొకశవము తలక్రిందుగ వ్రేలాడుచుండెను. ఒకమూల జలముతో నిండియుండిన మృణ్మయపాత్రయు నొక కలశమును గలవు. అచటఁ గొన్ని భోజ్యపదార్థములును బడియుండెను.

కొంతసేపయిన పిదప నాయువతి తన ముఖముపై ధరించియుంచిన నకాబుపోషును దొలఁగించెను. ఆహా! ఏమి! ఆసౌందర్యగరిమ! ఆమె కోమలసుందరాననము దురంత క్రోధాతిరేకంబున నరుణరంజితమై కన్నులెఱ్ఱబాఱి భీతావహముగ నుండెను. ఆయువతి శిలాఫలకమునుండి లేచి తన సమీపమున నిలిచియుండిన బాలిక చేతియందలి కృపాణమును గైకొని వ్రేలుచుండిన యాశవము చెంతకుఁ బోయెను. మఱియు నాకృపాణముతో నాశవము వీఁపు కొంతభాగ మొక యంగుళము లోఁతుగఁ జీల్చెను.

అకటా! అట్టి యపూర్వసౌందర్యవతికా, యిట్టి సంకుచిత హృదయము! ఇంతటి నిర్దయత! ఆమె యిపుడే యొకహత్యను గావించివచ్చెను. ఇచట మరలఁ దన పైశాచిక కృత్యములఁ బ్రదర్శించుచున్నది. ఆ

శవ మెవరిది? అది కుమారిగడరాజ్య శుభకాంక్షితులలో నొకనిది కాదుగదా? అతఁ డీవిచిత్ర నవలలోని యొకపాత్రపోషకుఁడుగాఁడు కదా?”

అటులా యువతి నిర్దయస్వాంతమై యాశవము వీఁపును జీల్చిన తోడనే యాప్రేతము కెవ్వున యఱచి, తల్లడిల్లసాగెను. ఇపుడది యొక శవముగాదనియు వానిని బాధించుట కెవ్వరో యిట్టి విధంబున వ్రేలాడగట్టి యుంచిరనియుఁ దెల్లమగు చుండెఁగదా!

ఆ వ్రేలుచుండిన మనుష్యుఁ డాగాయము వలన నధికతరమగు బాధనొందుచు నాక్రందించుచు నిటులఁ బలుక సాగెను:—

“ఓసీ! దురాత్మురాలా! నన్నిటులేల బాధించెదవు? నేనేమియు నెఱుంగను.”

“ఓరీ! విద్రోహీ! నీవు బాగుగ నెఱింగియున్నావు. నీవు నాప్రశ్నకు బత్యుత్తరమొసంగి తీరవలయును? (మరలవాని వీఁపును జీల్చుచు) యదార్థ వృత్తాంతములను దెల్పుము! తెల్పుము!”

“ఓసీ! పాపాత్మురాలా! నీవు నన్నొక్కమాఱుగ నేల చంపకున్నావు? నాకొకరి సంగతి యేలకావలయును? నాకు మహేంద్రసింహునితో నేమి సంబంధము గలదు?”

”(మరలఁగత్తితోఁ జీల్చుచు) నీవతి దుర్మార్గుఁడవని నేను బాగుగ నెఱింగియున్నాను.”

“హా దైవమా! మహేంద్రసింహుని మూలమునగదా నాకిట్టి యవగతి” యని విలపింపసాగెను.

ఇంతదనుక గుమారనరేశసింహుఁడును నాసిపాయియు మిన్నక డాఁగియుండి యాహృదయప్రకంపితదృశ్యమును గాంచుచుండిరి. ఎపుడా వ్రేలుచుండిన మనుష్యుఁడు “మహేంద్రసింహుని మూలమున గదా నాకిట్టి యవగతి” యని విలపింపసాగెనో యపుడు వారిరువురు

గోపోద్దీపితమానసులై మోములు జేవురింప నాఱాతిబండను ద్రోలఁగిం
చి నిర్భయముగ నాపరిఖలోనికి దిగిపోయిరి. మఱియు నాపాషాణహృ
దయయగు యువతిని జూసి కుమార నరేశసింహుఁడు గంభీరాకారుఁడై
గద్గదపుబలుకులతో, "జాగ్రత్త! నీచేతియందలి కైదువును గ్రిందఁబడ
వేయుము. కానిచో, నీదుష్కృతికిఁ దగు నిష్కృతి నిపుడే బడయ
గలవు" అనిపలికెను.

యువతి:—(తుళ్ళిపడి) ఏమి! మీరిచటికేల యరుదెంచితిరి? ప్రమా
దవశమున నిందుఁజొచ్చియుండిన మిన్నక నిచట నిలిచి యీ
విచిత్రములను బరికింపుచుండుఁడు. మీబెదిరింపుపలుకులకు నే
ను భీతిల్లుదాననుగాను. (సిపాయివైపునకుఁ గాంచి) ఏమి! నీ
నేత్రములందు ధూళిక్రమ్మియుండెనా? నీయజమానురాలిని
గుర్తింపఁ జాలకున్నావు!

సిపాయి (ఆమెవైపునకు బాగుగనిదానించిచూచి) ఔను. నిక్కువము
నీపలుకు లాశ్చర్యజనకములు. అత్యద్భుతములు.

యువతి:— మంచిది. మీరిరువురు నిచటనుండి వెడలిపొండు. నా
కార్యమందు విఘ్నము నాపాదింపకుఁడు.

సిపాయి:— (నరేశసింహునితో) నడువుఁడు. మనకీవిషయమందు జో
క్యమెందులకు? ఆమె యిచ్చవచ్చినటుల సేయనిండు.

నరేశ:— (తనమొలకట్టునుండి చేతుపాకిని వెడలించి) ఏమి! మనము
వెడలిపోవలయునా? ఇట్టిఘోరకృత్యమును గన్నులార గాం
చియు మిన్నకుండవలయునా? అటులెన్నటికిగాఁజాలదు.

యువతి:— కానిచో, నీవు ముఖప్రక్షాళనముగావించికొని కూర్చుం
డుము.

అవక్రమపరాక్రమోపేతుఁడగు నరేశసింహుఁడా పలుకుల
నెటుల సహింపఁగలఁడు? "ముఖప్రక్షాళనము గావించికూర్చుండు"

మను వచనము నాలించినంతనే రోషాకలితచిత్తుఁడై యామనుష్యుని తల క్రిందుగాఁ గట్టియుంచిన త్రాటి నాచేతుపాకిని చీల్చి ఖండించివైచెను మఱియు నతిమెలకువతో నామనుష్యుఁడు దఢాలున క్రిందఁబడకుండ రెండవచేతితోఁ బట్టుకొని యల్లనవానిని గ్రిందికిజారవిడచెను.

ఇపుడా సిపాయియు మన కుమారనరేశసింహునకుఁ బగతుఁడయ్యెను. ఆతఁడు కుమార నరేశసింహుని నుపలక్షించి "ఏమి! నీబాల్యచాపల్యము" అనిగద్దించి పలికెను.

ఆయగడ్త యందిరువురు స్త్రీలును నొకబానిసీఁడును గలరనిపైన లిఖించియుంటిమి. ఇపుడా సిపాయియు వారితోఁ జేరెను. ఆనల్వురుఁగలసి నరేశసింహుని బంధించుటకుఁ బ్రయత్నించిరి. కాని, యసమాన బాహుపరాక్రమనిర్జితుండగు యారాకుమారునిముందు వారి యాటలు సాగిరావయ్యెను. అహా! ఏమి! వాని బలపరాక్రమములు! ఒక్క త్రోపునకే యానల్వురు దవ్వునకుఁబోయి కూలబడిరి. అంతనొక గంభీరధ్వని యాకందరమునుండి యిటుల వినిపించెను.

"నరేశసింహా! ఏమి! యీయాగడము! జాగ్రత్త! నీవెయ్యదియో కావించి యుంటివి. ఇఁకముం దటుల సాహసింపకుము. కానిచో, దండింపఁబడుదువు"

కుమారనరేశసింహుఁడమితాశ్చర్యసంభ్రమాయత్తచిత్తుఁడగుచు వెలుపలివైపునకుఁ గాంచినంతనే యొక సమున్నతాకారయగు యోగిని వానిదృష్టిపథమునకుఁ జిక్కెను.

ఆమె కురులు జటాబద్ధములయి పృష్ఠభాగమున బిఱుదులవఱకు వ్రేలాడుచుండెను. ఆమె కాషాయాంబరములనుదొడిగి కుడిచేతియందుఁ ద్రిశూలమును నెడమచేతి యందునిప్పురగులుచుండిన యొకగుగ్గిలపు పిడిగయు ధరించియుండెను. దానినుండి వెడలుచుండిన పొగ సుగంధబంధురమై యింపెసలారుచుండెను.

కుమారనరేశసింహుఁ డాశ్చర్యచకితుఁడై యామెస్వరూపము ననిమేషదృష్టి వీక్షింపఁ దొడగెను. పడిగలోనుండి వెడలుచుండినసుగంధధూమ మాయగడ్తయంతయు వ్యాపించుచుండెను. మఱియుదాని ప్రభావమువలన నచటనుండిన యానల్వురు మూర్ఛాగతులై భూమిపై నొఱగిరి. ఆయోగిని మాత్రము చైతన్యముగలిగియుండెను. వార లటులమూర్ఛాగతులగుట నెఱింగి యాయోగిని యామృణ్మయపాత్రనుండి జలము నాపడిగలోనికి వెలువరించి యానిప్పు నార్పివైచెను.

---

## ఇరువదినాల్గవ ప్రకరణము

—◆—

మేమిపుడు విక్రమగడవృత్తాంతముల గొన్నింటి నిచటలిఖించుట సముచితముగఁ దలంచుచుంటిమి. విక్రమసింహ నరపాలున కొకపుత్రుడు నొకపుత్రికయు జన్మించియుండిరని తొలుతనే తెలిపియుంటిమి. విక్రమసింహ నరపాలుని పుత్రునినామము భీమప్రతాపసింహుఁడు. వాని వయస్సు పదునెనిమిది వత్సరములు. పుత్రిక పేరు చంద్రికళ. ఆమెకు బదునైదవయేఁడు గడచుచుండెను.. ఈసమయంబునఁ జంద్రికళ విక్రమగడమునందు లేదు. విక్రమసింహ నరపాలుఁ డామెపైఁ గొఁడొక కారణంబునఁ గుపితుఁడై యామెను మాతామహుని మందిరమునకుఁ బుత్తెంచియుండెను. కోపకారణము మేమిచట వ్యక్తీకరింపఁజాలము. అదిపెక్కు చిక్కు సంగతులతోఁ గూడియున్నది. క్రమముగ నయ్యది తనంతట నదియే వీడిపోఁగలదు.

భీమప్రతాపసింహుఁడు విక్రమగడమునందు నివసించుచు ధనుర్విద్యాది సకలకళలయందుఁ బ్రవీణుఁడయియుండెను. ఆతఁడు బాహువీర్యబలపరాక్రమ సంపన్నుఁడగుటయేకాక న్యాయశాస్త్రపారంగతు

డై తలిదండ్రుల కల్లాడు బెల్లమై యొప్పారుచుండెను. కాని, భీమప్రతాప సింహునకు మాత్రము తనతండ్రి యాచరణస్వాభావికములు హితకరములు గాకుండెను.

నియమానుసరణి కుమారభీమప్రతాపసింహుఁ డొకనాఁడు కొంతపరివారమును వెంటఁగొని యశ్వారూఢుఁడయి మృగయావిహారార్థ మడవి కేగెను. ఆయరణ్యంబున వన్యసూకరము లధికముగ గలవు. అశ్వమును బరుగెత్తించుచు భూదారములను భల్లముతో బొడిచి పరిమార్చవలయునను కుతూహలము వానికి మెండు. అటులా కుమార భీమప్రతాపసింహుఁడా యడవియందుఁ గ్రుమ్మరుచు దన యెదుటనుండి తూర్పుదెసగాఁ బరుగిడుచుండిన బలిష్టమగు యొకవృద్ధభూదారమును గాంచి తనగుఱ్ఱమును బర్వెత్తించుచుఁ, దన యనుచరులనఁ వీడి చాల దవ్వు దాని వెన్నంటి పోయెను. ఏవైపున కాసూకరము పరుగు వారుచుండెనో యాదెసయందుఁ గొంతదవ్వున నొక యువతీమణి యశ్వారూఢయయి చేతనొక భల్లమును ధరించి యాసూకరము తన్ను సమీపించినంతనే భల్లముతోఁ బొడచి దానిని పొడవడంచు తలంపుతో నచటనిలిచియుండెను.

కుమారభీమప్రతాపసింహుఁ డాసూకరమున కెంతదూరమున నుండెనో యాయువతియు నంతదవ్వుననుండగనే యాసూకర మెడమ వైపునకు మరలి పూర్వముకంటె నెక్కుడు చుఱుకుగాఁ బరుగులిడఁ దొడంగెను. కుమారభీమప్రతాపసింహుఁడును నాయువతియుఁ దమగుఱ్ఱములను వాయువేగమునఁ బర్వెత్తించుచు దానిని వెంటాడించిరి. కాని, భీమప్రతాపసింహునికంటె ముందుగ నాయువతి యాసూకరమును డాసి భల్లముతోఁ బొడిచి దానిని గూలనేసెను.

తన వేటమృగ మొకయువతి చేతియందుఁ జచ్చుటఁగని కుమార భీమప్రతాపసింహుఁ డపరాభవాగ్నిచే నుడుకుచు గన్నులెఱ్ఱజేసి యా

మెతో "నీవు నావేటమృగము నేలమడియించితి" వని గద్దించిపలికెను.

యువతి:— దానిపయి నీనామముచెక్కఁబడి యుండెనా?

భీమ:— ఎందుచేఁగాదు? ఇదినాయడవి! నావేట! నేనుచాలదవ్వునుండి దాని వెన్నంటి వచ్చుచుంటిని.

యువతి:— బాగుబాగు! నీయడవియునీవేటయునా? దానివెంట మూఁడుక్రోశుల దవ్వునుండి పరుగిడివచ్చుచుంటివి. కాని, యాసూకరమును మడియింపజాలవైతివి. నీకు లజ్జ యేలకలుగకున్నది? మీదుమిక్కిలి కన్నులెఱ్ఱజేసి ప్రాగల్భ్యములను బల్కుచుంటివి. ఇఁకజాలింపుము.

భీమ:— ఏమిసేయుదును? నీయనుపమాన సౌందర్యము నాహృదయమందుఁ గరుణజనింపఁ జేయుచున్నది. నీవబలవని తలంచి వీడిపుచ్చుచుంటిని. కానిచో, నిన్ను తప్పకదండించియుందును.

యువతి:— ఏమి, నీవాక్చాతుర్యము! నీవొకబాలుఁడవని భావించి నిన్ను విడుచుచుంటిని. కానిచో, నీరెండు చెవులను బుణికి తగురీతి బుద్ధిచెప్పియుందును.

భీమ:—(పండ్లుపటపటఁగొఱుకుచు) ఇఁకసహింపనోపను. నోటికి బుద్ధిచెప్పుకొనుము.

యువతి:— సహింపఁ జాలకుండిన గరములతో శిరమును మోదుకొనుము. ఇఁక ప్రల్లదములను గట్టిపెట్టుము.

ఆయువతియందలి సుందరాకారము నంగసౌష్టవము నశ్వారోహణపటిమయుఁ జాకచక్యమును బ్రేక్షకుఁడెంతకాల మామె వైపునకు వీక్షించుచుండినను దనివితీరనటు లతిశయించి యుండెను కాని యామె కటువచనములను భీమప్రతాపసింహుఁడు సహింప

జాలకుండెను. క్రోధాతిశయమున వాని కన్నులయెదుటఁ గాఱుచీఁకటులు క్రమ్ముకొనెను. ఆతఁడు తన కోపము నడచిపట్టఁజాలక దటాలున నామెపై భల్లమును విసరెను. ఆయువతియు నతినేర్పున నా ప్రహారమును దన డాలుపై నాపుకొని, హేళనపూర్వకంబుగహసించుచు "సెబాసు! నీబాహుపరాక్రమము మెచ్చఁదగి యున్నది. కానిమ్ము. నీకెంతటి సాహసముగలదో పరీక్షించెదనుగాక" యని పలికి వానితో బవరమున గదిసెను.

ఒక గంటకాలముదనుక వారిరువురు నతిఘోరముగఁ బోరుసల్పుచుండిరి. ఆసమయంబున నాకళయందుఁ బ్రవేశముగల వారెవ్వరైననచటనుండినచో వారి యుద్ధకౌశల్యమునకు మదిమెచ్చి "వహ్వా! వహ్వా!! యని పలికి తమ యానందమును బ్రకటించియుందురు. తుదకాయువతి భల్లమువలన కుమారభీమప్రతాపసింహుని జానువునందొక గాఢమగు గాయముతగిలెను. ఆభల్లమొక విధంబగు విషమునందు దడపఁబడియుండుటచే నావిషము దృటిలోవాని దేహమంతటను వ్యాపించి వానికి మూర్ఛను గలిగించెను.

---

## ఇరువదియైదవ ప్రకరణము.

—♦—

కుమార భీమప్రతాపసింహుని యనుచరులు వానికై పలుతావుల సంచరించుచు వెదకిచూచిరి. కాని, వానిజాడ యెచటనుఁ జూపట్టకుండెను. వార లటులాయడవియం దొక జాము రేయివఱకు వెదకివెదకి తుదకు నిరాశాచిత్తులై విక్రమగడమునకుఁబోయి కుమారభీమప్రతాపసింహుఁ డదృశ్యుఁడైన సమాచారమాద్యోపాంతముగ విక్రమసింహ భూపాలునితో విన్నవించిరి.

అంత నతఁడు వారిపై మండిపడుచుఁ, గొందఱుచారులను నైయారులను నచటికిరావించి, వారి కాయుదంతము నెఱింగించి, కుమారుని జాడ నరయఁబొండని వారిని బలుతావులకుఁ బుత్తెంచెను. కాని మూఁడుదినములు గతించినను వానిజాడ యిసుమంతయుఁ దెలియదయ్యెను.

విక్రమసింహ నరపాలుఁడొకనాఁడు తన యేకాంతమందిరమున నధివసించి, తన ప్రియపుత్రునియెడబాటునకు మదిగుందుచు, వివిధాలోచన నిమగ్నమానసుఁడై యుండెను. అంత నొకదౌవారికుఁడు తన యడుగుల చప్పుడువలన వాని యాలోచనలను భంగపఱచెను. విక్రమసింహభూపాలుఁడు శిరముపైకెత్తినతోడనే యాతఁడొక లేఖను వానికిఁజూపి "భూపాలాగ్రణీ! కోటద్వారమునొద్ద కావలియందు నియుక్తులయియుండిన భటులలో నొకని కొకఁడీయుత్తరము నొసంగి వెడలిపోయెను. వార లతనిని నిలిపి వృత్తాంతముల నరయఁదలంచిరి కాని, యతఁడతి నిపుణతతోఁ దప్పించుకొని వెడలిపోయె" నని విన్నవించెను.

విక్రమసింహనరపాలుఁ డాలేఖనందుకొని దానిని విప్పిచూచెను. అందుఁ దనప్రియపుత్రుని చేతివ్రాఁతను గుర్తించి యధికప్రమోదభరితుఁడై యందలి వృత్తాంతములను జదువఁదొడంగెను. ఆ లేఖ నామూలాగ్రముగఁ జదివినంతనే వాని మోమువికాసము డిందువడెను. ఆతఁడు సంభ్రమాయత్తచిత్తుఁడయి యిపుడేమి కావింపవలయునని మరల యోజనాసాగరంబున మునింగెను. ఆలేఖయం దీదిగువను లిఖించిన విధంబున వ్రాయఁబడి యుండెను.

"నన్నొక యసమాన సౌందర్యవతియగు యువతీరత్నము దన బాహుబలపరాక్రమముల నిర్జించి బంధించియుంచిన సమాచారము మీకెఱింగించుటకు మిగుల లజ్జించుచున్నాను. ఏమిసేయుదును? నిరుపాయుఁడను. ఆయుదంతమంతయు నేను విడుదల నొందివచ్చినపిదప తమ సాన్నిధ్యమున విన్నవించుకొనియెదను. మనవలన బంధింపఁబడి

యుండిన విజయేంద్రసింహమహీపాలుని మైయారులంద ఱేనాఁడు బంధి విముక్తులయి తమగృహములకు సురక్షితముగఁ జేరగలుగుదురో యా నాఁడు నాకు విముక్తిలాభముగలుగఁగలదు. మీరునాజాడ నరయఁబ్ర యత్నించుట వ్యర్థము. నే నతిగూఢస్థానమున బంధింపఁబడియుంటిని.

ఇట్లు

తమ యాజ్ఞాధీనపుత్రుఁడు,

భీమప్రతాపసింహుఁడు.

"అయ్యో! నాపుత్రుఁడు పరాక్రమవిహీనుఁడుకాఁడుగదా? ఇది మిట్టివిచిత్రము! ప్రబలవీర్య పరాక్రమనిర్జితుఁడగు వాని నొక యువతి బంధించియుండెనా? ఏమి! యీయబ్బురము! కాదుకాదు! ఆ యువతి వాని నేమాయోపాయముననో వచించి బంధించియుండవలెను. అటులయిన విజయేంద్రసింహుని మైయారులనందఱను విడిచిపుచ్చవల యునా? అకటా! నేనేమిసేయుదును? వారలెంతప్రయాసముమీఁద చేఁ జిక్కియుండిరి? వారలిపుడు సునాయాసముగా విడిపించుకొనిపోవుచున్నా రే!" ఇవ్విధంబున విక్రమసింహ నరపాలుఁడు చాలసేపటివఱకుఁ బర్యా లోచించుకొని పిదపనొక సేవకునిఁజీరి "బాకరల్లీమైయారుని పిలిచికొని ర"మ్మని యాజ్ఞాపించెను. అతఁడరుదెంచిన పిదప వానితో "వేగమే విజయేంద్రసింహుని మైయారులందఱను విడిచిపుచ్చుము. వారు తమ గృహములను జేరుదనుక మన బాలుఁడు బంధివిముక్తుఁడుకాఁజాలఁ" డ ని పలికెను.

బాకరల్లీ:— (అధికాశ్చర్యముతో) భూపాలా! మీరేమి వచియించు చుంటిరి. వింతగనున్నదే? మీపలుకులు నాకేమియుబో ధపడుటలేదు.

విక్రమ:— కుమారభీమప్రతాపసింహుని యొకయువతి బంధించియున్న ది. విజయేంద్రసింహుని మైయారులందఱు బంధివిముక్తుల

యి వారి గృహములకు జేరినగాని వానికి విముక్తి లాభము గలుగదఁట.

బాకరల్లీ:— అదిమీ కెటులఁ దెల్లమయ్యెను?

విక్రమ:— (లేఖవానికొసంగి) చూడుము. మనభీమపరాక్రమసింహుఁడు స్వయముగఁదన చేతి వ్రాఁతతో నాకీలేఖను వ్రాసియున్నాఁడు. ఈకమ్మవిషయమున మనముశంకింపఁ బనిలేదు.

బాకరల్లీ:— నిక్కమము. ఇంతకాలమదనుక గుమారునిజాడ తెలియకుండుటయే యాతఁ డెవరివలననో బంధింపఁబడి యుండినటుల దేలుచున్నది కదా?

విక్రమ:— ఆశ్చర్యము! ఒకయువతి తనబాహుబలపరాక్రమముల వలన మన భీమపరాక్రమసింహు నెటుల బంధింపఁ గలిగియుండెను? సరియే! ఈసవిస్తర వృత్తాంతమంతయుఁ గుమారుఁడిటకరుదెంచిన నాఁడు తెల్లముకాఁగలదు. విజయేంద్రసింహుని వైరూరులు తమగృహములకు జేరుదనుక కుమారుని స్వరూపమును గాంచనేరము. నిజపుత్రవియోగమునకు నాహృదయము తల్లడిల్లుచున్నది. సహింపనోప. నీవు వేగమే వెడలి వారినందఱను విడుదలసేయుము. మీరొకానొక కారణమున విడువఁబడుచున్నారని వారికి దెలుపరాదు. వారితో, "మాభూపాలునకును విజయేంద్రసింహునకును సంధి కుదిరియున్నది. మీరు శీఘ్రముగఁ గుమారిగడమున కేగుఁడని" తెలుపుము. అటుల వివరించుటవలన వారు మార్గమధ్యమం దాలసింపక సరాసరిగ కుమారిగడమునకుఁ బోయి చేరఁగలరు.

బాకరల్లీ యైయాపుఁడు తనస్థానమునుండిలేచి యాభూపాలునకుఁ జేమోడ్చి, పండితజగన్నాథుఁడు మున్నగువారలు బంధింపఁబడి

యుండిన కారాగృహమునొద్దకుఁ బోయిచేరెను. వారినందఱను జెఱ సాలనుండి వెడలించి "ఇపుడు మీకును మాకును వైరభావమెద్దియు లేదు. మీరు మీగృహములకుఁ బోవచ్చును. భూపాలు రిరువురిమధ్య సంధి కుదిరి యున్నది." అనెను.

పండితజగన్నా:— అయ్యది సంతోషవిషయముగదా! నీపలుకులు నిక్కమములయి యుండిన మాయైయారికక్షపాలలను నైదువులను మాకొసంగుము.

బాకరల్లీ:— ఔను. తీసికొనుఁడు. అభ్యంతర మేమికలదు? నేనిపుడే వానినిదెప్పించి మీకొసంగెదను. కాదు. నేను స్వయముగఁబోయి వానినన్నింటిని గొనితెచ్చెదను.

ఇవ్విధంబున బలికి బాకరల్లీ మైయారుఁ డిరువురుసేవకులను వెంటఁదోడ్కొని తనగృహమువైపునకు వెడలెను. ఇట పండితజగన్నాథుఁడు మున్నగువార లేకాంతమునుగని యిటుల సంభాషింపఁదొడంగిరి.

విష్ణు లుఁడు:— మిత్రులారా! నేడు మన మప్రియత్నముగ బంధవిముక్తులమగుచున్నాము. హేతు వేమైయుండును?

యోగీంద్ర:— ఎక్కడిసంధి — ఎక్కడిస్నేహము! ఇందెద్దియో గురుతరహేతువు తప్పకనుండవలెను.

జాలిమ:— విక్రమసింహుఁ డేకారణముననో నిరుపాయుఁడై మనలను వీడిపుచ్చుచున్నాఁడు.

రమేశ:— ఏమి! రజతేంద్రసింహా! నీయభిప్రాయ మేమి?

రజతేంద్ర:— నేను వారియుద్దేశ్యమును బాగుగ గ్రహించియుంటిని.

పండితజగన్నా:— నీవేమి గ్రహించియుంటివో వ్యక్తీకరింపుము!

రజతేంద్ర:— విక్రమసింహుని పక్షమువారిలో నొక ముఖ్యుఁడు మన వారివలన బంధింపఁబడి యుండవలెను. "మాయైయారు లు కుమారిగడము చేరుదనుకవానికి విముక్తిలాభము గలు

గదని మనపక్షమువారు వార్తనంపియుండవలెను. అందువలన విక్రమసింహనరపాలుఁడు వివశుఁడై మనము శీఘ్రముగఁ గుమారిగడము జేరవలయునను దలంపుతో నీయుక్తిని బన్నియుండెను.

పండితజగన్నా:— సెబాసు! నీవు బాగుగ యోజించితివి. దానియం దెంతమాత్రమును సందేహములేదు. విక్రమసింహుని భార్యగాని పుత్రుఁడుగాని పుత్రికగాని బంధింపఁబడియుండవలెను. తదితరు లెవ్వరేనియుఁ బంధింపఁబడియుండిన వానికింత యాత్రమేల కలుగను?

రజితేంద్ర:— నిక్కువము. మనము వీరివలన గొంత దక్షిణను బడిసి కాని యిచటనుండి వెడలరాదు.

పండితజగన్నా:— నేనెట్టియాటలాడుదునో మిన్నకఁజూచుచుండుఁడు.

రజితేంద్ర:— (నవ్వుచు) మిత్రులారా! నేను విక్రమసింహునితో నిటుల స్పష్టముగ జెప్పివైతును. నేను సరాసరిగ కుమారిగడమునకుఁ బోఁజాలను. కారణంబేమన, నాపాదములు నొచ్చుచున్నవి. పాదచారినై వెడలిన మూఁడుమాసములకైనను గుమారిగడము జేరఁజాలను. అశ్వారోహుఁడనై యేకుదమున్న దానిపైని పాదములను వ్రేలాడవైచుకొని కూర్చుండఁజాలను. శకటముపైని యెక్కకుండుమనని యిదివఱకే శపథము బూని యుంటిని. అందలమెక్కుదమన్న నందు స్త్రీలును క్షతగాత్రులును రోగగ్రస్తులును జమీందారులు మాత్రమెక్కుదురు. ఇఁక నేనేనుఁగుపై నెక్కి పోవలయును. దానిపైనైనను నంబారిలేక యే యధిష్టించు నాచారము నాకు లేదు. ఇదియునుఁగాక ననమాన శేముషీసుశీలుఁడగు మంత్రిపుంగవుఁ డభయసింహుని యనుఁగు పుత్రుఁడు పైఁడియంబారి

యందుగాని పరివేణిపైనిఁ గూర్చుండఁజాలఁడు.

విఠ్ఠలుఁడు:— మిత్రులారా! బాకరల్లీ నన్ను చకితునిగ నొనరించి యుండెను. నాప్రాణములు పోయినను సమ్మతించెదనుగాని వానిముక్కు పిండి రసమువడియకట్టక యే యిచటినుండి తర లు వాఁడనుగాను.

విఠ్ఠలుని పలుకుల కెల్లఱుహసించుచుఁ జాలసేపటివఱ కట్టివి థం బులగు విషయములను సంభాషించుచుండిరి. అంత బాకరల్లీమియాఁడు భటులవెంట నచటికి వచ్చిచేరెను.

బాకరల్లీ:— ఇవిగో! మీకక్షపాలలను గైజారులను గైకొనుఁడు.

రజతేంద్ర:— నీవేమియు దొంగిలించియుండవుగదా? మాకక్షపాలల యందుఁబెక్కు పైఁడిటంకము లుండవలెను.

బాకరల్లీ:— మీరువ్యర్థముగ లేనిపోని యాలాపము లేల పలికెదరు?

రజతేంద్రి:— (ముఖమునుజిట్లించుచు) ఓహో! వీని పలుకులవలన మన దీనారములు లూటాయించినట్లుఁ దోఁచుచున్నది. (తన యనుచరులవైపునకుఁగాచి) మిత్రులారా! మీమీసామానులను జూచుకొనుఁడు!

విఠ్ఠలుఁడు:— (తనకక్షపాలయందలి సామానులను వెడలించిజూచి) బాగుబాగు! మనము కుమారిగడ్డనుండి వెడలునపుడు దారిబత్తెములకై మనసర్కారువారొకొకనికి నూరేసిబం గరు నాణెములనొసంగియుండిరికదా? అవియేమయ్యెను. ఇం దుఁ జూపట్టకున్నవి.

రజతేంద్రి:— సోదరా! నాయొద్ద బంగరు నాణెములేకాక నవరత్న ములతోఁ బొదుగబడిన యొకచిన్న యలంకారమును గల దని తొట్రుపడుచుఁ దనకక్షపాలలోని వస్తువులను వెడలిం చి యందు వెదకుచు,” ఇఁక నేమికలదు? నాధనమంత

యుంబోయినది. నేనెటుల కుమారిగడమున కేగుదునని గం
దరగోళము సేయసాగెను.

పండితజగన్నా:— మంచిపరిహాసమే! పృథ్వీశులిరువుర మధ్య సంధి
పొసగియున్నది. ఆసంతోషాతిశయమున మనము కొల్లంగొ
నబడితిమి. నడువుండు. విక్రమసింహభూపాలుని సమీపము
నకేగి మనయిక్కట్టులం దెలియజేయుదము. వారు మన ప
లుకులను జెవిబెట్టిన సరియే! కానిచో,యాస్థానముననే మ
నశిరములను ఖండించుకొందము. ఇవ్విధంబున సర్వస్వము
ను గోల్పోయి మనగృహముల కెటులేగగలము?

వారిపలుకుల నాలించి బాకరల్లీ మైయూరుండు తబ్బిబ్బుప
డుచు తన మానసంబున నిటులం దలపోయందొడంగెను. "ఆహా! వీరలధి
కోత్పాతములను గలిగింపనున్నారు. ఒకండు నాబంగరునాణెములు మా
యమయ్యెననుచున్నాండు. ఒకండు తనరత్నముల నగ పోయెననుచున్నాం
డు. మఱియొకండు నేనుకొల్లంగొనబడితినని వగచుచున్నాండు. ఇపుడునే
నేమ సేయుదును? ఎటులయిన వీరలు శీఘ్రముగం గుమారిగడమున కే
గవలయునుగదా? అపుడుగాని కుమారభీమప్రతాపసింహునకు విముక్తి
లాభముగలుగదు. వీరి కొకమాఱు భీతిగొల్పిచూచెదనుగాక" యని
తలంచి వారితోనిట్లనియెను.

భాకరల్లీ:— చూడుండు. మీరీ తుంటరితనమును గట్టిపెట్టుండు. కాని
చో మరల బంధింపంబడుదురు.

పండితజగన్నా:— చిత్రము. నేనయ్యదియే తలంచుచున్నాను.

విఠ్ఠలు:— ఔను. మేము మాసొత్తుల నడుగుచుంటిమి కావున తప్పక
బంధింప బడుదుము. మేము మాఱుపలుకక నిచటినుండి వెడ
లుటమంచిది. నీవు మాధనమంతయు నపహరించి ధనవంతుం
డవు కాంగలవు. ఇతరులెవ్వరు నీవిషయమెఱుంగరాదు.

రజితేంద్ర:— నీపరీక్ష నీయింటియందుఁ జూపుకొనుము. ఇచట బనికి రాదు. మాసొత్తులను మా కొసంగుము. కానిచో, భూపాలు నొద్దకు నడువుము. వారి యెదుటమన తగవును బరిష్కరించు కొందము.

బాకరల్లీ:— మంచిది. నడువుఁడు.

అందఱు:— నడువుఁడు. నడువుఁడు.

ఈపరిహాసకులదండు బాకరల్లీ వెంట విక్రమసింహనరపాలుని సమీపమునకుఁబోయిచేరిరి.

బాకరల్లీ:— (విక్రమసింహనరపాలునితో) భూపాలా! చూడుఁడు. వీరు లేనిపోని కలహమును బెంచుచున్నారు!

రజితేంద్ర:— మాసొత్తులను మాకిమ్మనుట కలహమాయెను.

విక్రమ:— సమాచారమేమి?

రజితేంద్ర:— మహారాజా! వినుఁడు. మాభూపాలునకును మీకును సఖ్యత యొడగూడియున్న మేము బంధింపఁబడినపుడు కొల్లగొనియుండిన సొత్తులు మాకు మరల లభింప వలయునో లేదో మీరే వచియింపుఁడు.

విక్రమ:— ఔను. తప్పక లభింపవలయును.

రజతేంద్ర:— భగవంతుఁడు మిమ్ము నిరంతరము గాపాడుచుండుగాక! మీన్యాయపరిపాలనము స్థిరముగ నెలకొనియుండుగాక! భూపాలాగ్రణీ! అవధరింపుఁడు. మాసొత్తులను మాకొసంగుమని బాకరల్లీమైయారుని మేమడిగితిమి. అతఁడు మా కత్తుపాలలను ఖైదువులను నొసంగియుండెనుగాని, మాకత్తు పాలలయందుగల ధనమంతయు మాయమైయుండెను. రెండేసి దీనారములు పదియిరువదిరూప్యములు మాత్రము మాకత్తుపాలలయందు విడిచిపెట్టెను. మిగతసొమ్మంతయు

తన గోతియందుఁ బాతిపెట్టుకొనియున్నాఁడు. మాకున్యా యమును దయచేయుఁడు. అదియంతయు మీహస్తగత మందుఁగలదు.

విక్రమః— (బాకరల్లీతో) ఈతగవు యెట్టిది?

బాకరల్లీః—మహారాజా! ఇదియంతయుఁగల్ల. వీరునన్ను వంచించుటకుఁ బ్రయత్నించుచున్నారు.

రజతేంః— ఔను. మేమెల్లర మనృతవాదులము. నీవొక్కఁడవే సత్య సంధుఁడవు.

విక్రమః— (రజతేంద్రసింహునితో) పోనిమ్ము! మీకుకోల్పోయినవా నిని నావలన గ్రహించి మీగృహములకు వెడలిపొండు. నేను బాకరల్లీ విషయము తరువాతఁ జూచుకొనియెదను.

రజతేంః— భూపాలా! మాలోనొక్కొక్కరికి నూరేసిదీనారములు పో యియున్నవి. నాకు పైగా నొక నవరత్నములనగయుపోయి యున్నది. ఏమిసేయగలము. ఇందు మీదోషమేమికలదు? కానిండు. వేయిదీనారములను మాకొసంగుఁడు. మాసొ మ్మింకను నధికముగపోయియుండెను గాని మిమ్మేలబాధిం పవలయును?

బాకరల్లీః— మిత్రులారా! ఇంతయన్యాయమా! ఇది మీకుతగునా?

రజతేంః— సాహేబుగారు! మే మన్యాయము చేయుచున్నామా? సరియే! మాకొకరువ్వయైనను నగత్యములేదు. మేముమా సొత్తంతయు నొకనికి దానమిచ్చితిమని తలంచెదము. ఇఁక మేము కుమారిగడమునకు బోవునదృష్టము మాకులేదు. మాసొత్తంతయు గోల్పోయి యేముఖములతో మాగృహ ములకుఁ బోగలము. (వెడలఁబోవును)

విక్రమః— నీవటులేల వేగిరించెదవు? మీకు పోయినధనమంతయు

నేనొసంగుచున్నాను.

విక్రమసింహనరపాలుఁడు కోపోద్దీపితమానసుఁడై శాకరల్లీ వైపునకు దిలకించి, వానినిఁ బెక్కువిధంబుల దూషింపసాగెను. పాప మతఁడే మి సేయఁగలఁడు? కొంతదవ్వునకుఁ దొలఁగి నిలచి యుండెను. పిదప నా భూపాలుఁడు వేయి దీనారములను దెప్పించి రజితేంద్రసింహున కొసంగెను. పండిత జగన్నాథుఁడు మున్నగు మైయూరు లందఱా దీనారముల ను దమతమకక్షపాలలయందు భద్రపఱచుకొని లేచి నిలిచిరి. మేము గలిగించిన యుత్పాతములను సహించుటకు మీలో నెవరు చెఱఁబడియుం డిరని మైనను వారిని బ్రశ్నింపలేదు. కాని, విక్రమగడము దాఁటిన పిదప భీమప్రతాపసింహుఁడొక మైయూరివలన బంధింపఁ బడియుండినటుల వారు తెలిసికొనిరి.

వారలు సరాసరిగ కుమారిగడమువైపునకు దారిపట్టి మఱునటిదినము సాయంతనసమయమున నొక రమ్యస్థానమును జేరఁగలిగిరి. అచటికి గుమారిగడము పది క్రోశుల దవ్వు మాత్రము గలదు. అంత నొక యాశ్వికుఁడు తన తురంగమును బర్వెత్తించుచుఁ దమవైపున కరుదెంచుచుండుట వారలు కనుగొనిరి. ఆ యాశ్వికుఁడు తమ్ముఁ సమీపించిన తోడనే యాతఁడు విక్రమసింహ నరపాలుని పుత్రుఁడు భీమప్రతాపసింహుఁడని రజితేంద్రసింహుఁడు గుర్తింపఁగలిగెను.

కుమార భీమప్రతాపసింహుఁడా మైయూరులను జూసి తన వారువము నాపి యచట నిలచెను. మఱియు దనకుఁ బరిచితుఁడుగు రజితేంద్రసింహుని వైపునకు గాంచి హసించెను.

రజితేంద్ర:— రాకుమారా! మీకు బంధనవిముక్తి యెటుల గలిగెను? (తన యనుచరుల వైపునకుఁ గని) "మిత్రులారా! విక్రమసింహ నరపాలుని పుత్రుఁడీతఁడే" యనెను.

భీమప్ర:— మీ విడుదలయే నాబంధ విముక్తికి గారణము.

రజితేంద్ర:— మిమ్ముమా యనుచరులలో నెవరు బంధించిరి?

భీమప్ర:— అది నేనెఱుంగను. నేను వేటాడు సమయంబున నశ్వారూఢయగు నొక యువతి విషమున దడిపిన భల్లముతో నన్ను గాయపఱచెను. నేను వెంటనే కళనొందితిని. పిదప నన్నొక కొండగుహలోనికిఁ గొనిపోయి తేఁకువను గలిగించి చికిత్సలను గావించి నన్నారోగ్యవంతునిగ నొనరించెను. ఆయువతి యెవ్వరో నేనెఱుంగను.

రజితేంద్ర:— (మంచిది) ఇపుడు మీరు శీఘ్రముగ బ్రాసాదమునకు బోయి చేరుఁడు. కాని, మీరీవిషయములను జ్ఞప్తియందిడుకొన వలసియున్నది. మీ జనకుఁడు వ్యర్థముగ మాపైఁ బగబూని యున్నారు. మున్ను మీజనకుఁడు కుమార విజయేంద్రసింహుని వలన బంధింపఁబడినపుడు జగత్సింహభూపాలుఁడు వారితో, "భూపాలాగ్రణీ! మీరు మాయెడల వైరభావమును ద్యజించి కుమారిగడమునందు నివసింపు చుండుఁడు. మీరు కోరిన పదవి నొసంగెదమని పెక్కువిధంబుల బోధించి యుండిరి. కాని, యవి యన్నియు బూడిదబోసిన పన్నీరు చందమాయె. అపుడు వారి మానసం బధ్యాత్మిక చింతయందు హత్తియుండెను. కానలకేగి మునివృత్తి నవలంబించి సమాధిబలమున బ్రహ్మానంద సంపదను చూఱగొనఁ దలంచియుండిరి. కాని యిపుడు మరల వారిని రాజ్యకాంక్ష పీడించుచున్నది. మంచిది. మాకేమి? వారి జీవితమంతయు నిట్టివిధంబులగు కష్టపరంపరల గడువ వలసి యుండిన మెవరేమి సేయగలరు? కుమారిగడాధీశులయి యున్న కాలముననే వారు కుమార విజయేంద్రసింహుని పైవిజయము బడయ జాలరైరి. ఇపుడేమి సేయఁజాలుదురో మేమూహిం

పఁ జాలకున్నాము.

భీమప్ర:— నేను యదార్థమును వక్కాణించుచున్నాను. వారి యాచరణాదికములు నాకు హితకరములు గావు. కాని నేనేమి సేయుదును? నిజ జనకునికి విరుద్ధముగ జరియించుట పుత్రిధర్మము గాదుకాదా?

రజతేం:— మీకు నిరంతర మిట్టి ధర్మచింత గలిగి యుండునటుల పరాత్పరుఁ డనుగ్రహించు గాక! మంచిది. పోయిరండు.

కుమార భీమప్రతాపసింహుఁడు తన యశ్వము నదలించి విక్రమగడము వైపునకు దారిపట్టెను. మన మైయూరులారాత్రి యంతయు నచటగడపి తెల్లవాఱిన తోడనే మరల బయనంబై కుమారిగడము వైపున కడుగులిడుచుఁ బోవుచుండిరి.

---

## ఇరువదియాఱవ ప్రకరణము.

కుమార నరేశసింహుఁడు తన ప్రాణప్రదాతయగు సిపాయి వెంట నేకొండ గుహలోని కేగి యొక యువతి తలక్రిందుగ వ్రేలాడు చుండిన మనుష్యుని వీఁపుఁ గోయుటను దిలకించి యుండెనో, మఱియు నొక సమున్నతాకారయగు యోగిని యందుఁ బ్రవేశించి యెల్లరకు మూర్ఛగలిగించియుండెనో యాపర్వత కందరములోనికి మాపాఠక మహాశయులను మరల వెంటఁగొని పోవుచున్నాము.

కొంత సేపయిన పిదప నాయోగిని కుమార నరేశసింహుని విడచి తక్కుంగల వారలందఱుకుఁ జైతన్యమును గలిగించెను. తదనంతరము మూర్ఛాగతుఁ డయి పడియుండిన కుమార నరేశసింహుని యెత్తి యొక మూల నునిచి, యుఁ వ్రేలాడు చుండిన మనుష్యుని మరలవారు బాధిం

పసాగిరి. మహేంద్రసింహుని వృత్తాంత మెఱింగింపుమని వాని వీఁపు కత్తితోఁ జీల్చుచు వేదింపఁదొడంగిరి. వాని దేహమంతయు ఖండతుండములుగ నఱికినను నామనుష్యునినోట, వానిమేనున బ్రాణమున్నంతవఱకు, "నేనేమియు నెఱుంగ" నను పలుకు దక్క వేఱెద్దియు వెడల దయ్యెను. ఆపట్టుబానిసీఁడు తొలుతనే యచట నొక గోయి త్రవ్వి యుంచెను గదా? వాని యూపిరి వెడలినతోడనే వాని నాగోతియందు బూడ్చివైచిరి.

తదనంతర మాయోగిని సిపాయివైపునకుఁ బరికించి, "నీవు వెలుపలకేగి వృక్షశాఖలను ఖండించి యొక చిన్న డోలికను నిర్మింపుము. మఱియు దానిపై నరేశసింహుని బరుండపెట్టి యీకుఱ్ఱఁడును నీవును గలసి దానిని మోసికొని పోయి, వానికి దెలివిగలిగిన పిదపఁ బ్రాసాదములోనికి వెడలుట కనువుగా కుమారిగడ దుర్గ సమీపమున డించవలెను. జాగ్రత్త! వాని కెట్టిశ్రమయు గలుగగూడదు సుమా! వానికి తేఁకువగలుగుటకుఁ బ్రయత్నించి పిదప నీవచటినుండి తొలఁగి పొమ్ము. మమ్ములను గలిసికొను యావశ్యము గలిగిన నీవీస్థానమునకే యరుదెంచుము.

సిపాయి:—మంచిది. నేనయ్యదియే యుచితముగఁ దలంచుచున్నాను. నరేశసింహున కేల శ్రమగలుగఁ గలదు? నాకు మాత్రము వాని చింతలేకుండెనా?

యోగిని:—ఎందుచేఁ గలుగదు? వాని యందలి చింత మాకంటె నీకధికముగ గలిగి యున్నది. మంచిది. ఇఁక నాలసింపకుము. వెడలిపొమ్ము. నీ కుచితమనితోచిన విధంబున నీ కార్యముచు నిర్వహింపుము. మేము మాకార్యాచరణమునకై యేగుచున్నాము. (కత్తితో శవమును గోసిన యువతివైపునకుఁ గని) "సోదరీ! నడువుము. మనము వెడలుదము. ఈబాలిక

యిచటనే సురక్షితముగ నుండఁగలదు. పిదప నెయ్యది క
ర్తవ్యమో యోజింప నగును.

ఆయిరువురి స్త్రీల వృత్తాంతములను మేమింకను లిఖించ వలసి యున్నది. వారి నిజవృత్తాంతములును నామములును మనకుఁ దెలియు దనుక వారికిఁ గృత్రిమ నామము లిడవలసియున్నది. ఆయిరువురిలో నొక స్త్రీకి యోగిని యను నామకరణ మిదివఱకే చేసియున్నాముగదా? రెండవ స్త్రీ నామము వనచరి, యని యిపుడు తెలిసికొనుఁడు. ఆయో గినీవనచరు లిరువురు నాకందరమునుండి వెలుపలికి వెడలి దక్షిణదిశగా వంగుచు పాశ్చిద్దిశ మార్గమును బట్టి పోవుచుండిరి. అపుడా సమయము నిశాంతమై పాశ్చిద్దిశ యందు ధవళవర్ణముతోపాటు రెండు మూఁడు తార కములు మాత్రి మాకసమందుఁ బ్రికాశించుచుఁ జూపట్టుచుండెను.

ఒక జాము పొద్దుగడచు దనుక వారిరువురు సరాసరిగ నడచి పోవుచునే యుండిరి. క్రిమముగ సూర్యరశ్మి తీక్ష్ణతను వహించుటఁ గని యా యువతులిరువురు నాయడవి యందలి దట్టమగు నొక భూరుహ చ్ఛాయ యందు నిలిచిరి. ఆసమీపముననే యొక వెల్లువ నిర్మల వారి పూరితమైప్రివహించు చుండెను. ఆయువతులిరువురు దమ దోగ్మాల ములందలి కక్షపాలలను వెడలించి కొన్ని ఫలములను దీసి భుజించి జల ములను గ్రోలిరి. పిదప భూమిపై మృదులపత్రిములను బఱచుకొని వానిపయిఁ బరుండిరి.

ఆయువతు లిరువురు రాత్రియంతయు జాగరణమున గడపి యుం డిరికదా? ఆతలిరులశయ్యపై మేను వాల్చిన తోడనే వారిని నిద్రాదే వి యావహించెను. రెండుజాములవఱకు వారిరువురుగాఢ నిద్రియం దు సొక్కి యుండిరి. పిదప నొకజాము పగలుండగ లేచి కూర్చుండిరి. వార లాప్రివాహజలముల కరపాదములను గడుగుకొని ముఖప్రిక్షాళ నము గావించి మరల బయనంబైరి. వారలవ్వీథంబున నమయ సమ

యములయందు నిలుచుచు, గొన్నిదినంబుల వఱకుఁ బ్రయాణమును సాగించిరి. ఒకనాఁ డర్ధరాత్రము వఱకు సరాసరిగఁ బోయిన పిదప వారలొక పర్వతమునకుఁ జేరి యుండిన తటాకము నొద్దకుఁ బోయి చేరిరి.

మిక్కిలి విశాలమై యందముగ జూపట్టుచున్న యా తటాకమునకు నలువైపుల జలము లోనికి దిగిపోవుటకు కాలుజాళ్ళతో సోపానములు కట్టఁబడి యుండెను. ఆ తటాకతీరమందలి భూమిపై నలువైపుల కూర్చుండుట కనువుగా సింహాసనములవలె జలువరాతి తిన్నెలు నిర్మింపఁబడి యుండెను. ఇఁక నాశ్చర్యకరంబగు విషయ మొండు కలదు. ఆ తటాకము మధ్య నిలిచియున్న శంకువు దారునిర్మితముగాక పిత్తళితో నిర్మింపఁ బడియుండెను. ఆస్తంభమున కిరుపార్శ్వంబుల నిరువురు మనుష్యులు నిలుచుండి తమచేతులను గలుపుటకుఁ బ్రయత్నించిన నయ్యది సాధ్యముగాని విధంబున విరివిగలిగి యుండెను. ఆపిత్తళికంబము పైని లోహనిర్మితంబగు వికృతాకారముగల యొక మానవుని శిరము గలదు.

ఆ తటాకమునకు నలుకెలంకుల సఘనవృక్షములు బాగుగఁ బెఱిగి యుండెను. వాని శాఖ లొండొంటితో దట్టముగఁ బెనుకొని యుండెను. ఆ యోగినీ వనచరులిరువు రాతటాకతీరమున గొంతవడి నిలిచి దాని శోభను దిలకించు చుండిరి. పిదప నాయిరువురు దటాకమువైపునకు ముఖముల ద్రిప్పి యొక వేదికపైఁ గూర్చుండిరి. ఆవేదికల వెనుకతట్టు కుడ్యములు నిలువెత్తు పొడవు గలిగి యుండెను.

అంత నాకస్మికముగ నాతటాకము మధ్య కంబము సమీపమున బుడబుడ చప్పుడులతో నచటి జలము కలఁగబాఱెను. తోడనే యొక వ్యక్తి యాజలముల దేలియాడుచుఁ జూపట్టెను. యోగినీ వనచరులిరువు రావ్యక్తివైపునకుఁ దదేకదృష్టిఁ జూడఁ దొడంగిరి. ఆ వ్యక్తి యా జలములందుఁ దేలియాడుచుఁ దీరమునకరుదెంచి సోపానపరంపరలను దాఁటి పైమెట్టుపయి నిలుచుండి నలుదెసలఁ బరికించు చుండెను.

ఇపు డావ్యక్తి యొక యపూర్వ లావణ్యవతియగు సుందరియని యో గినీవనచరు లిరువురు గ్రహించి తటాలున నావేదిక వెనుకకుఁ బోయి డాగియుండిరి. మఱియు నామె వైపునకు గాఢదృష్టిఁ బరికింపసాగిరి.

ఇపుడా తటాక జలములనుండి వెడలివచ్చిన సుందరాంగి మిక్కిలి లేఁబ్రాయమందుఁ గలదు. ఆమె యటులాసోపానముపై నిలచి యిటున టుఁ బరికించి నలుగడల నిస్తబ్ధత వ్యాపించి యుండుటఁ గని తన వస్త్ర ముల జలమును బిడిచి గాలి యందార్చుకొనెను. కొంత సేపయిన పిద ప నామె తన వస్త్రములను బాగుగ సవరించుకొని యొక వైపునకుఁ దారిపట్టెను.

మన యోగినీ వనచరు లామె జాడ నరయుటకే యచటికరు దెంచి యుండినటుల తోఁచుచున్నది. ఎపుడా యువతి వెడలఁదొడంగె నో యోగినీవనచరు లిరువురు చయ్యన నామెను వెంటాడి బలాత్కా రపూర్వకంబుగ నామెను బంధించుటకుఁ దలంచిరి. కాని యటుల కాఁ జాలదయ్యెను. ఆ తొయ్యలియు యోగినీ వనచరులు తన వైపునకు ర యమున వచ్చుచుండుటను గాంచి వారిని యెదిరించుట వలన దనకు వి జయము చేకూరదని శంకించి, యచటినుండి మరలి వడివడి నా తటా కతీరమందలి యొక వృక్షము పై నధిష్టించెను. ఆవిధమును గని యోగి నీవనచరులును నావృక్షతలమునకుఁ బోయి చేరిరి. యోగిని యచట నిలిచి యుండెను. వనచరి యామెను బంధించుటకు బిరబిర నాభూరుహ ముపై నారోహించెను.

ఆ పాదపముల శాఖ లొండొంటితోఁ బెనుగొని యుండెనని మే ము పైనలిఖించి యుంటిమిగదా? వనచరి యటులా వృక్షము నధిరో హించుటఁ గని యా జలచరి పైభాగమున నుండి యే మఱియొక వృ క్షముపైకి లంఘించెను. దానిని గాంచి వృక్షతలంబున నిలిచి యుండిన యోగినియావృక్షమునకుఁ జేరువున గల మూఁడవ మ్రాను సమీపము

నకేగి దానిపై నధిష్టించి, జలచరి యిపుడెచటికి బోఁగలదని యోజించు చుండెను. కాని యామె తలంపు మిథ్యయయ్యెను. అంత నాజలచరి తానిరుదెసలనుండి పగతురాండ్రచేఁజిక్కఁ గొనియుండుటనెఱింగి సత్వరముగఁ గ్రింది శాఖలమీఁదకుఁ బోయి యచటినుండి భూమిపైకి జారి తటాలున నాతటాకజలంబుల నుఱికెను. యోగినీవనచరులు తమ ప్రయత్నములు చెన్నుటిపోవుటఁ గని యా వృక్షములనుండి యవతరించి యా జలచరివలెఁ దామును నీటియందు బడిరి.

---

## ఇరువదియెడవప్రకరణము.

భాస్కరభగవానుఁ డస్తాచలముమాటున డాఁగుటకు వేగిరించుచుండెను. సాయంతనసమయంపు మలయానిలము తన మైకంపునడల నల్లనల్లన వీతెంచుచు సకలప్రాణుల కాహ్లాదమును గూర్చుచుండెను. గాఢతరనీలాకాశము సంయమీంద్రుని మానసంబువలె నిర్మలమై నిష్కలంకమై యొప్పారుచున్నది. ప్రచండమారుతోద్ధతిఁ దూలరాశిఁజోలి కూడియుండిన మేఘశకలములు చిందఱవందఱలై యంతరించియుండెను. అస్తోన్ముఖుండగు దినకరునియరుణకాంతులు దిక్తటంబుల వ్యాపించియుండెను. చిత్రవిచిత్రవర్ణంబులఁ దేజరిల్లు యింద్రధనుస్సుత్తరదక్షిణదిశలుగా వ్యాపించి యాకసమునకు నూతనశోభను గూర్చుచుండెను. శృంగారవనమందలి ఫలపుష్పవృక్షంబులమీఁదను సుందరకుసుమసంభరితగుల్మలతాదులమీఁదను బ్రకృతికాంత యొకగంటకుఁ బూర్వము వర్షబిందువులను జిలుకరించియుండెను. జలంబులచేఁజక్కఁగఁ దడిసియుండిన వివిధవర్ణంబుల వృక్షపత్రములును ధౌతకుట్మలములును జూపఱమానసంబులకు నధికముదంబును గూర్చుచుండెను. ఆ పుష్పంబుల కొకతట్టురంగు స్వభావసిద్ధమైనదే! కాని రెండవవైపు సంధ్యాను

రాగదీపితములై స్వర్ణకాంతుల నీనుచుఁ గమ్మని తెమ్మెరలను వెదజల్లుచున్నవి. ఆహా! "పసిండికి పరిమళమబ్బె" నను నార్యోక్తిఁ జెప్పుచు వినుచుంటిమి. కాని నేఁడు మనకన్నుల యెదుటఁ బొడకట్టుచున్న యీ పుష్పరాజములు చరితార్థ మొనరించుచున్నవి. చూడుఁడు! ఆ పొదలయందు విన్నాణముగ వికసించియున్న ధౌతచంపకకుసుమములు దినకరుని యంతిమారుణకిరణజాలపతితంబున బంగరు పూవులను బూచియున్నవో యనునటుల నయనేంద్రియములను వంచించుచున్నవికదా? ఆయుపవనమునకు మధ్యఁ బెఱుగుచుండిన పచ్చికదుబ్బు లతినిపుణతతో గత్తిరింపఁబడి పచ్చని మొకమలు తివాసీ యచటఁ బఱచియుంచిరో యనునటుల తోఁపింపఁ జేయుచున్నవి. వానికి నలువైపులఁ జిత్రవిచిత్ర వర్ణపత్రంబులఁ జెన్నొందుచుండిన కోండజాతిమొక్కలు తమసౌందర్యగరిమచే నెటుల శోభిల్లుచున్నవో పరికింపుఁడు. పొద్దుతిరుగుడుపువ్వులు రవి యేవైపునఁ జరించుచుండిన నాదెసకుఁ దమముఖములను ద్రిప్పుచుండునని వచియించుచుందురు. కాని, నేఁడు ప్రకృతికి విరుద్ధముగ మనకెట్టయెదుటఁగల సూర్యానువర్తినీవృక్షములందలి పుష్పములస్తోన్ముఖుండగు ద్యుమణివైపునకు దమవీఁపుల నునిచి యీ సుందరోద్యానమందలి సౌధోపరిభాగముననిలచి పశ్చిమదిశకుఁ దిలకించుచుండిన యసమాన సౌందర్యసముజ్వలాంగియగు యొక సుందరాంగి కాంతి విస్ఫురితాననము వైపున కనిమేషదృష్టి నేల పరికించుచున్నవి? ఆవైపుననుండియే యాశృంగారవనములోని కరుదెంచు మార్గము గలదు. ఆ బిబ్బోకవతి యెవరిరాకకో ప్రతీక్షించుచు సహస్రకరుని సూక్ష్మ కిరణములను సహించుచు నాద్వారమువైపునకుఁ దదేకదృష్టి వీక్షించుచుండెను. అపూర్వ లావణ్యభాసమానయగు యాబింబాధరి ముఖమండలము స్వేదబిందుసందోహావృత మయ్యెను. ఆమె యెవరి రాకకై ప్రతీక్షించుచుండెనో వారి ఛాయయైనఁ నామెకుఁ జూపట్టకుండెను. ఆమె

కొంతకాల మాసుందరోద్యానమందువిహరించుచుఁ దనమనస్సునకూరట గలిగించుకొనఁదలంచెను గాని, మార్తాండుఁడస్తమించుటయుఁ గ్రమముగనంధకారము నలుదెసలనుండి క్రమ్మి వచ్చుచుండుటయుఁ గని సంక్షుభిత హృదయయై యావిద్యుల్లతాంగి సౌధోపరిభాగము నుండి క్రిందికి దిగి తన శయనాగారమందుఁ బ్రవేశించెను.

ఆ మందిరాలంకార మపూర్వమై కన్నులపండువు గావించుచుండెను. మిద్దెనుండి గులోబులును బహుశాఖావిలసితంబులగు కాఁచదివ్వెలును వ్రేలాడుచుండెను. కుడ్యములపయి పలువిధములగు చిత్తరువులు చిత్రింపఁబడి యుండెను. భూమిపై నమూల్యరత్న కంబళమొకటి పఱచఁబడి యుండెను. ఆ గదియందొక వైపున సింహాసనమును రెండవతట్టున నొక యమూల్య హంసతూలికాతల్పమును యా మందిరమునకు వన్నె గూర్చుచుండెను. ఆ గద్దియ కిరుపార్శ్వంబుల రెండు దివ్వెలు ప్రకాశము నొసంగుచుండెను. ఎలప్రాయమున నివ్వటిల్లుచుండిన కొందఱు యన్నులమిన్న లాపర్యంకముపై బూవులను బఱచుచుండిరి. కొందఱు పుష్పహారములను గూర్చుచుండిరి. మఱికొందఱు పూలగుచ్ఛంబులతో నామందిరము నలంకరించుచుఁ జూపట్టుచుండిరి.

కుమారి చంద్రకళ యటులా మందిరము జొచ్చి యాపర్యంకముపయి మేనువాల్చి దుకూలాంచలముతోఁ దన మోము గప్పుకొని దురంతచింతాగ్రస్థయై వివిధాలోచనానిమగ్నమానస యగుచుండెను. అచట నుండిన పరిచారికలలో నొకతె వీవెనను జేతఁబూని యామెకు విసరుచుండెను. ఆమె యటులుదాసీనయై యుంటఁగని తక్కుంగల పరిచారికలు నీరసభావముతో నచట నిలిచి పర్యంకము వైపునకుఁ గాంచుచుండిరి.

కొంతసేపటివఱ కామందిరమున నిస్తబ్ధత వ్యాపించి యుండెను. తదనంతర మెవ్వరిపాదముల సవ్వడియో వారినిఁదొట్రుపఱచెను.

ఎల్లరి చూపులు ద్వారమువైపునకుఁ బ్రసరించెను. కుమారిచంద్రికళ యు దనమోముపైనుండి యాదుకూలాంచలమును వెడలించి ద్వారము వైపునకుఁ దిలకింపఁ దొడంగెను.

అంత నొకయువకుఁ డాగదియందుఁ బ్రవేశించెను. అతఁడు సిపాయిదుస్తులను దొడిగియుండెను. వానిని గాంచినంతనే కుమారి చంద్రికళ సంభ్రమచిత్తయై లేచి కూర్చుండి వానితో నిటుల సంభాషింపఁ దొడంగెను.

మాధవీ! నేనిప్పటినుండియో నీరాకకై యెదురుతెన్నులఁ జూచుచుంటిని. నీవిన్నిదినంబులేల యాలసించితివి?"

సిపాయి రూపంబున నాగదియందుఁ బ్రవేశించిన యువకుఁడొక పురుషుఁడు కాఁడనియు, "మాధవి" యను నామమునఁ బేర్కొనఁబడుచుండిన యొక మైయారియనియు మా పాఠకమహాశయులు గుర్తించియుందురు.

అంత నామాధవి యామెతో:—

"ప్రియసఖీ! నీవు నాకొఱ కిటుల తొట్రుపడుచుందువని తలంచియే మగిడివచ్చితిని. కాని-చో, నేనింకను రెండుదినములచట నిలువ వలసియున్నది"

" ఏమి! ఇంకను సంపూర్ణవృత్తాంతము తెలియదాయెనా?"

" లేదు."

" కుమారిగడమునందు బాగుగ సంక్షోభము వ్యాపించియుండును."

" ఏమని వచియింతును! నా కేకొంచెము గొప్ప వృత్తాంతము తెల్లమాయెనో యయ్యది కుమారిగడమునందుననే!"

" నీకేమి తెలిసినది?"

" నేను వృద్ధవణిగ్వరుని రూపమును ధరించి, నీ ప్రతిస్వరూప

ము దీపించుచున్న స్వర్ణాంగుళీయక మెపుడు కుమారమహేం ద్రసింహునకు గానుకగ నొసంగి యుంటినో యానాటి నుండి యు వాని రూపవిలాసమందును వార్తాలాపములయందును నడు వడికల యందునుఁ బొరవు చూపట్టఁదొడంగెను. మఱుసటిదినం బున నాకై (వృద్ధవణిగ్వరునికై) యాపట్టణమంతయు వెదకి వే సారిరి!

"అటులయిన నాసౌందర్యగరిమ వానిపైఁ దనప్రభావమును జూపి యుండెననుట కావంతయు సందియము లేదు. మంచిది. పి దప నేమిజరిగెను?"

"ఆ మఱుసటి దినంబునను మూఁడవనాఁడును కుమార మ హేంద్రసింహుడు మిగులనుదాసీనుఁడయియుంటఁగని వానిమాన సమున కూరటఁ గూర్చుతలంపుతోఁ గుమారనరేశసింహుఁడు గంగానదీజల ప్రవాహమున విహరించుటకు వానిని వెంటఁ గొ నిపోయెను. వారివెంట నొక వృద్ధసేవకుఁడును గలఁడు. వారలు జలయానముపై నధిరోహించి కుమారిగడమునుండి దాదాపు రెండుక్రోశుల దవ్వు వెడలిన పిదప నానదీతీరమందలి యడవి నుండి యొక మధురసంగీతనినాద మతిశ్రావ్యవంతముగ వా రికి వినిపించెను. రాకుమారులిరువురా సంగీతధ్వని యెట్టిదో క నుగొను తలంపుతో నావను తీరమునకుఁ జేర్చి క్రిందికి దిగి యా యడవియందుఁ జొచ్చిరి. అచట వసంతసేన నీరూపము ను ధరించి యొక యుయ్యెలపయిఁ గూర్చుండి యుండెను. ఆమె తొలుతనే తనమాయాజాలమును విస్తరింపఁ జేసి యుండెను. తు దకామె సఫలీకృతమనోరథయై యచటనుండి కుమార మహేం ద్రసింహుని సహితమెటు లదృశ్యమయ్యెనో తెలియరాదు. ఆ మెవెంటఁ గొందఱు యువతీ మణులును గలరు. వారలు రాకు

మారులిరువురను గాంచినంతనే యుయ్యేలపయి నధివసించి యుండిన వసంతసేన నొంటరిగ విడచి పారిపోయిరి. కుమార నరేశసింహుఁడు వారివెన్నంటిపోయెనుగాని, వారిజాడ యిసుమంతయుఁ దెలియదయ్యెను. తుదకాతఁడు నిరుపాయుఁడై మగుడ నా యుయ్యెల నొద్దకుఁ బోయి కాంచునంత నచటఁ గుమారమహేంద్రసింహుఁడుగాని యుయ్యెలపయిఁ గూర్చుండి యుండిన భాసురాంగిగాని వానికిఁ జూపట్టరయ్యెను. అతఁడు తనసహోదరుని తిరోధానమున కబ్బురపడుచు నదీతీరమునకేగి యావృత్తాంతమంతయు వృద్ధసేవకున కెఱింగించి యుండెను.

"వసంతసేన నారూపమును ధరించియుండెనని నీకెటుల తెల్లమయ్యెను?"

"మరలివచ్చు సమయంబున నేనా యడవి మార్గమున బోవుచుండగా (అది యిపుడు ఖండింపఁబడి యుండినది) మణిమయ స్వర్ణకంకణమచటఁ బడియుండుట నాకుఁ జూపట్టెను. నేను దానిని దీసి బాగుగఁ బరీక్షించితిని. నే నాకంకణమును బాగుగ నెఱింగి యున్నాను. నేను దానిని, వసంతసేన హస్తమందనేక మాఱులు గాంచియుంటిని. అందువలన నీకార్యాచరణ మంతయు వసంతసేనదని నాకు నిశ్చయమయ్యెను. నేను సరాసరిగా వసంతసేన యంతిపురములోనికేగి యామెసఖులతో సంభాషించుట వలన నేనుతలంచినటు లావిషయము నిక్కవమాయెను."

"సఖీ! ఆదురితాత్మురాలు నన్నెంతగావంచించియుండెనో చూడుము?"

"నిక్కవము. ఆమె నిన్న బాగుగ వంచించి యున్నది"

"అగుచో, కుమారమహేంద్రసింహుఁ డామె మందిరమున నుండవలెను."

" కాదు. అతఁడామందిరముననుండిన నేనిటుల రిక్త హస్తంబుల తో మగిడివత్తునా?"

" అటులయిన వాని నెచటనో దాచియుంచవలెను."

" నేను వాని జాడ నరయఁదలంచితిని కాని, నీవుమిక్కిలి కలఁత నొందుచుందువని తలంచి నీకీవిషయ మెఱింగించి పోవుటకు నిట కరుదెంచితిని."

" (నిట్టూర్పుఁబుచ్చి) నెచ్చెలీ! ఆమాయలాడి వానిని తన మోహజాలమున జిక్కించుకొని యుండును."

ఇవ్విధంబున బలికి కుమారిచంద్రకళ దురంతనిరాశావిహ్వల చిత్తయయి దురపిల్లసాగెను. అంత మాధవి పెక్కు విధంబుల నామె నోదార్చుచు, "సఖీ! నీవిటులేల దుఃఖించెదవు! ఏనాఁడు కుమార మహేంద్రసింహుని నీయంతికమునకు గొని తెచ్చెదనో యానాఁడు గాని భుజింపనని" పతినబట్టెను.

" కుమారి చంద్రికళ యెవ"రను విషయమును దెలిసికొనుట కు మా పాఠకమహాశయులు వేగిరపడుచుందురు. ఆనామె మిదివఱలో లిఖించియుంటిని. మరల నిపుడు వ్రాయుచుంటిమి. ఆమె విక్రమసింహు ని తనూజాత. ఆమె విక్రము గృహమునుండి యేల వెడలఁగొట్టబడి యుం డెనో తండ్రి గృహమును వీడి పితామహుని మందిరమున యేల నివసిం చుచుండెనో యువి సందర్భానుసారముగ సుబోధము కాఁగలవు.

కొంత సేపటివఱ కామందిరమున నిస్తబ్ధత వ్యాపించియుండెను. తదనంతరము కుమారి చంద్రికళ తన సఖవైపునకుఁ గాంచి:—

" మాధవీ! నీవొంటరిగ నేమి సేయఁజాలుదువే!"

" సఖీ! నీవు చింతిల్లఁ బనిలేదు. సౌదామిని సరోజినులు నిర్వ హింపఁజాలని కార్యములను నే నవలీలఁ జేయఁజాలుదును."

" కానిమ్ము. నీవిపుడు మరల వెడలెదవా?"

" తప్పక నేగెదను. కాని, యొకటిరెండు విషయములను నీతో నిశ్చయించుకొన వలసి యున్నది. కానిచో, తుట్టతుదకు నాపై నిందారోహణ మొనరించుటకు సంసిద్ధవయ్యెదవు"

" సోదరీ! నీపై నిందారోహణము నేనేల సేయఁబోయెదను? నా సుఖదుఃఖములకు దోడు నీవుగాక యన్యులెవరు కలరే?"

" నిక్కువము. కాని, రాఁగలసందర్భములు మిగుల వికటములుగ నుండును."

" మంచిది. నీసంశయమెట్టిదో వ్యక్తీకరింపుము!"

" నీవు కుమారమహేంద్రసింహుని మోహించియుండి వానికై నీప్రాణములను సహితమర్పించుటకు సంసిద్ధురాలవై యుంటివి. తత్కారణంబున వారి కుటుంబవిషయమున నీకు శుభచింత కలిగియుండుట సహజము. ధర్మము. నీతండ్రికిని వారికిని వైరభావ మతిశయించి యున్నది. కుమారమహేంద్రసింహుని నీకుఁ గూర్చు తలంపుతో నేసేయఁబోవు కార్యాచరణములందు నీతండ్రికి గొన్ని కష్టములు సంభవింపవచ్చును. దాన నీకును గొంత దుఃఖము కలుగఁ గలదు."

" నీ వావిషయమున జింతింపఁ బనిలేదు. ఏనాఁడు నాతండ్రి గృహమునుండి వెడలఁగొట్టఁబడితినో యానాఁడే వాని యందలి మమతను ద్యజించియుంటిని. మాతామహుని మందిరమున నాకు స్థానములభింపకున్న వానిభీతి నాజనకునకు లేకుండిన నన్నీపాటికి వైకుంఠధామమునకుఁ బుత్తెంచియుండును. వాని స్వాభావిక యాచరణాదికములు లోకవిరుద్ధమైనవి. అతఁడు మిగుల సంకీర్ణహృదయుఁడు. తండ్రియైన నేమి? తాతయైన నేమి? అనుచితవర్తనులు గౌరవార్హులు కారుగదా? ఇపుడు నాకాకుటుంబమందు లేశమైనను నభిమానము లేదు. సోదరీ! నీవు నాకు మహోపా

కార్యమును గావించియుంటివి. నీ వాదుష్టురాలినిబంధించి తెచ్చి నాస్వాధీన పఱచితివి. ఎపుడు నాహృదయము కోపానలమున సంతప్త మగుచుండునో యపుడామె పయి నాపగఁ దీర్చుకొని కొంత యూరటఁ జెందుచుండును"

" నేనింత దనుక నామెపై నాకుఁ గల కోపమిసుమంతయుఁ దీర్చు కొనఁ జాలనైతిని.

" నెచ్చెలీ! నీవిపుడెట్టి యాటంకమును బలుకకుండిన కొంతకోపము నామెపైఁ దీర్చుకొని యిచటనుండి వెడలెదను."

" ఆటంక మేమికలదు? నీయిచ్చవొప్పన గావింపుము. నీవు వెడలి యామె నిటకుఁ దోడ్తెమ్ము"

మాధవి యచటినుండి లేచి వెలుపలకు వెడలెను. తదనంతరమొక యరగంట కాలము దనుకఁ గుమారిచంద్రికళ మిన్నకఁ గూర్చుండి వివిధాలోచనతత్పరమానసయయ్యెను. ఆమె పరిచారికలందఱు నచటఁ గలరు. కాని, యామెను బలుకరించుట కెవరికినిసాహసము గలుగదయ్యెను.

తదనంతరము మాధవి యొక యపరాధినిని దోడ్కొని కుమారిచంద్రికళ యధివసించియుండిన మందిరములోఁ బ్రవేశించెను. అయ్యపరాధినివయస్సు ముప్పదివత్సరములకుఁ గొంత కొఱతబడి యుండును. ఆమె యొక సుందరాంగి. ఆమె యుచితవస్త్రాలంకారములను ధరించి యుండిన తప్పక సౌందర్యరాశులగు యువతీమణుల పంక్తియందుఁ గూర్చుండుటకుఁ దగియుండును. ఆమె కావించియుండిన నేరమెట్టిదో, యామె కట్టి దుర్దశయేల కలుగుచుండెనో మన మూహింపఁ జాలము.

ఆ స్త్రీని గాంచినంతనే కుమారిచంద్రికళ మోము క్రోధాతిశయంబున నెఱ్ఱబాఱెను. ఆమె దేహవల్లి యుత్కంపింపఁ దొడంగెను. ప

రిచారికలెల్లరు నచట నిలచి యుండిరి కదా? మాధవి యామె యట్టిస్థితిఁ బరికించి యాపరిచారికలలో నొకతె వైపునకుఁ గాంచి హస్తసంజ్ఞాపూర్వకంబుగ నేద్దియో తెలిపెను. తోడనే యాపరిచారిక మఱియొండు గదిలోనికిఁ బోయి యొక బెత్తమును దెచ్చి యామె కొసంగెను. ఆచట నిలిచియుండిన పరిచారికలలోఁ గొందఱు బలాత్కారపూర్వకంబుగా నాస్త్రీ కరపాదంబుల విఱచికట్టి బంతివలె భూమిపైఁ బడఁ దోర్లించిరి.

ఇంత దనుకఁ గుమారిచంద్రికళ మిన్నక యావిషయములన్నింటినిఁ జూచుచుండెను. మాధవి యెపుడు నడుముబిగించి నిలచెనో యపుడామె కోమల హృదయము పరివర్తనము జెందెను. ఆమె కన్నుల యెదుట జరుగనుండిన ఘోరహింసను జూడనొల్లక యచటి నుండి లేచి యిరువురు పరిచారికలను వెంటఁగొని యాశృంగార వనములోనికిఁ బోయి చేరెను. మఱియు నా వృక్షపంక్తుల నడుమ సంచరింపఁ దొడంగెను. కుమారిచంద్రికళ మందిరమునుండి వెడలివచ్చినను, నయ్యపరాధిని యిడుచుండిన బొబ్బ లామెకు శ్రుతి గోచరమగుచుండెను. కొంతసేపయిన పిదప నాయార్తనాదము సన్నగిల్లెను. తదుపరి మాధవి యయ్యపరాధినిని యథాస్థానమునకుఁ జేర్చి శృంగార వనమందు విహరించుచున్న కుమారిచంద్రికళను సమీపించి నిలచెను.

“ సఖీ! మాధవీ! ఆమె యేమైనను వివరించి యుండెనా?”

“లేదు. ఆమె యెచటికిఁ బోఁగలదు? నేఁడు గాకున్న రేపటి దినమున నైనను రేపు గాకుండిన యెల్లుట నైనను జెప్పియే తీరవలయును. సఖీ! నేనిపుడు పని వినియెదను. కారణంబేమన, నేనింకను బెక్కు కార్యములను జక్కనొత్తు కొనవలసి యున్నది.”

“ మంచిది పోయిరమ్ము. నేనును మందిరము లోనికేగెదను. కానిచో మాతామహి యిచట కరుదెంచి నాపైగోపించును.

(మాధవిని కంఠాలింగనము గావించి) నెచ్చెలీ! చూడుము! నేను నీయందలి విశ్వాసము తోడనే జీవించు చుంటిని సుమీ!"

"నాదేహమున నూపిరి యాడుచున్నంత వఱకు నీసిగపూవైనను జెదరఁ జాలదు.

మాధవి యామె వలన వీడుకోలును బడసి యచటి నుండి వెడలెను. కుమారిచంద్రకళయుఁ దన పరిచారికల వెంటఁ గన్యాంతఃపురము లోని కేగెను.

---

## ఇరువదితొమ్మిదవప్రకరణము.

మే మిపుడు రసికజనాగ్రగణ్యులగు మాపాఠకమహాశయులను మఱియొండు రమ్యస్థానమునకు వెంటఁ గొనిపోవు చున్నాము. అచట వారిని విహరింపఁ జేసి యాశ్చర్య జనకంబులగు విషయములను బ్రదర్శించి మాకథాశృంఖలములను సముచితరీతి బంధించుటకుఁ దలంచుచున్నాము. మే మిచట మఱియొక యావశ్యకవిషయమును లిఖించుటకు నిశ్చ గించుచున్నాము. దానిని దెలిసికొనుటవలన ముందునకుఁ బోయిన కొలఁది మాపాఠకమహాశయుల కధికానందము చేకూరఁ గలదు.

మీర లీరమ్యస్థానమందలి యద్భుత విషయములను జదివియవి యొక తిలస్మ సంబంధవిషయములని తలంపరాదు. మఱియు నావిషయములను బాగుగ విమర్శించి చూచుటవలన నవి సంభవములనియు మీకుఁ దోపక మానవు. ఎందు చేతనన, మేము మకల నైదవభాగమందు గాని తిలస్మనామమైనను దలపెట్టము. అటు పిమ్మట జూడ నగును!

మన మిపుడొక రమణీయస్థాన మందుఁ జేరి విహరించుచున్నా

ము. ఆస్థాన మొక కోశదీర్ఘమును నంతియు వైశాల్యమును గలిగి న లువైపుల నెత్తైనపర్వతములచే నావరింపబడి యెంతయు మనోజ్ఞ ముగ నలరారు చున్నది. చూడుఁడు. అందుఁగల నైసర్గికోద్యానమం దు ఫలపుష్పవృక్షజాతులు విస్తారముగఁ జూపట్టుచున్నవి. వానియం దుఁగలసి గులాబి, సంపెఁగ, పొగడ, మల్లె, పారిజాతము మున్నగు పూ లచెట్లు విరివిగఁ బూచి నేత్రపర్వమును గావించుచున్నవి. ఆ మనోజ్ఞ క్షితపర్వతములనుండి పాఱుచున్న సెలయేళ్ళా రమ్యస్థానమును మూఁ డు భాగములుగ విభజించి ప్రవహించుచుఁ దూర్పువైపు పర్వత నిమ్న భాగమున కేగి యచట నొకటిగఁగూడుచున్నవి. అదివర్ణనీయము. నియ మితపరిమాణముకంటె నధికముగఁ గూడుచున్న జలమచటి గుండమం దుఁ బడుచు నేమార్గమున వెడలుచుండెనో మనము తెలిసికొనఁ జాల ము. అచటి జలవాయువు లారోగ్యప్రదములై దురంత వ్యాధిపీడితు లకు సహితము రెండుమూఁడు దినములలో స్వస్థతఁ జేకూర్చు ప్రభా మును గలిగియున్నవి. ఆ రమ్యస్థానమున నెంతకాలము నివసించినను మానసంబులకు నిర్వేదకము జనింపఁజేయక, శుకపికశారికానికరమధు రకూజననిస్వనంబుల నామోదమును గూర్చునదియై యొప్పారు చున్నది.

ఆ మనోహరోద్యానమం దొకతట్టు సొంపెసలారుచున్న హర్మ్య రాజమెంత పురాతనమైనదియైనను దనశిల్పకళానైపుణ్యమునఁ దేజరి ల్లుచుఁ జూపఱమానసంబుల నాకర్షింపఁ జాలి యుండెను. దాని ముం దొక చిన్న తటాకమును గలదు. ఆ కమలాకరమునకు నలుదెసల బా గుగఁ బెరిగి యుండిన పుష్పవృక్షజాతులును గుల్మలతాదులును పుష్ప సంభరితములై కమ్మని తావుల నలుగడల వెదజల్లుచుండెను.

ఆ సౌధరాజము నిర్మానుష్యముగాక దాదాపిరువది యైదుగురు సుందరీమణులకు నివాసస్థానమై పెంపొందుచున్నది. చూడుఁడు! ఈ

మనోహర సాయంతనసమయంబున నాపువ్వుఁబోఁడులా మందిరరాజమునుండి వెడలి యా యుపవనంబున విహరించుచుఁ దమజీవితములను సార్థకపఱచుకొనుచుండిరి. ఆపల్లవాధరలు పల్లవాస్త్రుని ములుకులో యన నొప్పారుచు మందమందయానంబుల నందు నడయాడుచు యావృక్షములనుండి పుష్పాపచయమును గావించుచు నాసుమంబుల నొకరిపై నొకరు విసరుకొనుచుఁ బరిహసించుకొనుచు నానందసాగరమున నోలలాడుచుండిరి. మన కుమార మహేంద్రసింహుఁ డసమానసౌందర్యసముజ్జ్వలయగు నొక విద్రుమోష్టి చేతఁ జేయిఁగలిపి యాపుష్కరిణికి దూర్పు వైపునఁ బచారు చేయుచుండెను. వారిరువురు సంభాషించుచు, శృంగారచేష్టల మాటిమాటికి మేలమాడుచు, నీసంసార ప్రపంచమును మఱచి యుండిరి.

తుదకు వారిరువురుఁ బరిశ్రాంతులయి యాకమలాకరతీరమందలి చంద్రకాంతశిలావేదికపయిఁ గూర్చుండి యిటుల సంభాషింపఁదొడంగిరి.

మహేంద్ర:—ప్రేయసీ! వసంతా! నాసంశయ మెవ్విధంబునను దీరకున్నది. నాఁడు గంగానదీతీరమందలి యడవి యందొక యుయ్యెలపయి నూఁగుచుండినదానవు నీవుకావు. ఏలదాచెదవు? నిజమును వక్కాణింపుము!

వసంత:—మనోహరా! మీరిటులేల సంశయాకులచిత్తులగుచుంటిరి? మీరనుదినము నన్నీవిషయమునే ప్రశ్నించుచుంటిరి. ఆశ్చర్యము! నేను శపథపూర్వకంబుగ సదుత్తరమొసంగి యున్నను మీరు నా పలుకులను విశ్వసింపఁ జాలకున్నారు.

మహేంద్ర:— (తనవ్రేలియందలి యంగుళీయకమును జూపి) చూడుము. ఈ చిత్రముతో నీస్వరూపము సరిపోలకున్నది. కారణంబేమి?

వసంత:—అయ్యది చిత్రకారుని దోషమైయుండవలెను. లేదా, మీరే తప్పులు మిమ్ము వచించుచుండవలెను.

మహేంద్ర:—విద్యుల్లతాంగీ! ఏమయిననేమి, నేను నీమోహజాలము న బాగుగ జిక్కియున్నానుగదా!

“ నేనేమి చేసితిని? నన్ను గలసికొను ప్రయత్నము మీరే చేసి యున్నారు”

“ ఏమి! నేను ప్రయత్నించనిచో, నన్ను బలాత్కారముగఁ గొని తెచ్చెదవా?”

“పోనీయుఁడు. మీరే నాపైనుపకార చింతగలిగి యున్నారు! నే నయ్యది యంగీకరించుచున్నాను.”

“ (నవ్వుచు) ఉపకార చింతయే యననేల? నా దేహమనంబుల నీకర్పితుఁడనై యుంటిని!”

“ (సిగ్గుచే శిరమువంచుకొని) చాలును. కట్టి పెట్టుఁడు. మీ యఃమాయకత్వమును బ్రదర్శింపకుఁడు”

“ కానిమ్ము! ఇఁక నీప్రసంగమును గట్టిపెట్టి నీప్రతి నను జ్ఞప్తికి దెచ్చుకొనుము. నిర్ణీతదినమునేఁడే కదా? పిదప నేమి జరిగినను నీనిజ వృత్తాంతముల నేఁడు వివరింపక తప్పదు. నీవెన్నిమాఱులో కావించియుండిన ఘోరశపథములను మరల జ్ఞప్తికిఁదెచ్చుచున్నాను. అనృతములను భాషింపకుము. కానిచో, తుదకుఁ బశ్చాత్తాపము నొందగలవు!”

“ మంచిది! నేఁడు కూడ నన్ను మన్నింపుఁడు. నేనీప్రపంచమందు మీకంటె నధికముగ నెవ్వరిని గోరుటలేదు. మీపై నాన పెట్టుకొనుచున్నాను. రేపటిదినంబున మీసంశయములన్నింటిని నివర్తిల్లఁ జేసెదను. (ఆకసము వంకఁ బరికించి) మనోహరా! నాకు వేళయైనది. నాకు సెలవొసంగుఁడు. రెండుగంటలకాల

ములో మగిడి వచ్చెదను.

“దీర్ఘ నిశ్వాసమునుబరిత్యజించి) కానిమ్ము! రేపటిదినముననే వచియింపుము. పోయి రమ్ము. రెండుగంటల కాలము కంటె నధికముగ నాలసింపకుము.”

వసంతసేన యచటినుండి లేచి నిలిచి యాసౌధములోని కేగెను. ఇటఁ గుమారమహేంద్రసింహుఁ డేకతంబునఁ గూర్చుండి, “వసంతసేన యెవరు? ఈమెకు దలిదండ్రులు లేకుండిరా? ఈమెతన వృత్తాంతములనువివరించుట కేల శంకించుచున్నది? ప్రాతః సాయంకాలములందనుదినమెచటికిఁబోయి వచ్చుచున్నది? ఏమార్గమున వెడలుచున్నది? ఈమె నాపై బద్ధానురాగయై యున్నదనుట కెట్టిసంశయమును లేదు. కాని, యీమె నన్నిటు లేల బంధించి యుంచినది? ఈస్థానమెంత మనోజ్ఞముగ నలరారుచున్నను నామానసం బేలకో పరితపించుచున్నది. నేనేమి సేయుదును? ఏమియుఁ దోఁచకున్నది. ఇచటినుండి వెడలుదమన్న మార్గమెందును జూపట్టకున్నది. ఈపర్వతములను దాఁటి పోవుదమన్నను సాధ్యముగాదు. అద్దియుఁ గాక నామె కెవ్విధంబునను దుఃఖము గలిగించుటకు నామానసం బొప్పకున్నది కదా?” యని పరిపరివిధంబులఁ జింతింపసాగెను.

కుమారమహేంద్రసింహుఁడు సంక్షుభిత మనస్కుఁడయి యచటినుండి లేచి యిటునటు బచారుసేయుచుఁ దిన్నఁగా నొక ప్రవాహతీరమునకుఁ బోయి చేరెను. అందలి నిర్మలజలములను దిలకించుచు నాప్రవాహతీరమును బట్టి ముందునకు వెడలసాగెను. తుదకతఁడెచట ప్రవాహములు మూఁడును సంగమించుచుండెనో, మఱియు నియమితపరిమాణము కంటె నధికముగఁ గూడుచున్న జల మేగుండమున బతితమగుచుండెనో యచ్చోటునకుఁ బోయిచేరెను.

అంతనొక సన్నని మొలుంగు వానికి వినుపించెను. అతఁడు శిర

ము పైకెత్తి యాపర్వతము వైపునకు గాంచినంతఁ బదిపదునైదుగజముల దవ్వున నొక యువతి నిలచియుండెను. "ఈమె యెవరు? ఈమె వసంతసేన పరిజనులలోనిది కాదు. ఇచటికెటులరాఁగలిగె"నని యబ్బురపడుచుఁ దదేకదృష్టి నామెవైపునకుఁ బరికింపఁ దొడంగెను. అంత నా యువతి హస్తసంజ్ఞాపూర్వకంబుగ నచటనిలిచియుండుటకు వానికి దెలిపి యందు గొంతదవ్వున విహరించుచుండిన వసంతసేన పరిజనుల దృష్టిపథమునఁ జిక్కకుండ వృక్షముల చాటున దాఁగుచుఁ గ్రిందికిదిగి కుమార మహేంద్రసింహుని సమీపమున కరుదెంచి యొక మడచియున్న కాగితమును వానికొసంగెను. ఆతఁడేద్దియో యామెనుబ్రశ్నింపఁ గోరెను గాని, వెంటనే యామె వానితో, "ఈలేఖను జదువుట వలన సకలవృత్తాంతములు తెలియఁగలవు. నన్ను వేఱుగ బ్రశ్నింప నగత్యములేదు. నేనిచట నిలువ వీలుగలుగదు. మనల నెవరైనను గాంచిన యధిక విపత్తు వాటిల్లఁగల"దని పలికి వానికి వాక్బంధనముగావించెను. మఱియు వాని ప్రత్యుత్తరమునకై నిరీక్షింపక నాయువతి వెంటనే యా పర్వతముపయి నధిరోహించి ముప్పదినలుబదిగజముల దవ్వునకుఁబోయి యదృశ్యయయ్యెను. కుమారమహేంద్రసింహుఁ డాశ్చర్యచకితుఁడయి కొంతసేపటి వఱకాయువతి వెడలినవైపునకుఁ గాంచుచుండెను. కాని, యామె మరలఁ జూపట్టదాయెను. పిదపఁ గుమార మహేంద్రసింహుఁ డాకాగితమును విప్పి చదువఁదొడంగెను. దానియం దీదిగువ వ్రాసిన విధంబున లిఖింపఁ బడియుండెను.

"బాపురే! నన్ను జిత్రరూపంబున మీకెరమం దర్పించుకొని యుంటిని కాని, మీరు నావృత్తాంత మించుకైన నరయుటలేదు. మఱి యొండు యువతీ ప్రేమపాశమున బాగుగ జిక్కియుంటిరి. ఆమె నా రూపమును ధరించి మిమ్ము వంచించియుండిన విషయము మీరెఱుంగరు. మఱియొండు యువతీప్రేమసదనమున జొచ్చియున్న మీకు నా

జపి ఇ— 'మేలకలుగఁగలదు?"

మీా రీలేఖను జదువుకొనిన పిదప నొక యక్షరమైనను జూపట్టనటుల చిన్నిచిన్ని తునుకలుగఁ జించివేయుటకు మీాకు నాయాన గలదు.

ఇట్లు,

భవదీయ ప్రేమాభిలాషిణి

చంద్రికళ.

ఆలేఖను జదివిన మాత్రముననే కుమార మహేంద్రసింహుని హృదయము దడదడ గొట్టుకొన సాగెను. అతఁడు సంక్షుభితమనస్కుఁడై యచటి శిలాఫలకముపైఁ గూర్చుండి యివ్విధంబున యోజింపసాగెను.

“ నాకరజాంగుళీయకమందలి చిత్రముతో వసంతసేనస్వరూపము సరిపోలకున్నదని నేను తొలుతనుండియు శంకించుచునేయుంటిని. ఆమె యెంతసౌందర్యశాలినియైనను, భాగ్యవిశేషమున నింతదనుక నేను కుమారి సుందరస్వరూప మీాస్వర్ణాంగుళీయకముపై దీపించుచున్నదో యామెనే నేను మోహించియుంటిని. ఇపుడేమిసేయుదును? ఒకమాఱుగ వసంతసేనతో జగడముపెంచుకొనుటయు యుక్తిసంగతముగాదు. ఆమె కుపితయై నన్నొంటిగ నిచటవిడచి తనపరిజనులను వెంటఁగొనిపోయిన నేనేమిసేయఁగలను? ఏకాకినై తద్దరిల్లుచుఁ బ్రాణములను గోల్పోవుటదక్క నన్యోపాయమెద్దియుఁ గలుగదు. ఇచటినుండి వెడలుమార్గము నాకుఁ దెలియదుకదా! పోనిమ్ము. ఈపర్వతములపై నదిరోహించిపోవుదమన్న సాధ్యముకాదు. కానిమ్ము! నేఁడు తప్పక 'నామెమానసమునకుఁ గొంతచింతగలిగించి చూచెదనుగాక! కాదుకాదు. నేఁటిరాత్రియంతయు మిన్నకుండుటయే సముచితము. ఆమె నిజవృత్తాంతమును రేపటిదినంబున వెల్లడింతునని ప్రతినఁజేసియున్నదికదా? తుదకామె య

నృతముల వచియించును గాని నిజమెన్నటికిఁ దెలుపదు. ఔను. నాకొక విషయము దోఁచుచున్నది! (కొంతసేపుమిన్నకుండి) మంచిది. చూచెదనుగాక! నాకిపుడు లేఖనొసంగిపోయిన యాయువతి యిచటికేమార్గమున నరుదెంచియున్నది? (పర్వతమువైపునకుఁ గాంచి) అదిగో! ఈపర్వతముపై నెంతదవ్వువఱ కామె వెడలి యదృశ్యమైయుండెనో యంతదనుక మార్గము చూపట్టుచున్నది. బహుశః యాస్థానముదనుక జనుల రాకపోకలు జరుగుచుండవలెను. వెలుపలకు వెడలుట కాస్థానంబున సురంగమార్గమెద్దియైనను దప్పకనుండవలయును. కనుగొనియెదను గాక" యని తలంచి కుమారమహేంద్రసింహుఁ డచటినుండి లేచి నిలచెను.

తదనంతరమతఁ డాపర్వతముపై నెక్కిపోవుచు నాయువతియదృశ్యమైనతావునకుఁ బోయిచేరెను. అచట నొకమనుష్యుఁ డవలీలఁ జొచ్చుటకుఁ దగినంత విశాలముగల సొరంగమొండు వానికిఁ జూపట్టెను. ఆయువతి తప్పక నీమార్గమునఁనే వెడలియుండునని కుమారమహేంద్రసింహుఁడు నిశ్చయించుకొని యధికప్రమోదభరితుఁడై యాసొరంగమందుఁ బ్రవేశించెను. దట్టమగుచీఁకటులకిరవగు యాసురంగమార్గమునఁ బదియడుగులదూరము వెడలినపిదప వానిపాదములక్రింద జలముతోఁచెను. ముందునకుఁ బోవుచుండినకొలఁది యాజలమువృద్ధికాఁ దొడంగెను. అయినను, నాతఁ డతిసాహసముతో ముందునకు వెడలుచునేయుండెను. ఎపు డాతఁ డాజలమందు గుత్తుకబంటిలోఁతువఱకు వెడలెనో యచటి పర్వతశిలలు నీటివైపున కేటవాలుగా వంగియుండి యీదుకొనిపోవుటకైన ననువుగానియటు లామార్గమును బంధించియుంచెను. ముందున కేగుమార్గములభింపమి కుమారమహేంద్రసింహుఁడు నిరుపాయుఁడై యచటినుండి మరలవలసినవాఁడాయెను. కాని, తనకు లేఖనొసంగిపోయిన యువతివస్త్రములన్నియు నీట దడిసియుండుటచే నా

మె యీమార్గముననే వచ్చి వెడలియుండెనని వానికి గట్టినమ్మకము గలిగి యుండెను.

ఆపర్వతముల మధ్యప్రదేశమందలి యుద్యానవనమందు విహరించుచుండిన వసంతసేన పరిజనులగుసుందరీమణులు కుమారమహేంద్రసింహు నచటఁగానక దల్లడిల్లుచు నచటిసౌధములోనికిఁ బరుగులిడిచుఁబోయిరి. ఆమందిరమంతయు వెదకిచూచిరి. కాని యెచటను వానిజాడ చూపట్టదయ్యెను. అంత నాసుందరీమణులలోఁ గుశాగ్రబుద్ధియగు యొకపడఁతి వారితోఁ, "నెచ్చెలులారా! ఇచటనేల వెదకెదరు? అతఁడు తప్పక నా సురంగమార్గమునొద్దఁ జూపట్టఁగలఁడు నడువు"ఁ డని పలికెను.

తుద కాయువతులంద ఆసొరంగమునొద్దకుఁ బరుగులిడిచుఁ బోయి తడిబట్టలతో నచటి సురంగమార్గమునొద్ద నిలచియుండిన కుమారమహేంద్రసింహుని కనుగొనిరి.

కుమారమహేంద్రసింహుఁడు వసంతసేన వెడలిసపిదప నచటి నుండి ప్రవాహతీరముననే యచ్చోటునకరుదెంచుటయందును, నచటి శాతిపలకపయిఁ గూర్చుండియాలోచించుటయందును, సొరంగములోనికిఁ బోయివచ్చుటయందును రెండుగంటలకాలముపట్టెను. రజనీకాంతుఁ డంతకుఁబూర్వమే యుదయించి తనప్రశాంతచంద్రికల నలుగడల వెదఁజల్లుచు నారమ్యస్థానమున కధికశోభనుగూర్చుచుండెను.

అంతవసంతసేనయు నాసౌధములోనికరుదెంచి యచట నొకదీపపుప్రకాశముగాని పరిజనులుగాని చూపట్టకుండుటచే మిక్కిలి కలఁతనొందుచు, వారికై యిటునటుతిరిగి వెదకిచూడకయే తిన్నఁగా నాసొరంగమువైపునకు దారిపట్టి యనతికాలములో నచటికిఁబోయి చేరెను.

అచటఁ దనచెలిమికత్తెలను బరిచారికలను గాంచుటయేకాక కుమారమహేంద్రసింహుఁ డార్ద్రవస్త్రములతో సురంగమార్గమునుండి క్రిందికి దిగివచ్చుచుండుటఁగని క్రోధఘూర్ణితమానసయై దేహముకంపిం

చుచుండ బెదవులదురుచుండఁ దనపరిజనులపై మండిపడుచు మీఁప్రమాద మువలన నేఁడు నాకధికానర్థము సంభవింపనుండెను. ఇంకొంచెకే మిమ్మిటకుఁ జేర్చియుంటినా? యనునది దక్క వేఱెద్దియు నామెపలుకఁ జాలదయ్యెను.

ఆమె యధికప్రియత్నముతోఁ దనకోపమునడచిపట్టి కుమారమహేంద్రసింహుఁడు క్రిందికిదిగివచ్చినపిదప వింతవికాసము మొగమునకుదెచ్చిపెట్టుకొని వానితో, "మనోహరా! మీ రాసారంగములోని కేగియుంటిరా? అనెను.

మహేంద్ర:— ఔను.

వసంత:— ఇది యెట్టియవివేకము! దానియందు విషజంతువు లధికము గఁగలవు. మేమాభీతిచే నచ్చోటనకుఁ బోవుటకైనను సాహసింపము.

మహేంద్ర:— నేనిందు విహరించుచుఁ బ్రవాహతీరముననే నిచటికివచ్చిచేరితిని. ఈసారంగమెంతదవ్వవఱకు వెడలియుండెనో చూడవలయునను కోరిక నాకుఁగలిగెను. నేను దానియందుఁజొచ్చి నీటియందుఁ దడిసి మగిడివచ్చితిని.

వసంత:— మంచిది. నడువుఁడు. వస్త్రములను మార్చుకొనుఁడు.

ఆసారంగమం దెద్దియోరహస్యముకలదు. కావుననే వీర లివ్విధంబునఁ దొట్రుపడుచుండిరని తలంచుటచేఁ గుమారమహేంద్రసింహు నిసంశయ మింకను దృఢరూపమునుదాల్చెను.

కుమారమహేంద్రసింహుఁ డారేయియంతయు వివిధాలోచనలయందుఁగడపెను. వసంతసేనయు వానికార్యాచరణములను దలపోయుచు శంకాతంకమనస్కయై యారేయియంతయు జాగరణమందుఁ గడపెను.

(ఇది మూఁడవ భాగము.)

# శ్రీవిచిత్ర నవలా గ్రంథమాల.

నరసాపురం, పశ్చిమ గోదావరి జిల్లా

(నూతన స్థాపితము.)

1—6—28.

విచిత్ర కల్పనల కాలవాలమగు నవలలు — నవరసభరితములగు నవలలు — 200—250 పుటలకు మించకుండ — మూఁడు మాసముల కొక్కటిగ వెలువడు చుండును.

(1) ఈ యుద్యమము నాదరించువారలు మూఁడు తరగతులుగఁ బరిగణింపఁబడుదురు 1 రాజపోషకులు, 2 పోషకులు, 3 చందాదారులు.

1. ఇచ్ఛానుసారముగఁ దగు విరాళముల నొసంగువారు రాజపోషకులు.

11. సంవత్సరము 1 కి రు 30—0—0 లు చొప్పున నాలుగు సంవత్సరములలో రు 120—0—0 లు విరాళము నొసఁగువారలు పోషకులు.

భాషాభిమాను లందఱుఁ దగు ప్రోత్సాహము నొసంగి యీ గ్రంథమాలాభివృద్ధికై తోడ్పడుదురుగాక.

—* చందాదారుల నిబంధనలు *—

(2) ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా రు 0—8—0 లు చెల్లింపవలెను.

(3) ఇందు మూఁడుమాసముల కొక్కటిగ వెలువడుచుండు మంచి కేపరు బైండుగల ప్రతి గ్రంథము రు 1—0—0 కి మాత్రమే చందాదారులకుఁ బంపుచుందుము.

(4) చందాదారులుగాఁ జేరఁ గోరువారు వెనుకటి గ్రంథము లన్నియుఁ గొనవలయునను నియమములేదు. వారు కోరినచో వెనుకటి గ్రంథము లన్నియుఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడు ప్రధానాంగములగు గ్రంథములను మాత్రము చందాదారులు తప్పకఁ బుచ్చుకొను చుండవలెను.

(5) ఇందప్పు డప్పు డనుబంధములుగఁ బ్రకటింపఁబడు చిన్న నవలలు — నాటకములు — చందాదారులు తప్పక పుచ్చుకొన వలయునను నియములేదు. కోరినవారి కిఁ బంపుచుందుము.

(6) చందాదారులకు సంవత్సరమున కొక పర్యాయము చిన్న నవలలు బహుమతి పంపఁబడును.

(7) పోస్టుఖర్చులు గ్రంథములను స్వీకరించువారలే భరింపవలయును.

(8) వి. పి. మూలముగాఁ బంపబడు గ్రంథములను చందాదారులు స్వీకరించని యెడల ముందట్టి వారి కీగ్రంథమాలనుండి గ్రంథములు పంపబడవు.

(9) చందాదారులుగఁ జేరఁ గోరువారు, ఏజెంట్లయొద్ద నీ క్రింద సంతకము చేసినవారి యాజ్ఞాపత్రము లేనిదే చేరరాదు. అట్లు చేరినవారి ప్రవేశరుసుమున కీగ్రంథమాల యెంతమాత్రము బాధ్యము కానేరదు.

కోసూరి రంగయ్య అండ్ సన్సు,

ప్రకాశకులు.

# MAYAMAYI PART IV.

## మాయామయి.

(నాల్గవ భాగము.)

మంత్రోచ్చరణము లేకుండగనే మాయాస్రవంతి ప్రవహించు
చున్నది! సహజములగు సాంకేతికములతో సర్వమును మోసగింపఁబడు
...ది! సమయోచితంబులగు వేషభాషణంబుల సకల కార్యములు
...హింపఁ బడుచున్నవి! అపరిమితాహంభావములతో నయ్యారీతన
...లు విస్తరించుచున్నవి! దుర్భేద్యములయిన కట్టడములతో — దుర్ని
...్య తేజోవంతములైన శిలామండపములతో — దురవగాహములైన
యంతర్మార్గములతో — దుర్గమములయిన యడవులతో — పర్వత
పంక్తులతో—యంత్రములతో—విగ్రహములతో—దృగ్గోచరము
లగు ప్రాకారములతో మహా మాయామయి నిండియున్నది. మొదటి
మూఁడుభాగములు చదివిన మా పాఠక మహాశయులకు దీనివిషయము
... మేము వేఱుగ వర్ణింప నగత్యములేదు.

పోస్టేజీ గాక వెల

చందాదారులకు 1—0—0 ఇతరులకు రు 1—౨—0



